# Prabhavati Pariniyam

BY

Voruganti Somasekhara Kavi,

AND

*Published by*

VORUGANTI SREERAMULU,
Son of
Narasappa Garu.



SECOND EDITION 1000 COPIES.



PRINTED AT
SREE LAKSHMI PRINTING WORKS,
Jagannaickpur, Cocanada.

1937.

శ్రీరస్తు.

# ప్రభావతీపరిణయము.

ఇది.

నందిగల్లుగ్రామ వాస్తవ్యులును, రాధా కృష్ణార్జున నాటకాది
గ్రంథ ప్రబంధకర్తలును నగు

## ఓరుగంటి సోమశేఖర కవిగారిచే

రచియింపఁబడి

వారి పౌత్రుఁడును, నరసప్పగారి కుమారుఁడును నగు
శ్రీరాములుగారిచే ప్రచురింపబడి ప్రకటింపబడినది.



శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాల,
జగన్నాథపురం, కాకినాడ.

1937.

 [Price Rs. 1-0-0.

# ప్రభావతీపరిణయపీఠిక.



ఈప్రబంధము విశాఖపట్టణమండలమున మాడుగులను జమీందారీగ్రామమునకుఁ బదిమైళ్ళ దూరమునందున్న నందిపిల్లియను నగ్రహారమున నివసించియున్న యోరుగంటి సోమప్ప యను సోమశేఖరకవిచే రచియింపఁబడినది. ఈకవి ద్రావిడశాఖాబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రోద్భవుఁడు, జోగప్ప నరసమ్మలకుఁ బ్రథమపుత్త్రుఁడు, కిత్తప్ప రామచంద్రుఁడు సర్వేశ మనువారల కగ్రజుఁడు. క్రీ. శ. 1818 సరియగు బహుధాన్య నామసంవత్సర కార్తీక శు ౧౦ దినమున జననమొంది 85 యెనుబదియైదు సంవత్సరములు జీవించి కొంచెముజబ్బుపడి క్రీ. శ. 1903 శోభకృన్నామసంవత్స రాషాఢ శు ౧౦ ఆదిత్యవారమున నివ్వాటినుండి నందిపిల్లి కేగి ప్రతిపద్దినమున సన్యసించి బ ౭ శుక్రవారమునాఁడు సిద్ధింబొందెను.

ఈకవి మంచిసాహిత్యముగలవాఁడయి మొదట భామకలాపము మొదలగు యక్షగాన కృతుల రచియించుచు 'శ్రీకృష్ణలీలావిలాస' మను నొక యక్షగాన కృతిని రచియించి క్రీ. శ. 1850 సం॥ ప్రాంతమున మాడుగులు సంస్థానాధీశులగు శ్రీకృష్ణభూపతిదేవ మహారాజుగారి కడ కరుదెంచి యది వారికిఁగృతియిచ్చె. యాసంస్థానాస్థానకవిగానున్న మంత్రిప్రెగడ ప్రకాశకవితోఁ దుల్యముగఁ దాను గవిత్వముఁ జెప్పనూహతో మెలఁగుచుండెను. ఆకాలమునకుఁ బ్రకాశకవి పెద్దవాఁడును గవిత్వము చెప్పుటయందు మిగుల నేరుపరియునై 'సీతారామ చరిత్ర'మను నాఱాశ్వాసముల ప్రబంధమును రచియించి 'కృష్ణార్జున చరిత్ర' మను ద్వ్యర్థికావ్యమునుగూడ రచియించుచుండెను.

శ్రీకృష్ణభూపతిదేవ మహారాజుగారొకనాఁడు సంస్కృతహరివంశము పురాణకాలక్షేపము చేయుచున్నతఱి వజ్రనాభుని వధావసర

మునఁ బ్రభావతీప్రద్యుమ్నుల వర్ణనములు మిగుల వింతలుగొలుపునవిగా నుండుటంబట్టి యీకవి యీకథను ప్రబంధరూపమున రచియించిన బాగుండునని తలంచి పురవర్ణనము మొదలగు ననేకవర్ణనములును గొంతకథయును గూర్చి యించుమించు మూఁడువందల పద్యముల దనుక రచియించి, చిన్నప్రబంధముగాఁ బూర్తియయినపిమ్మట నమ్మహారాజునకు సంకితము గావించు తలంపుతో మిగిలిన గ్రంథమును రచియించుచుండెను. అప్పుడు ప్రకాశకవి పెద్దవయసు వాఁడును, ప్రౌఢుఁడును, సంస్థానకవియునై యున్నందునఁ; జిన్నవయసువాఁడును, సామాన్యకవితా ధోరణిగలవాఁడును, యక్షగాన కృతిని రచియించు వాఁడును, వైదికియునగు సీతనిని గౌరవింపక సీతనికవిత్వమునఁ దప్పులుపట్టుచుఁ దరికిఁ జేరనీయక తఱిమి వేయుచుండుటచేఁ బ్రకాశకవి రచియించిన సీతారామ చరిత్రముమీఁదను ద్వ్యర్థిప్రబంధమగు కృష్ణార్జున చరిత్రముమీఁదను దనకవిత్వమును రాజాదరింపఁడని నిశ్చయించుకొని ప్రకాశకవి రచియించుచున్న కృష్ణార్జున చరిత్రముకన్న గొప్ప కావ్యము రచియించి రాజసన్మానముఁ బొందనూహించి "రామకృష్ణార్జునచరిత్ర" మను త్ర్యర్థికావ్యమును రచియింప నారంభించి ప్రభావతీ ప్రద్యుమ్నము నొకమూలఁబడవేసెను.

ఆ 1860 సంవత్సర ప్రాంతమునఁ బ్రారంభించిన రామకృష్ణార్జునచరిత్రమను త్ర్యర్థికావ్యము పూర్తియగునప్పటికిఁ దనకంటె గొప్పకావ్యమురచియించెనను నసూయ ప్రకాశకవికి మనమున నతిశయించి యీతని కవిత్వమున దోషములనెన్నుచు సంస్థానమునఁ గాలుపెట్టనీయక తఱిమఁగొట్టించె. ఈకవి యీసంస్థానకవితో వైరుధ్యము సంప్రాప్తమాయెననియు, నీగ్రంథమునునీమహారాజునకుఁ గృతియీయఁ బొసఁగదనియు నిశ్చయించుకొని యచటనుండి వెడలి విజయనగరసమీపముననున్న తాళ్ళవలస గ్రామవాస్తవ్యులును, నలమండ విజయనగర

ఠాణాలకు నధిపతులునునగు శ్రీపూసపాటి నారాయణరాజుగారి నాశ్రయించి కృతిపతి నామాంకితముగా "రామకృష్ణార్జున నారాయణీయ" మని యీకృతికిఁ బేరిడి క్రీ. శ. 1877 సరియగు నీశ్వర సంవత్సర మాఘ శుద్ధ పంచమీదినమునఁ గృతియొసంగె. ప్రకాశకవియుఁ దన యఱువది మైదవయేఁట (1873 సంవత్సరము మేనెల 11 తేది) శ్రీముఖ సంవత్సర వైశాఖ శుద్ధ ౧౪ భానువారంబున స్ఫోటకరోగంబున మాడుగులయందే కీర్తిశేషుండయ్యెను.

శ్రీకృష్ణభూపతి దేవమహారాజుగారు క్రీ. శ. 1875 సంవత్సరము డిశంబరు నెల ది 25 తేదీకి సరియగు యువ సంవత్సర మార్గశిర బ ౧౩ శనివారము రాత్రి పరలోకగతులయిరి.

రామ కృష్ణార్జున నారాయణీయ కృతిపతి క్రీ. శ. 1902 శుభకృత్సంవత్సర ప్రాంతమునఁ గాలధర్మమునొందెను.

ఈకవి మాడుగులు విడిచి వచ్చిన పిదప ఆ 1870 సంవత్సర ప్రాంతమున హేలావతీ పరిణయమనెడు కుబ్జావివాహమును మూఁడాశ్వాసములు గల మఱియొక చిన్న ప్రబంధముగా రచియించి చోడవరమున డిప్యూటీ తహాశ్శీలుదారుగానున్న న్యాయపతి నరసింహస్వామి పంతులుగారికిఁగృతి యొసంగె. ఇందలి పద్యములు చాలదనుకఁ బ్రభావతీ పరిణయము లోనివి. ఇప్పుడు నాకుదొరకిన హేలావతీ పరిణయము వ్రాఁత ప్రతియందలి యాశ్వాసాది పద్యము లేమి కారణముననో చించి వేయఁబడినవి. 1. 3. ఆశ్వాసముల తుది పద్యములు వ్రాయఁబడి యుండలేదు; కృతి పతి వంశావళియులేదు: కథాప్రారంభము నుండిమాత్రమే కలదు.

ఆ 1880 సంవత్సర ప్రాంతమున (విక్రమ సంవత్సరమున) రామాయణకథ నయిదాశ్వాసముల పద్యకావ్యముగా రచియించి

"నరసభూపాలరాజీయ" మను పేరిడి రామకృష్ణార్జున నారాయణీయ కృతిపతియగు పూసపాటి నారాయణరాజగారి పుత్త్రుఁడు నరస రుఁడు భూపాల రాజుగారికిఁ గృతి యొసంగె. తండ్రియుఁ గుమా రుఁ భిన్నకృతులకుఁ గర్తలైనను, ఏకకర్తృకములగు కృతులకు నధిపతుల గుటచేఁ దత్కృతులయందలి వంశావళులు భిన్నపద్యములతో రచియిం పక జనకుని కృతిలోని పద్యములే పుత్త్రుని కృతియందు నునిచె. పూర్వ కృతములైన ప్రభావతీపరిణయములోని పద్యములఁగొన్నిటిని, హేలా వతీపరిణయములోని పద్యములఁగొన్నిటిని దీనియందుఁ జొనిపె.

ఆ 1882-83 సంవత్సర ప్రాంతమున బరంపురము డిస్ట్రిక్టుకోర్టులో చీకటి, తర్లా, టెక్కలి లోనగు జమీందారుల పక్షమున న్యాయవా దిగాఁ బనిచేయుచు విశేషద్రవ్యము నార్జించి దానధర్మము లాచరించి వదాన్యుఁడని పేరువడసి రామశతకమును, జానకీపతిశతకమును నను చిన్నపుస్తకములను జెప్పి కవులయెడ మిగుల నాదరము గలవాఁడయి గంజాముడిస్ట్రిక్టు ప్రాంతమున మిక్కిలి ఖ్యాతివడసిన శ్రీ జయంతి కామేశంపంతులు F. A. B. L., గారి యొద్దఁగొంతకాలము నివసించి చిన్నయసూరిబాల వ్యాకరణమునందలి సూత్రములకును, నుదాహార ణములకును బద్యములువ్రాసి యాయనకుఁగృతియిచ్చె. కామేశం పం తులుగారు ఆ 1885 సం॥ ప్రాంతమున మృతిఁబొందిరి.

ఆ 1892 సంవత్సరప్రాంతమునఁ దత్త్వాదర్శమనునొక చిన్న వే దాంతగ్రంథమును రచియించి విశాఖపట్టణ వాస్తవ్యులగు శ్రీగోడే గజపతిరావుగారికిఁ గృతియిచ్చె.

ఆ 1899 సం॥కు సరియగు వికారి సంవత్సర భాద్రపదమాస మునఁ గాకినాడకు వచ్చి ప్రభావతీ పరిణయ మను నొక ప్రబంధము నిచ్చట నెవ్వరైనఁ గృతిగాఁ గైకొనువారుగలరా? యని యారసి

తాను దెచ్చిన * శిథిలమగు తాటియాకులప్రతిని జూపింప నందలి పద్యములు నేనును నిచ్చట మఱికొందఱు పండితులును జదివిచూచి గ్రంథప్రాశస్త్యమునకు నలరి ప్రస్తావవశమునఁ గృతిపతియగు రావుసాహేబు శ్రీపైండా వెంకటచలపతిగారికిఁ దెలుప నాశ్వయుజశుద్ధప్రతిపద్దినమున 1899 సం॥ అక్టోబరు ది 5 తేదీ గురువారమునఁ దత్కృతి స్వీకారమునకు నంగీకరించి వంశావళిలోనగునవి రచియింపనామోదించె. నాఁడు మొదలు 1901 సంవత్సరము జనవరి ది 25 తేదిగనుక నాలుగుమాసములిచటనే నాయొద్దనుండి వంశావళియు నాశ్వాసవిభాగము నాద్యంతపద్యనిర్మాణమును నించుకకథాసందర్భమునుమాత్రము గావించి మాఘశుద్ధప్రతిపద్దినమున విద్వత్సామంత సభాముఖమునఁ జదివించికృతిపతికంకితముగావించె. నాఁటిసభాముఖమున, జదివిన ప్రథమాశ్వాసమంతయు సభ్యులువిని యత్యామోదపరవశులైరి. అసంపూర్ణ కథాసందర్భాదికములుగల శేషాశ్వాసములు మూఁడును గృత్యంకితసంసిద్ధికై క్రమముగ వినిపింపబడియె. తదనంతర మేడెనిమిది మాసములు దక్క (శోభకృన్నామ సంవత్సరాషాఢశు ౧౧) 1903 సం॥రం జూలై వఱకుఁ కవియిచటనే యున్నందునఁ దద్గ్రంథమును సావకాశముగా విమర్శించి వ్యాకరణ దోషములును, గావ్య దోషములును వీలగునంత దనుక దొలంగించి సందర్భాదికములను గవ్యభీష్టాను సారముగ నాకుదోఁచిన పగిదిసవరణఁ గావించినాఁడ. నాఁటికిఁ గవికిశరీరమునఁగొంతజాడ్యము ప్రవేశించుటంజేసి కవి స్వగ్రామమగు నందిపిల్లికిం బ్రయాణమైచనియె. పిదప జూలై 10 తేదీ బ ౧ శుక్రవారపర్యంతము సజీవుఁడై యుండి, నాఁడుసన్యసించి వారముదినము లాశ్రమాంతరమునందుండి జూలై ది 17 తేది బ ౭ శుక్రవారమున సిద్ధింబొందె. కాని యాంధ్రకవిచరి

* తాటియాకులలో, పురవర్ణనము మొదలు ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహపర్యంతము నాశ్వాసవిభాగము లేక వరుసగఁ బద్యములు చెప్పఁబడియున్నవి.

త్రిమును మూఁడవభాగమందు, నెవ్వరో తెలియనివారు తెలిపినందున "రామకృష్ణార్జున నారాయణీయ, నరసభూపాలరాజీయాది గ్రంథములురచియించిన సోమశేఖరకవి నూఱుసంవత్సరముల నాఁటివాఁడు" అనునది సరియగునదికాదు. ఆ 1818 సంవత్సరమున జననముఁగాంచి 1903 సంవత్సరము జూలై నెల ది 17 తేదిదనుక నెనుబదియైదు సంవత్సరములు జీవించెను.

ఈకవి రచియించిన రామకృష్ణార్జున నారాయణీయ, నరసభూపాలరాజీయముల వంశావళులలోని పద్యములు కొన్ని యప్పుడు రచియించినట్లు తుదలు మార్చి ప్రభావతీపరిణయ వంశావళియందును జొనిపె. పైపుస్తకములు నాకప్పుడు దొరకనందున నీభేదమును గనిపెట్టఁ జాలనైతి. రామకృష్ణార్జున నారాయణీయ ద్వితీయాశ్వాసములోని. "ఉ. సంతసమొప్ప" యను వసంతఋతు వర్ణనపద్యమును. తృతీయాశ్వాసములోని- "సీ. వాలుఁగన్నులవాని" యను నాయక వర్ణనపద్యమును, హేలావతీపరిణయ, నరసభూపాల రాజీయములోని పెక్కులు పద్యములును జిరకాలముక్రిందట వ్రాయఁబడిన ప్రాఁత తాటియాకులప్రతియగు బ్రభావతీపరిణయమునందు గానంబడుచున్నవి. ఈపద్యములన్నియు నీకవియే రచియించినవి యగుటంజేసియు, ప్రభావతీ హేలావతీ పరిణయములు తొలుత సుప్రసిద్ధములుగాక యొకమూల బడియుండినవి యగుటంజేసియుఁబ్రతి-చోటను నవీనకల్పములను జేయంజాలకయో, పూర్వకల్పనములంగల లోభాతిరేకమున జేసియో యాగ్రంథములోనివి యీగ్రంథమునందును, నీగ్రంథములోనివి యాగ్రంథమునందును మార్చుచువచ్చెనని తోఁచుచున్నది. ఇట్లనే పూర్వము మహాకవియగు తిక్కన సోమయాజులు నిర్వచనోత్తరరామాయణములోని కొన్ని పద్యములు భారతమునంబెట్టె. భారతపూర్వభాగములోని కొన్నిపద్యములు దాని యుత్తరభాగమునఁ గొంతమార్చియుఁ

జొనిపె. రామరాజభూషణుఁడు వసుచరిత్రములోని పద్యములను నరస భూపాలీయములోనికిఁ ద్రిప్పె. ఈకృత్యము కవులకు సామాన్యముగా వాడుకయై యుండుటంజేసి యీకవికి నిదియొక గొప్పదోషముగాఁబరి గణింపఁదగదు.

ఈకవి ప్రభావతీపరిణయకథసంస్కృతహరివంశమునుండి గ్రహిం చినట్లుమాతోఁజెప్పినను ప్రభావతీప్రద్యుమ్నమనుకావ్యము తెనుగున రచియింపఁబడియుండుటంజేసి దేనినుండి తీసికొనఁబడియె ననికొందఱికిఁ సందేహము వొడమును. గాన దాని నిటఁ గొంత వివరించెను. సూర నార్యుఁడు ప్రభావతీప్రద్యుమ్న కథ హరివంశములోనిదని మొదట నెచ్చటను జెప్పియుండలేదు. గ్రంథాంతమున, గీ. అఘహరణ హరివంశ కథాశ్రయంబు। నాత్మపుత్త్రగుణ స్తవనాంకితంబు। నైన యీకావ్య మునకుమహాప్రసిద్ధి। యిచ్చుఁగావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు. అని యొకపద్యము గానవచ్చుచున్నది. దీనిరచనబట్టిచూడఁగా నిది ప్రక్షి ప్తముగాఁ దోఁచుచున్నయది. ఈవిషయ మెట్లున్నను బ్రభావతీప్రద్యు మ్నులకథహరివంశములో నిదే యగుట సిద్ధముగదా? ఈకావ్యము నీకవి చూచియుండియు నేమి విశేషమును జెప్పుటకై ప్రభావతీపరిణ యమును మరల వ్రాసెను? చూడకయే సంస్కృతమునఁ జెప్పఁబడిన కథయందతి చమత్కృతికి నలరి కావ్యమును జేయదొరకొనెనా? యని యాలోచింపఁగా-సంస్కృతమును, పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమును గ్రమముగాఁ జదివినవారికి, నెఱ్ఱనామాత్యుఁడు హరి వంశమునఁ దెలిఁగింపక విడిచిపెట్టిన యీకథ నుగ్రహించి కొంతకల్పించి కొన్ని వర్ణనములఁజేర్చి మృదుమధురములగు పదములతో జాతీయములం గూర్చి కావ్యముగాఁ జెప్పఁదలంచినట్లు పొడకట్టుచున్నది. కావునను, ప్రభావతీప్రద్యుమ్నము వ్రాఁతగంధము షూమగుల గ్రామమునకుఁ బదిమైళ్ళ దూరముననున్న నందిసిల్లివంటి పల్లెటూరిలో భారద్వాజసుప్ర

సిద్ధగ్రంథములే దొరకుట యబ్బురముగా నుండు-చోట నిట్టి యలభ్యప్రబంధ మెట్లులభింపగలదు? మఱియు నీప్రబంధ మచ్చుపడి యిరువదియేండ్లకుమించలేదుగదా! కావునను, ఈకవిప్రభావతీ ప్రద్యుమ్న మును జూడకయే సంస్కృతమునుజూచి యందలిముఖ్యకథను మాత్రమె గ్రహించి వర్ణనములనుజేర్చి చిన్నప్రబంధముగారచియించియుండె నని తోఁచుచున్నది. ప్రభావతీప్రద్యుమ్నమునందలి కథాకల్పనమునుగాని వర్ణనాంశములనుగాని యాకవి గ్రహించి వ్రాసినట్లు గ్రంథమువలన నేమియుఁ గాపఁబడమింజేసి మరల రచియించుటవలన దోషమేమియు లేకున్నను, బ్రసిద్ధగ్రంథ మొకటి పూర్వమున నుండఁగా దానినిజూచి యిదివ్రాయుటయనవసరకృత్యమగుటచేఁ బాఠకులకు నీరసభావముగలు గకుండుటకయి యింతవిమర్శింపవలసె.

ప్రభావతికథహరివంశములోనిదని సోమశేఖరకవియుఁజెప్పలేదు; కాని, యిది యేదియో యొకపురాణ కథలోనిదని తెలియుటకై "శుకయోగీంద్రుండు పరీక్షన్నరేంద్రునకు నిట్లనియె "నని ప్రత్యాశ్వాసా ద్యంతములను నుడువుటంజేసి యిది పూర్వకథ యని తెలిపికొన వీలు గలదు. ప్రభావతీ ప్రద్యుమ్నమున- క. ఏనుం బితృపూజన నా। చే నైన ట్లెద్దియొనఁ జేయఁగవలయున్। గానఁ గృతియిచ్చి మేదిని। పైని లుపుడు నతనికీర్తిఁ బరమేశుకృపన్. వ. అని నిశ్చయించి ప్రభావతీ ప్రద్యుమ్నంబు మస్పురుండైన యమరామాత్యునిపేర నంకితముగా రచి యింపంగడంగి" యని యొకచోటను, "వ. అక్షయకీర్తికై భవాభివృద్ధి యగునట్లుగా నేనుసమర్పింపబూనిన ప్రభావతీ ప్రద్యుమ్నంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన" అని మఱియొకచోటను వచనముల బుద్ధిపూర్వ కముగా "హరివంశ" మను పేరువిడిచి గ్రంథాంతమునఁ గృతిపతి వర్ణనపద్యములకడ- గీ. అఘహరణ హరివంశకథాశ్రయంబు" అని యుంచుటచే రచననుబట్టియిదిప్రక్షిప్తము గావలయు; కాని-చో, మొదట

విడుచుటకును దుదినుంచుటకును నేదియో కారణముండవలయునని శంకిం పఁదగియున్నది.

ఈరెండుగ్రంథములకు మూలమగు సంస్కృతహరివంశకథను గావ్యముగా రచియించుట కెవరెంతదనుక గ్రహించినదియుఁబాఠకులు తెలిసికొనుటకై హరివంశములోని శ్లోకములఁ గొన్నిటి నిందుదాహరించెద.

హరివంశము విష్ణుపర్వము అధ్యాయము ౧౫౦.

జనమేజయః—

శ్లో. వజ్రనాభవధం వ్యాఖ్యాతం నికుంభవధకీర్తనే। తస్మే కౌతూహలం శ్రోతుం ప్రసాదాద్భవతో మునే ॥౩॥ వైశంపాయనః ** ॥ అవధ్యస్తాం సదేవేభ్యో వజ్రో దానవ సత్తమః। పురం వజ్రపురం చైవం సర్వరత్నమయం శుభమ్ ॥౨॥ వజ్రనాభోఽథ దుష్టాత్మా వరదానేన దర్పితః। పులస్య చాత్మనశ్చైవ జగద్బాధితు ముద్యతః ॥౧౩॥ మహేంద్ర మబ్రవీద్గత్వా దేవలోకం విశాంపతే। అహమీశితు మిచ్ఛామి త్రైలోక్యం పాకశాసన ॥౪॥ తతః సపితరంగత్వా కశ్యపం దానవోబ్రవీత్ ॥ యథోక్తం దేవరాజేన తమువాచాథ కశ్యపః॥౧౭॥ సత్రేనృత్తే కరిష్యామి యథాన్యాయం భవిష్యతి।త్వం తు వజ్రపురే పుత్ర వసగచ్ఛ సమాహితః॥౧౮॥ ఏవముక్తే వజ్రనాభః స్వమేవ భవనం గతః। మహేంద్రోపి యయౌ దేవో ద్వారకాం ద్వారమాలినీమ్॥౨౦॥ గత్వా చాంతర్హితో దేవో వాసుదేవ మథాబ్రవీత్ । వజ్రనాభస్య వృత్తాంతం తమువాచ జనార్దనః ॥౨౧॥ తతో గతో దేవరాడ్ వాసుదేవేన సత్కృతః। వాజిమేధేచ సంప్రాప్తే వసుదేవస్య భారత ॥౨౪॥ తస్మిన్ యజ్ఞే వర్తమానే ప్రవేశార్థం సురోత్తమా, చింతయామాన తు ర్వీరా దేవరాజాచ్యుతౌ ప్రభో ॥ ౨౫ ॥ తత్ర యజ్ఞే వర్తమానే సునాట్యేన నటస్తథార మహర్షీ తోషయామాస భద్రనామేతి నామతః ॥౨౬॥. తతో హంసాన్ ధార్తరాష్ట్రాన్ దేవలోకనివాసినః । ఉవాచ భగవాన్ చక్రీః సాంత్వయిత్వా సురేశ్వరః ౩౭ భవంతో భ్రాతరో స్మాకం కాశ్యపాదేవ పక్షిణః విమానవాహా దేవానాం సుకృతీనాం తథైవచ ౩౮ ఇతి... అధ్యాయః.

అధ్యాయః ౧౫౧—వైశంపాయనః. శ్లో. తే వాసవవచః శ్రుత్వా హంసా వజ్రపురం యయుః పూర్వోచితంహిగమనం తేషాం తత్ర నరాధిప ౧ హంసాః పరిచితాం చక్రుస్తాంతత్ర్యాయవాసినీమ్ సఖీం శుచిముఖీం చక్రి హంసీం రాజసుతాం

చసా 12 ప్రద్యుమ్నఃస్యాద్యథా త్వా మమవృష్ణికులోద్భవః అత్యంతవైరిదైత్యానా
ముద్వేజనకరో హరిః 34 అసురాణాం స్త్రియో వృద్ధాః కథయింత్యా మయా శ్రుతాః
ప్రద్యుమ్నస్య యథాజన్మ పురస్తాదపి మే శ్రుతం 36 యథాచ తేన నిహతో బల
వాన్ కాలశంబరః హృదిమేవ తత్ తేనిత్యం ప్రద్యుమ్నః ఖలుసత్తమే 37 హేతుః
సనాస్తి స్యాత్తేన యథా మమసమాగమః దాసీత్వాహం సఖ్యా త్వా హైమాలీం త్వాంచ
విసర్జయే 38 ** కథంచిద్వర శాండిల్యా శైలపుత్ర్యాః శుభాసఖీ నటశ్చైవమయా
దృష్టో మునిదత్తవరఃశుభః 49 కామరూపీచ భోజ్యశ్చ త్రైలోక్య నృత్యసంమతః
కురూన్ యాత్యుత్తరాన్ వీర కాన్ మద్రీద్వీపమువచ 50 వజ్రనాభః ఉపాయస్సృజ్య
తాం హంసి యేనేహ సనటః శుభే ఆగచ్ఛేన్మమభద్రంతే పవియం పక్షినందిని 57
తేహంసా వజ్రనాభేస కార్యహేతో ర్వసర్జితాః దేవేంద్ర యాథ కృష్ణాయ
శశంసుఃసర్వమేవతత్ 58 అథోక్షజే ప్రద్యుమ్నో నియుక్తస్తత్రకర్మణి ప్రభా
వత్యాశ్చసంసర్గే వజ్రనాభవధేతథా 59 నదేవీరమయాం సమాశ్రిత్య సంవిధాయ
హరిర్నటమ్ నటవేషేణ భైమానాం ప్రేషయామాస భారత 60 ప్రద్యుమ్నం నాయ
కం కృత్వాసాంబం కృత్వావిదూషకమ్ పారిపార్శ్వే గదంవీర మన్యాన్ భైమాం
స్తథైవచ 61 వారముఖ్యానటీః కృత్వాతత్తూర్యసదృశంతదా తథైవభద్రం భద్రస్య
సహాయాంశ్చ తథావిధాన్ 62 ప్రద్యుమ్నవిహితం రమ్యం విమానం తేమహారథాః
జగ్ము రారుహ్య కార్యార్థం దేవానా మమితౌజసామ్ 63 ఇతి...అధ్యాయః

అధ్యాయః 152 శ్లో తతఃసన్నృతే తత్ర వరదత్తో నటస్తథా స్వపురే పురవా
సీనాం పరంహర్షం సమాదధత్ 3 రామాయణం మహాకావ్య ముద్దేశం నాటకీకృ
తమ్ జన్మవిష్ణోరమేయస్య రాక్షసేంద్ర వధేప్సయా 4 లోమపాదో దశరథ ఋష్య
శృంగం మహామునిమ్ శాంతా మానాయయామాస గణికాభిఃసహానఘ 5 రామలక్ష్మ
ణ శత్రుఘ్నా భరతశ్చైవ భారత ఋష్యశృంగశ్చ శాంతాచ తథారూపైర్నటైః
కృతైః 6 తత్కాలజీవినో వృద్ధా దానవా విస్మయంగతాః ఆచచక్షుశ్చ తేషాం వైరూ
పతుల్యత్వ మచ్యుత 7 సంస్కారాభినయౌ తేషాం ప్రస్తావానాంచ ధారణమ్
దృష్ట్వాసర్వే ప్రవేశంచ దానవావిస్మయంగతాః 8 తేరక్తా విస్మయాన్నేదు రసురాః
పరయాముదా ఉత్థాయోత్థాయ నాట్యస్యవి శేషేషు పునఃపునః 9 దదుర్వస్త్రాణి
తుష్టాశ్చ గ్రైవేయం వలయానిచ హారాన్మనోహరాంశ్చైవ హేమవైడూర్య భూషి
తాన్ 10 పృథగర్థేషు దత్తేషు శ్లోకైస్తై స్తుహవుర్నటాః అసురాంశ్చమునీంశ్చైవ
గోత్రైరభిన్నైరసి 11 ప్రేషితం వజ్రనాభస్య శాఖానగరవాసిభిః నటస్యదివ్యరూపస్య
నరేంద్రాగమనంతదా 12 * *తతో హంసీ ప్రభావత్యాః సఖీప్రాహ ప్రభావతీమ్
గతాస్మి ద్వారకాంరమ్యాం భైమగుప్తామనిందితే 81 ప్రద్యుమ్నశ్చ మయాదృష్టో

విచిత్రైశ్చారులోచనః భక్తిస్సకథితాతస్య మయాతవ శుచిస్మితే 82 తేనహృష్టేనకాల
శ్చ కృతఃకమలలోచనే అన్యపరితోషసమయే త్వయాసహ సమాగమః 83 తదద్యరుచి
రశ్రోణి తవప్రియసమాగమః సహ్యోశ్మవతిభాషంతే మిథ్యాభైమకులోద్భవాః 84
తతఃప్రభావతీహృష్టా హంసీంతా మిదమబ్రవీత్ ఉషితాసి మమావాసే స్వప్తుమర్హ
సి సుందరి 85 త్వయాహం సహితావాసే ప్రష్టుమిచ్ఛామి కైశవమ్ నిస్సాధ్వసా
భవిష్యామి త్వయాసహ విహంగమే 86 హంసీ తథేతి చోవాచ సఖీం కమలలోచ
నామ్ ఆసుర్యోవాచ తద్ధర్మజ్ఞాం ప్రభావ్యత్యా విహంగమా 87 విశ్వకర్మ కృతే
తస్మిన్ హర్మ్యాగ్రే పృష్ఠే ప్రభావతీ సంవిధానంచ కారాస ప్రద్యుమ్న గమనక్ష
మమ్ 88 తస్మిన్ కృతే సంవిధానే కామమానయితుం యయౌ ప్రభావతీ మనుజ్ఞాప్య
హంసీవాయుసమాగతా 89 సాగత్వా భ్యాగతాహంసీ ప్రభావతి మథాబ్రవీత్ అ
భ్యేతిరాత్రిశ్శోభనే యోసా వాశ్యసాథాతలోచనే 90 ప్రద్యుమ్నో నీయమానంతు దదృశే
మాల్యమాత్మవాన్ భ్రమరైరావృతంవీరః సుగంధమభిమర్దనః 91 నిలిల్యే తత్ర
మాల్యేచ భూత్వా మధుకరస్తదా ప్రభావత్యా నీయమానే విదితార్థః ప్రతాప
వాన్ 92 ప్రవేశితంచ తన్మాల్యం స్త్రీభిమన్యుకరాయుతమ్ ఉపనీతం ప్రభావ
త్యై స్త్రీభిస్తద్భ్రమరావృతమ్ 93 అవిదూరేచ విన్యస్తం ప్రభావత్యా జనాధిప
భ్రమరాస్తే యయుఃసౌమ్య సంధ్యాకాలేహ్యు పస్థితే 94 సభైమప్రవరోవీరస్సై
సహాయైర్విహీనతః కర్ణోత్పలే ప్రభావత్యా నిలిల్యే శనకైరివ 95 తతఃప్రభావతీ
హంసీమువాచ వరజాంవరా సుష్యచ్ఛంతపూర్ణా చంద్రి సమిత్యాతిమనోహరమ్ 96
స్ఫురంత్యంతి మేంగాని ముఖంచ పరిశుష్యతి ఔత్సుక్యం హృదిచాతీవ కోయంవ్యా
థిరనాషః 97 దదద్ద్విగుణతాత్సుక్య మసౌపూర్ణాన్ నిశాకరః నవోదితః శీతరశ్మిః
ంవివార్ధోహ్యతిప్రియః 98 నదృష్టపూర్వోహిమయా శ్రుతిమాత్రేణకాంక్షితఃఅహో
ధూమ.నుతేంగాని స్త్రీస్వభావస్య ధిక్ ఖలు 99 కల్పయామి యథాబుద్ధ్యా యదినా
భ్యేతి మేడ్రియః కుముద్వతీ గతంమాగస్ం హోగమిష్యామ్య కించనా 100॥ * *
ఇతి...అధ్యాయః.

అధ్యాయః 153 శ్లో పరిభోపమదర్పంమాకాషిర్పం ర్వదనస్యవరాననె సాశ్వ
సంత్యజ్యంతాభీరు దాసః సాధ్వనుగృహ్యతామ్ 9 నకాలమివపశ్యామి భీరుభీరుత్వము
త్సృజయాచా మ్యేషాంజలింకృత్వా ప్రాప్తకాలం నిబోధమె 10 గాంధర్వేణ ఇవా
హేన కురుష్వానుగ్రహంమమ దేశగాలానురూపేణ రూపేణానుత్తమాసతీ 11 ఉప
స్పృశ్య సలోభైమో మణిస్థ జాతవేదసమ్ జుహావసమయేవీరః పుష్పైమర్పంత్రి నుతీ
రయన్ 12 జగ్రిహాధక రంకస్యా పరాభరణభూషితమ్ చక్రేప్రదక్షిణంచైవ తంమ
ణిస్థం హుతాశనమ్ 13 ప్రజజ్వాల సతేజస్వీ మానయన్నచ్యుతాత్మజమ్ భగవాన్

జగతఃసాక్షీ శుభస్యా ధాతుభస్యచ 14 ఉద్దిశ్యదక్షిణాంవీరో ప్రాణాం యదునంద
నః ఉవాచ హంసీం ద్వారస్థా తిష్టావాంరక్షపక్షిణి 15 తస్యాంప్రణమ్య మాతా
యాం కామస్త్రాం చారులోచనమ్ గ్రిహాయ దక్షిణాపు స్తైనినాయునోత్తమ్ 16 * *
శక్రకేశవయోహ్యాంసాః కుమారాణాంవ మాత్మనామ్ రేమేసహప్రభావత్యా ప్ర
మ్న శ్చానురూపయా 27 రాత్రౌరాత్రౌ మహాతేజా ధాతర్రాష్ట్రాభిక్షితః
తైర్విహవజ్రపురేహంస్తైర్వసద్భి ర్వ్యాసవాజ్ఞయా 28 వ్యాప్తంవ్రపనటాంస్త్రీశ్చనవిదుః
కాలమోహితాః దివాపి శౌకణేయస్తు ప్రభావద్యా నృపాలయె 29 తాసాం యాదవ
నారీణాం స్పృహయం త్యసుర స్త్రియః వజ్రనాభస్యతు భ్రాతానునాభోనామ
విశ్రుతః 33 దుహితృద్వయంచనృపతె తస్యరూపగుణాన్వితమ్ ఏకా చంద్రవతీనా
మ్నా గుణవత్యథ చాపరా 34 ప్రభావత్యాలయం తేతు ప్రజతఃఖలునిత్యదా ద దృ
శాతేతు తేతత్రరతిసక్తాంప్రభావతీమ్ 35 దధ్యదుగ్గదసాంబౌచ విద్యామధ్యస్యతేపు
ఖేతా ప్రద్యుమ్నేన సహితౌ ప్రవిష్టౌ ఖేమనందనౌ 43 ప్రచ్ఛనం మాయయావీరౌ
కాష్ణిర్నామాయినాన్నృప గాంధర్వేణ వివాహేనతాప వ్యరిబలార్దనౌ 50 పాణిం జ
గృహతుర్వీరౌ మంత్రపూర్వం సతాంప్రియా చంద్రవత్యా గదఃసాంబో గుణవత్యా
తు కైశవిః 51 రేమిరే సురకన్యాభి ర్వీరాస్తె యదుపుంగవాః మార్గమాణా స్త్వను
జ్ఞాంతెనుక్రికేశవ యోస్తతా 52* * ఇతి ఽధ్యాయః

అధ్యాయః 155 * * శ్లో ప్రభావతీ తదాపుత్రం సుషువేసదృశంహితః
సద్యోయావనసంప్రాప్తం సర్వజ్ఞత్వంచ భారత 19 మాసమాత్రేణ సుషువే దేవి
చంద్రవతీనృప చంద్రప్రభమితి ఖ్యాతం తనయం సదృశంపితు: 20 సద్యశ్చయౌవనం
ప్రాప్తంసర్వజ్ఞత్వంచ భారత గుణవత్యపి పుత్త్రంచ గుణవంత మనిందితమ్ 21
యువానావథ సద్యస్తా సన్వశాస్త్రార్థ కోవిదౌ ఇంద్రోపేంద్ర ప్రసాదేన నంస్కృత్తా
యదువర్ధనౌ 22 హర్మ్యపృష్ఠే వర్ధమానా దృష్ట్వాస్తె యదునందనాః ఎంద్రోపేంద్రే
చ్ఛయావీర నాన్యథేత్యవధార్యతామ్ 23 నివేదితాచ్చ సంభ్రాంతై ర్దైత్యైరా
కాశరక్షిభిః వజ్రనాభాయ వీరాయ త్రిపిష్టపజయైషిణె 24 విధార్య సర్వైగృహ్యో
తాం మహ్యమైతే గృహధర్షకాః ఇత్యువాచాసురపతిర్వజ్రనాభో దుశాసదః 25 తతః
సైన్యం నమాజ్ఞప్త మసురేంద్రేణ ధీమతా అవారయామాస దిశః సర్వాఃకురుకులో
ద్వహ ౨౬ గృహ్యంతా మీశుబధ్యంతా మితివాచస్తపస్తతః ఉచ్చేరు రసురేంద్రస్య
శాసనా దరశాసినః 28 తచ్ఛ్రిత్వా వ్యథితా స్తైషాం మాతరః పుత్రవత్సలాః రురుదు
స్తారుదంతోథ ప్రద్యుమ్న! సహసాబ్రవీత్ 28 మాభైష్ట జీవమానేషు స్థిరేష్వస్మా
సు సర్వథా కింనౌదైత్యాః కరిష్యంతి సర్వథా భద్రమస్తునః 29 ప్రభావతీ మధో
వాచ ప్రద్యుమ్నా విక్లబాంక్షితా పితాతవ గదాపాణిః పిత్యవ్యాశ్చ స్థితాస్తవ 30
భ్రాతర స్త్వవతె దేవి జ్ఞాతయశ్చతథాపరె ఏతే పూజ్యశ్చ మాన్యాశ్చ తవార్థే ఖలు

సర్వధా 31 భగిన్యాపృచ్ఛ భద్రం తే కాలోయం ఖలు దారుణః మరణం సహమానా
నాం యుధ్యతాం విజయోధ్రువః 32 దానవేంద్రో దయో హ్యేతే యోత్స్యంతేన్మ
ద్యథైషిణః కిమత్ర కార్య మస్మాభిః సర్వైశ్చైకాంతర స్థితైః 33 ప్రభావతీ రుదంతీ
తు ప్రద్యుమ్న ముదమబ్రవీత్ శిరస్యంజలి మాదాయ జానుభ్యాం పతితాక్షితౌ 34
గృహాణ సస్త్రం మాత్మానం రక్షత్వ్రిబర్హణ జీవన్ పుత్రాంశ్చ తారాంశ్చ ద్ర
ష్టాసి యదునందన 35 ఆర్యాం న్యవర వైదర్భీ మనిరుద్ధంచ మానద స్వస్త్యేతాన్మో
క్ష యాత్మానం వ్యసనా దరిమర్దన 36 దుర్వాససా వరోదత్తో మునినామంధితామ
వైధవ్యరహితా హ్యద్యా సీవపుత్రా భవిష్యసి 37 * * * ఇది అధ్యాయం.

అధ్యాయః 156 * * తంపాంచజన్యశబ్దేన నిత్యాశ్వస్తం మహాబలమ్
దృష్ట్వా॥ ప్రముదితా లోకా విశేషే ణేంద్రకేశవౌ ॥౧౫॥ తస్యచక్రం కరేయాతం
కృష్ణశ్ఛిందేన భారత । క్షురనేమి సహస్రారం దైత్యసంఘకులాంతకమ్ ॥౧౬॥ తన్ము
మోచాచ్యుతసుతః శత్రునాశాయ భారత । నమస్కృత్వాసురేంద్రాయ నమస్కృ
త్వా మహాత్మనే ॥ ౧౭ వజ్రనాభస్య తత్కాయా దుచ్చకర్త శిరస్తదా । నారా
యణసుతోన్ముక్తం దైత్యానా మనుపశ్యతామ్ ॥ ౧౮ ॥ గదఃసునాభ మవధీ ద్వ్యత
మానం రణాజిరే । హర్మ్యపృష్ఠే జిఘాంసంతం రణదృప్తం భయానకమ్ ॥ ౧౯ ॥
సాంబః సమరమధ్యస్థా లసురా వరిమర్దినః । నినాయ నిశితైర్బాణైః ప్రేతాధిప
పరిగ్రహమ్ ॥ ౨౦ ॥ నికుంబస్తు హతేవీరే వజ్రనాభే మహాసురే । జగామ షట్
పురం వీరో నారాయణ భయార్దితః ॥ ౨౧ ॥ నిబర్హితే రిపౌ తస్మిన్ వజ్రనాభే
దురాసదే । అవతీర్ణౌ మహాత్మానౌ హరీ వజ్రపురం తదా ॥ ౨౨ ॥ లబ్ధ ప్రశమనం
చైవ చక్రతుః సురసత్తమౌ । సాంత్వయామాసతుశ్చైవ బాలవృద్ధం భయార్దితమ్ ॥
౨౩ ॥ వజ్రనాభస్య తద్రాజ్యం చతుర్ధా చక్రతు నృప । విజయస్య చతుర్భాగం
జయంత తనయస్యతు ॥ ౨౪ ॥ ప్రద్యుమ్నస్య చతుర్భాగం రాక్మిణేయసుతస్యచ ।
చంద్రప్రభస్యద దతుశ్చతుర్భాగం జనేశ్వర ॥ ౨౫ ॥ కోట్యశ్చతస్రో గ్రామాణా
మధికాస్తా విశాంపతే । శాఖాపురసహస్రంచ స్ఫీతం వజ్రపురోపమమ్ ॥ ౨౬ ॥
చతుర్ధా చక్రతుస్తత్ర సంహృష్టౌ శక్రకేశవౌ । కంబళాజినవాసాంసి రత్నాని వివి
ధానిచ ॥ ౨౭ ॥ చతుర్ధాచక్రతుర్వీరౌ వీరవానికేశవౌ । తతోభిషిక్తాస్తేవీరా
రాజానో వాసవాజ్ఞయా ॥ ౨౮ ॥ దేవదుందుభివాద్యే నన్నృపవిష్ణుపదీజలైః । స్వయం
శక్రేణదేవేన కేశవేనచ ధీమతా ॥ 30 ।

ఇతి శ్రీమహాభారతే, హరివంశాంతర్గత విష్ణుపర్వణి, వజ్రనాభవధే షట్పం
చాశదధిక శతతమోధ్యాయః॥

1. ఇంద్రుఁడు వజ్రనాభుని దుర్నయంబు శ్రీకృష్ణున కెఱింగింప ద్వారకకువచ్చి తద్వధోపాయంబు నాలోచించి యరుగునెడ వసుదేవుండు వాజిమేధంబుసేయువార్తఁ దెలిసి యందులకయ్యిరువురు సరిగిరి. అచ్చటికేభద్రుఁడను నటముఖ్యుండువచ్చి చూడవచ్చినవారిని గొన్ని నాటకంబులాడి తనిపినందులకు శ్రీకృష్ణప్రభృతులు సంతసించి వజ్రనాభుని వధించుటకు నిదియ యుపాయంబని యోజించి ప్రద్యుమ్నాదుల రానియోగించి "మీరునటరూపములఁ దాల్చి వజ్రపురసమీపమున నాటకములాడఁబొండు; మీవృత్తాంతమును వజ్రనాభుండువిని తననగరంబునఁ గూడ నాటకములుప్రదర్శింపరమ్మని మిమ్ములరప్పించును; దానఁ గార్యంబు సిద్ధించు" ననీ యాజ్ఞాపించి, హంసంబుల రావించి "ప్రభావతికిఁ బ్రద్యుమ్నునిరూపగుణంబులఁ దెలిపి వానియందనురాగంబు గలుగఁజేయుఁడు, దేవరహస్యంబగుటచే దీనిని వెలిపుచ్చనీయకుఁడు" అని రాయబారంబుపంపిన హంసవచనంబులఁ బ్రభావతి ప్రద్యుమ్నునియందు మనసుదగిలి వానిరాకకు నిరీక్షించుచుండె. వజ్రపురసమీపమునకుఁ బ్రద్యుమ్ననాటకసంఘము వచ్చియాడుచుండ, వజ్రనాభుండావార్తవిని వారినిదనపురంబున నాటకములు ప్రదర్శింపరప్పించి మయునిచే గొప్పనాటకశాలను నిర్మింపఁజేసి యందుఁ గుటుంబబంధుమిత్రసమేతముగా రామ గంగావతరణాదినాటకములఁ గాంచి వారికి విశేషబహుమానములనిచ్చె. నాటక ప్రదర్శనసమయమునఁ బ్రభావతి చెలికత్తెవలనఁ బ్రద్యుమ్ను నెఱింగి గుణరూపవిశేషంబులఁగని సంతృప్తినొంది వానినెట్లైన నిటకుఁ దోడ్కొనిరమ్మని వేఁడినఁ బ్రభావతికోరికను నెఱవేర్చుటకై కామరూపుండగు ప్రద్యుమ్నుండు తుమ్మెదయై ప్రభావతికిఁ గొనిపోవు పూవులంజొచ్చి యంతిపురంబుఁ బ్రవేశించి గాంధర్వంబున నామెం బెండ్లియాడి యథేష్టసుఖంబులనుభవించుచుఁ బ్రభావతిచెల్లెండ్రకుఁ గూడఁ బ్రద్యుమ్నుని తమ్ములనిచ్చి వివా

హంబుగావించి యందఱు నిష్టకేళీవినోదంబులనోలలాడుచుండిరి. అంత, నంతఃపురవాతాయనంబులు క్రమముగ వజ్రనాభుండెఱింగి తోడ్క(దొ)క్కిన తాంత్రికులకరణి రోషఘూర్ణితమానసుండై వారింబట్ట పల్లార్ప సైన్యముంగొని యుద్ధంబునకు సన్నద్ధుండుగాఁగా, బ్రద్యుమ్నుండు వానిసీఁచమడంచి కాలుపురికినిపె. ఇందో్రపేంద్రులీవృత్తాంతంబెఱింగి వచ్చిసంతసించి ప్రద్యుమ్నుని పుత్త్రుండగు ననిరుద్ధునికిఁ (ప్రభావంతునికి) బట్టంబుఁగట్టి నిజనగరంబులకరిగిరి. అని సంస్కృతహరి వంశమున నీకథ యాఱధ్యాయములలో 374 శ్లోకములలో విపులముగాఁ జెప్పఁ బడియున్నది.

2. ప్రభావతీ ప్రద్యుమ్నమున:—మీఁదికథనంతయుగ్రహించి నడుమ మేఘసందేశముభంగి సుకసందేశమునంతరకథను గొంతకల్పించి సుందరములగు వర్ణనములతో హృద్యములగు మృదుమధుర పదార్థ చమత్కారములతోఁ గావ్యముగా రచియించెను.

3. ప్రభావతీపరిణయమున:—వజ్రనాభునిబాధలిందు్రఁడు శ్రీకృష్ణునికెఱిగింప నతఁడు హంసలచే రాయబారంబుఁగావింప నుపాయంబుచెప్పిపంపిన, నతండట్లొనరించి దానిఫలితంబు శ్రీకృష్ణునకుఁ దెలిపెను. కృష్ణుండు ప్రద్యుమ్నాదుల "నాటకులై వజ్రపురంబున కేగి నాటకములఁ బ్రదర్శింపుఁడు" అనినియోగించిన వారట్లుకావించి ప్రభావతి ప్రభృతులఁ బెండ్లియాడి పుత్త్రులఁబడసి తన్నిమిత్తమునఁ బొడమిన కయ్యంబున వజ్రనాభునిఁ దునిమి తత్పుత్రులకుఁ బట్టంబుఁగట్టె. అనెడి యందలిముఖ్యకథమాత్రమే గ్రహించి వర్ణనములతోఁ బ్రబంధముగా రచియించె.

ఇంతచిత్రమగు నీప్రభావతీప్రద్యుమ్నులకథను నెట్టన హరివంశమునఁ దెనిఁగింపక విడుచుటకుఁ దగినకారణమేమియుఁ దెలియకున్నను బెక్కండ్రు పెక్కువిధములఁ దలంచుచున్నారు. అందుఁ గొందఱు:—

1 బ్రాహ్మణియగు రాక్షసస్త్రీకిని క్షత్త్రియుఁడగు యాదవపురుషున కును నసవర్ణవిలోమవివాహము చెప్పఁబడియుండుటవలన నీయది లోక శాస్త్రవిరుద్ధ మని తెనిఁగింపక మానియుండునని యనుచున్నారు; కాని, భారతము నాదిపర్వమున శుక్రనందనయగు శర్మిష్ఠను యయాతికిచ్చి శుక్రుడే స్వయముగా వివాహమును గావించినట్లు నన్నయభట్టారకునిచే తెనిఁగింపఁ బడియుండుటంజేసి యట్టివివాహములు లోకశాస్త్రదూష్య ములు కానేరవుగదా? 2. నీతిబోధకమగుకథ కాబింజేసి విడువఁబడి యుండనోపునని కొందఱనుచున్నారు. అట్లేని, దుర్మార్గులగు రాక్షసు లనేమాయోపాయముచేతనైనను వధించుటకన్న మిక్కుటంబగునీతి లేదు; కావున, నిదియునింద్యమముకాదు. 3. ఈకథయందుఁ బ్రకృ తకాలప్రవర్తకములగు నాటకములఁ బోలు నాటకములు ప్రదర్శింపఁ బడినట్లు చెప్పఁబడియుండుటచే నెఱ్ఱనామాత్యునికాలమునకు (పదు మూఁడవశతాబ్దమునకు) హరివంశమున నీకథ చెప్పఁబడియుండక తద నంతరమునఁ గల్పింపఁబడియుండ నోపునని కొందఱనుచున్నారు, అట్లం దుమేని వాల్మీకిరామాయణమునఁ బెక్కుచోట్ల నాటకములాడినట్లును, స్త్రీనాటకసంఘములుగూడఁ గలిగియున్నట్లును జెప్పఁబడియున్నకతం బున నీభాగము కల్పితమనుటకు వలనుపడదు. 4. సంస్కృతమహాభా రతమాదిపర్వము 68 నఱువదియెనిమిదవయధ్యాయమున శకుంతళో పాఖ్యానమును, 75 డెబ్బదియయిదవయధ్యాయమున యయాత్యు పాఖ్యానమును వ్యాసమహర్షిచే రచియింపఁబడియె. వానిని నన్నయ భట్టారకుఁడు తెనిగించుచు, మూఁడవయాశ్వాసమున ముందుగ యయాతి చరిత్రమును, నాలుగవయాశ్వాసమున దానిపిమ్మట శకుంతలాచరిత్ర మును రచియించెను. ఇట్లు రచియించుటకు నన్నయకులభించిన ప్రతిలో నీవిధముగనే యున్నదా? బుద్ధిపూర్వకముగా నిట్లుమార్చి రచియించెనా? వ్యత్యస్తముగా రచియించుటవలనఁ బ్రయోజనమేమి? కథలకు సందర్భ

మెట్లుపోసఁగును? వ్యాసరచితమగు కథాక్రమము యథార్థమైనదా ? నన్నయకథాక్రమము యథార్థమైనదా? మఱియు, భీష్మపర్వముననున్న భగవద్గీతలాంధ్రమున రచియింపఁబడకపోవుటచేతను, ఉపనిషత్తులను నామమున వ్యవహరింపఁబడుచుండుటచేతను, భారతము పెక్కుతడవలు రచియింపఁబడినదిగా భారతముననే యుండుటచేతను, రచనారీతియు నవీనగ్రథితముగాఁ గానంబడుటచేతను వానినితదనంతరకవులెవ్వరో రచియించి గ్రంథపాశ్చాత్యమునకై భారతమునఁ జొనిపి వ్యాసప్రోక్తమని ప్రకటించియున్నారని గొందఱూహించుచున్నారు. కాని, నన్నయాదులు తెనిఁగింపక విడిచిపెట్టినంతమాత్రమున నవియెల్ల నూతనకల్పితములను టకుఁ బాత్రములు కావు. పూర్వమునఁ జేర్పఁబడిన కారణముల నాలోచించుటయుచితము. ఎఱ్ఱాప్రెగడ హరివంశములోని షట్పురాసురవధ బానుమతీహరణకథ లోనగు ననేకకథల నిందువిడచిపెట్టియున్నాఁడు. అవియన్నియు నూతనకల్పితములనఁదగునా? నన్నయ తిక్కనాదులవలెనే యెఱ్ఱనయుఁ దనకు నిష్టములగు కథలఁ దెనిగించి యన్యములవిడచి పెట్టెను. ఆహేతువుచేతనే సూర్యనామాత్యుఁడీ కథను బ్రభావతీ ప్రద్యుమ్నమను పేరుతోఁ గావ్యముగా రచియించె. సోమశేఖరకవి యీవిషయమెఱుఁగక యందలిముఖ్యకథనుమాత్రమే గ్రహించి వర్ణనములం జేర్చి ప్రకృతగ్రంథరూపముగా రచియించె.

ఈప్రబంధమున—1. పురము. 2. నది. 3. ఋతువు. 4. చంద్రోదయము. 5. సూర్యోదయము. 6. ఉద్యానవనము. 7. జలక్రీడ. 8. మోహము. 9. వియోగము. 10. మంత్రము. 11. దౌత్యము. 12. పుత్రోదయము. 13. యుద్ధము లోనగు వర్ణనములు కావింపఁబడినవి.

మ. పురవారాశిమహీంధరర్తుశశభృత్పూషోదయోద్యాన పు
ష్కరకేళీమధుపానమోహనవియోగక్షేమమానస్వయం

వరపుత్రోత్సవమంత్రిదూత్యరణదోర్వైకాంతిసంకీర్తనా
కరమష్టాదశవర్ణనాన్విపముతత్కావ్యంబుభవ్యంబిలన్.

అని పూర్వోక్తములు పదునెనిమిది వర్ణనములు కావ్యములరచి యింపవలయునని కావ్యాలంకారచూడామణి ప్రభృతులనియమముఁ గావించిరి.

శ్లో. ఏతానియత్రవర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే
ఏషామష్టాదశానాంమధ్యేః కైశ్చిదూనమపీష్యతే.

అని ప్రతాపరుద్రీయమునఁ బదునెనిమిది వర్ణనములుగలది మహాకావ్యమనియుఁ నందుఁగొన్నివర్ణనములు లేకున్నను మహాకావ్యమే యగుననియు నియమించె.

ప్రాచీనమతమున వ్యంగ్యము ప్రధానముగాఁగలదియే యుత్తమ కావ్యమని చెప్పంబడియున్నది. "శ్లో. ఇదముత్తమమతిశయిని, వ్యంగ్యే వాచ్యాద్ధ్వనిర్బుధైః కథిత" మ్మనికావ్యప్రకాశయందును; "శ్లో. వాచ్యాతిశాయివ్యంగ్యంయ-దుత్తమధ్వనిరేవసః" అని కావ్యదర్పణము నందును జెప్పఁబడియున్న కతమున ధ్వనిప్రధానముగాఁగల కావ్యమె యుత్తమమ్మయినదని చెప్పదగియున్నది ; కాని, యష్టాదశవర్ణనములు గలిగియున్నంతమాత్రమున నదియుత్తమ కావ్యమనిచెప్పరాదు. వ్యంగ్యము (ధ్వని) ప్రధానముగాఁ జేసికొని కావ్యమురచియించుచు నందుఁ బురసింధునగఋతుచంద్రసూర్యప్రభృతుల వర్ణింపవలసినదని యాలంకారికులమతము ; కాని, శుష్కవర్ణనములు పదునెనిమిదికావు వేయి నూటపదునెనిమిదియున్నను నదియుత్తమ మహాకావ్యముకానేరదు.

ఇప్పుడు సామాన్యముగా మహాప్రబంధములని చెప్పెడివానిలో నొకటిరెండుమాత్రముతప్ప, మిగిలినవన్నియు మనుచరిత్రమును, విశేషముగా మనుచరిత్రమునుజూచి దానియందలి వర్ణములవంటి వర్ణన

ములును, పద్యములవంటి పద్యములును రచియించి మాదిమహాప్రబంధము, ఇందలివర్ణనములఁ జిత్తగింపుఁడు. అనిచెప్పుచు నుప్పొంగుచుండెడివారే పెక్కండ్రుగలరు! కాని, మాగ్రంధమున నిక్కడ నీవిధముగా ధ్వన్యర్థము స్ఫురించుచున్నది యని చెప్పెడువారిని సామాన్యముగా నేనుజూడలేదు.

ప్రబంధములను గ్రమముగాఁ జూచుచురాఁగా మొదటదేవతాస్తుతి. సుకవినుతి. కుకవినింద. కర్త్రుస్వప్నమొందె, నాహ్వానమొండె. వంశావతారము. షష్ఠ్యంతములు. ఇవిసామాన్యములుగదా! పిదప, 1. పురవర్ణనమునమేడల, ఏనుఁగుల, గుఱ్ఱముల, వర్ణించునెడల నతిశయోక్త్యత్యుక్తులతో మేడలశిఖరములు మేఘమండలమునుదాఁటి యున్నవనియొకరనఁగా, మఱియొకరుచంద్రమండలమును దూసిపోయినవి యనియనును. ఈయలంకారములచేతనే వ్యంగ్యమును గ్రహింపవలయును. అన్యములగు 2. నాయక. 3. నాయిక. 4. వన. 5. నాయికానాయకులచక్షుఃప్రీత్యాదులు. 6. విరహము. 7. దౌత్యము. 8. సూర్యాస్తమయము. 9. చీఁకటి. 10. చంద్రోదయము. 11. చంద్రిక. 12. చంద్రమన్మథాదులయుపాలంభము. 13. మధుపానము. 14. కోడికూఁత. 15. చంద్రాస్తమయసూర్యోదయములు, 16. జలక్రీడ. 17. వనవిహారము. 18. దోహదము. 19. పుత్త్రోత్సవము. మొదలగు వర్ణనములు సర్వప్రబంధములయందును సామాన్యముగ నించుకభేదముతో నొక్కటేవిధమునఁ గానంబడుచున్నవి. తెలుఁగుదేశమునఁ గొన్నిమండలములలోఁ బుష్పలావికలు లేకున్నను దమరు చూడని పుష్పలావికావర్ణనమును మానినవారులేరుగదా? ఇట్టివర్ణనము లనేకములుస్వయముగాఁ జూచియెఱుఁగనివి యొకరి గ్రంథమునుండి గ్రహించి మార్చివ్రాసినవిగాక స్వకల్పితము లెట్లగును? తిక్కనసోమయాజులు స్వప్నవృత్తాంతమును జెప్పఁగా నదియేమో విశేషమని

పెక్కండ్రా మార్గముననే యనుగమించిరి. మఱికొందఱు జపముచేసి కొనుచున్నప్పుడు గూడ స్వప్నవిధముగాఁ గొంచెము కనులకు మైకము గమ్మియున్నప్పుడీశ్వరుఁడు నీకృతిని నాకిమ్మని యడిగినట్లును వ్రాసి కొన్నారు. ఇవి యెంతవఱకు యదార్థములై యుండును? ఇట్టివెల్లు లన్నియు గతానుగతికములు; కాని, యదార్థములుకావు. వసుచరిత్ర మునకు బిదపఁ బ్రబంధములు రచియించిన వారిలోఁ బెక్కండ్రు వసు చరిత్రమువలెనుండవలెనను నూహతో నాపద్యములనంటి నడకగల పద్యములును, ఆకల్పనలమార్చి విరూపములఁగావించిన కల్పనలునుజేర్చి తమది పిల్లవసుచరిత్రమను ప్రఖ్యాతిని బడసియున్నారు. కొందఱు పిడిదము సూరకవిచెప్పిన కవిజనరంజనమును బిల్ల వసుచరిత్రమనుచున్నారు. కొందఱు రసికజనమనోభిరామమును బిల్లవసుచరిత్రమనుచున్నారు. మఱికొందఱు చెళ్ళపిళ్ళ వేంకటకవిరచియించిన యామినీపూర్ణతిలకా విలాసమును (ఇప్పుడు తునిలో నచ్చుపడినది గాక పరిశుద్ధమగు ప్రతి వేఱొకటికలదు) బిల్లవసుచరిత్రమనుచున్నారు. వసుచరిత్రమునకుఁ బూర్వము రచియింపఁబడినదైనను శైలినిబట్టి తపతీసంవరణోపాఖ్యాన మునుగూడ నట్లేయనుచున్నారు. శబ్దరచనావిశేషముచేతను, గల్పనా సామ్యములచేతను వసుచరిత్రముతోఁ దుల్యములని యుప్పొంగు చున్నారే కాని, యర్థచమత్కృతిచేతను, భావగాంభీర్యముచేతను వసు చరిత్రముతో సామ్యమును జూచుకొనుచున్నవారు. కారు. ఆంధ్ర భాషలోని ప్రబంధములెల్ల నించుమించుగా నొక్కటేవిధముగఁ గాన బడుటంజేసి బాలకులభ్యాసముకొఱకు వరువడి చూచినట్టియు రీతిని గల్పనలదొంగిలి యవయవములమార్చి నిఘంటువులదగ్గఱనిడు కొని వలయుపదములనేర్చి ఛందోబద్ధముఁ గావించుమాటలమూట లను గవిత్వమనఁజనునా ?

శ్లో. కవిత్వంజాయతేశక్త్యా, వర్ధతేఽభ్యాసయోగతః
తస్యచారుత్వనిష్పత్తౌ, వ్యుత్పత్తిస్తుగరీయసీ.

అని కావ్యదర్పణమునను; శక్తిః=పుణ్యవిశేషః, సహజప్రతిభేత్యుచ్యతే. శక్తిః, అభ్యాసః, వ్యుత్పత్తిః త్రితయం కావ్యసాధనమ్. అని యలంకారశేఖరమునను జెప్పినవిధమున శక్తియు, నభ్యాసమును, వ్యుత్పత్తియు నను సాముదాయకహేతువు లేక జల్లుపదములచేఁ బద్యములనల్లుచుఁ బూర్వగ్రంథములలోని కల్పనలులోనగునవి గ్రహించుచు గొప్పకవినై గ్రంథము చెప్పనెడల గ్రంథచౌర్యము విత్తచౌర్యమువలెనే దిద్వత్కవిరాజసమ్ముఖమునఁ గొఱఁతపడి హాస్యాస్పదుఁ డగుటకంటె నపయశము వేఱుగ లేదుగదా?

మ. బరువై తోఁచుకుటుంబరక్షణకుఁ గాఁ బ్రాల్మాలి చింతన్నిరం
తరతాళీదళసంపుటప్రకరకాంతారంబునం దర్థపుం
దెరువాటుల్దెగఁ గొట్టి తద్జ్ఞవిలసద్విజ్ఞాతచౌర్యక్రియా
విరసుండై కొఱఁతంబడుం గుకవి పృథ్వీభృత్సభాపఙ్క్తిలన్.

అని మనుచరిత్రము.

పింగళి సూరనామాత్యుఁడు కళాపూర్ణోదయమునఁ దనకథాకల్పనాచమత్కృతియు, రచానైపుణ్యమును, నర్థగౌరవమును ననన్యసామాన్యములుగాఁ గనఁబఱచుటంజేసి యాంధ్రభాషావాఙ్మయమునకిదియొక రత్నాలంకారమై యొప్పుచుండెనని నిశ్చయముగాఁ జెప్పందగియున్నది. కాళిదాసుఁడు మేఘసందేశమును జిన్నకావ్యముగా రచియించినను సందలి నిరుపమానప్రతిభకు ఖండాంతరపండితులు సైతము నలరి మిగులశ్లాఘించుచున్నారు. గ్రీకు, ఫ్రెంచి, యింగ్లీషులోనగు భాషలయందిట్టి స్వతంత్రకవిత్వమును జెప్పు నిరుపమానకవీశ్వరులు పెక్కండ్రు గలిగియుండుటంబట్టియే వారాంధ్రమున నొకటి రెండు కావ్యములు తప్ప మిగిలినగ్రంథములయందలిది కవిత్వమే కాదనియు, నాంధ్రమున నింతదనుక నిజముగఁ గవియనఁ దగినవాఁడు పుట్టనే లేదనియుఁ జెప్పుచున్నారు. లోకైకవిదితమై గణనాతీతమగు గ్రంథవారాశిగల సంస్కృ

తభాషయందుధ్వని నిరూపణమున "నొకటిరెండుకావ్యములు, ఒక రిద్దఱుకవులు" నని వక్కాణించె. ఇఁక నితరభాషాగ్రంథముల లెక్క యెక్కడ?

ప్రకృత గ్రంథకర్తయయిన సోమశేఖరకవి ధ్వని ప్రధాన ముగాఁగల యత్యుత్తమ కావ్యరచనముఁ గావింపఁ గలవాఁడని చెప్ప సాహసింపను; కాని, శ్లేషలు యమకములు మొదలగు శబ్దాలంకారములతోఁ బ్రబంధములు రచియించు మధ్యకాలకవులకుఁ దీసిపోవు వాఁడుకాఁడని నేనుజెప్పఁగలను. అమరము నానార్థరత్నమాలలోనగు కొన్నిసంస్కృతకోశములును, కొన్నిసంస్కృతకావ్యములును, మనువసుచరిత్రాదియాంధ్రప్రబంధములును నీకవికి జిహ్వాగ్రమున నాట్యముచేయుచుండును. కొన్నికల్పనలు స్వయముగా నూహించు సామర్థ్యను గలదు. సామాన్యముగా నేపద్యముఁ జెప్పఁబూను కొన్నను శ్లేషయో యమకమో లేకుండ నల్లెడు నభ్యాసముగలవాఁడుకాఁడు. ఈకవికి శ్లేషలకు శబ్దాలంకారములకు బుద్ధినడుచునట్లుగా నర్థాలంకారములయందు సామాన్యముగా బుద్ధిచొరఁబడదు. కావ్యములలోఁ జదివినదితప్ప సంస్కృతవ్యాకరణమునఁ బరిచితిలేదు. చిన్నయసూరిబాలవ్యాకరణమును బద్యములుగా రచియించినను సామాన్య ప్రయోగములకంటె మించిన యాంధ్రవ్యాకరణమును దెలిసినట్లు గానంబడదు. అలంకారవిషయము లఁగొందపరిచితిగలదు.

ఈకవిసామర్థ్యము తెలియుటకై తత్కృతగ్రంథములలోని పద్యములఁ గొన్నిటినిందుఁ బొందుపఱచెద.

1. ప్రభావతీపరిణయము. ఇందలిపద్యములిటఁ జేర్పనక్కఱలేదు.

2. హేలావతీపరిణయము, కుబ్జావివాహము.

ఉ. సంతసమొప్పఁ దోఁచెను వ ♦ సంతము మంజులకోకిలస్వనా
కాంతము కోరకప్రకర ♦ కాంతము బంభరగానశోభితా

శాంతము సర్వమంగళ ని ♦ శాంతము మోచితయానమాని నీ
స్వాంతము భూతసత్త్వధిక ♦ శాంతము స్ఫుల్లలతాంతకాంతమై.

3. రామకృష్ణార్జున నారాయణీయము.

శా. చాపప్రాభవ బాణసంచయ లస ♦ చ్ఛౌర్యాప్తి చేమించుత
ద్గోపగ్రామణి కృష్ణుఁగన్గొని మహా ♦ గోదాగ్రదైత్యాళివి
క్షేపప్రోజ్జ్వలశక్తి మార్గమిచటన్ ♦ సిద్ధించెరండంచు నా
భూపుంజూచినత త్రిత్తిత్రిదశులీ ♦ పొల్చిరా మహోత్సాహులై.

4. నరపభూపాలరాజీయము.

ఉ. భూరిగుణాఢ్యుఁడైన గురు ♦ భూపతిఁగాఁగదలంపుమాత్మలో
శ్రీరమణీలలామయగు ♦ సీతనుమాతనుగాఁదలంపుమీ
సారతరంబరణ్యమును ♦ స్వస్థలిఁగాఁగను మెల్లభంగులన్
దారకబుద్ధిమీరకవ ♦ నస్థలికింజను రామఁ గొల్వగన్.

అయోధ్యాకాండ.

5. చిన్నయసూరి బాలవ్యాకరణము. పద్యకావ్యము.

సీ. ప్రథమయుఁగయి రెుక్క ♦ వట్టీతరంబులై
వరఁగు విభక్తిక ♦ ప్రత్యయములు
నల్లనుత్తమ పురు ♦ షైక వచనములుఁ
దద్ధర్మభూతప్ర ♦ థమ పురుషము
లేక వచనములుఁ ♦ బ్రాకటాశీరర్థ
కములౌనడుతవర్ణ ♦ కములనంత
రార్థకశతృతు ♦ ద్వ్యర్థచేదర్థకం
బులుఁ దానునేనులు ♦ వలెప్రభృతులు
ధరదుత్రిత ప్రకృతికములై ♦ తనరు; మఱియు
మిగిలినవియెల్లఁ గళలన ♦ మెరయుచుండుఁ

గ్రిమముతోడ నుదాహార ♦ ణముల విడఁదు
బాలురెద మెచ్చఁ గామేశ ♦ పండితార్య.

సంజ్ఞాపచ్ఛేదము.

కృష్ణలీలావిలాసము. తత్ప్రాదర్శము నను గ్రంథములు నాకు దొరుకమింజేసి యిందుదాహరింపఁ బడవయ్యె.

## కృ తి స్వీ కా ర ము .

ఈకృతిపతి యీకృతిని స్వీకరించునప్పు డీపట్టణమున నున్న శ్రీ పెద్దిభొట్ల పూర్ణయ్యపంతులుగారు General Deputy Colletor. మొదలగు గొప్పయుద్యోగస్థులును, శ్రీ దివాన్‌బహదూరు దురుసేటి శేషగిరిరావు పంతులుగారు B. A. B. L. High Court Vakil. మొదలగు న్యాయవాదులును, విశాఖపట్టణవాస్తవ్యులగు శ్రీమాన్ పరవస్తు భట్టనారాయణస్వామి యయ్యవార్లుగారు లోనగు విద్వచ్ఛిరోమణులును, శ్రీ దివాకర తిరుపతిశాస్త్రిగారు లోనగు పండిత కవివరులును, వేదశాస్త్రసంపన్నులగు ననేకవిద్వచ్ఛిఖామణులును, ననేక కవివరులును బంధుమిత్రులగు ననేకులు గొప్పవర్తకులును సభాసదనము నలంకరించియుండఁ గృతిపతియు సభామధ్యముననుండి వచ్చువారి నుచితగౌరవముల నాదరించుచుండ శ్రీ కాళ్ళకూరి నారాయణరావుకవివరులు ప్రత్యేకబాహాటపాంచాలశయ్యలతో రాగములమార్చి సభ్యులకానందంబుప్పొంగ శ్రావ్యముగాఁగృతిని జదువుచుండ, సకలతంత్రపారజ్ఞులగు శ్రీ కప్పగంతు రామశాస్త్రులవారు పద్యములయందలి శ్లేషాద్యర్థములను భావములను దేటమాటలతోఁ దెల్లంబుగఁ జెప్పుచుండఁ గృతికర్తయు నేనును వారిచెంగటనుండి కవిహృదయమునందందు విశదపఱుచుచుండ రాత్రియెనిమిది గంటలకుఁ బ్రథమాశ్వాసము వినిపింపఁబడియె. గృతిపతి కృతికర్తను జాంబూనదాంబరముల తోడనుఁ బుష్పమాలికలతోడను నలంకరించి యేనూటపదునార్లతో

బహూకరించె. ఆశీర్వాదములతోడను కరతాళధ్వనులతోడను నాఁటిసభ ముగిసినతోడనే కవివరుని మంగళవాద్యముల తోడను కరదీపికానికరములతోడనుమహావైభవములతోనూరేగించి యానందింపఁజేసిరి. కృతిపఠనాంతరమున నర్థతాత్పర్యముల సభ్యులమనములను రంజింపఁజేసిన శ్రీకప్పగంతు రామశాస్త్రులవారిని నూటపదునార్లతోఁ బూజించెను. సభ్యుల వీనులకువిందుఁగొలుపునట్లు గ్రంథపఠనమునుఁ గావించిన శ్రీ కాళ్ళగూరి నారాయణరావుగారి కుచితసత్కారముల గౌరవించుటయేగాక " గ్రంథపఠనచతురాస్య " యను బిరుదాంకితమగునొక బంగారు పదకముతోఁగూడ నానందింపఁ జేసెను.

ఈగ్రంథమును గనియిచటికిఁ దెచ్చినదిమొదలు ముద్రణాంతము దనుక వ్రాయుటమొదలగు కృత్యములకు నాతోనెల్లప్పుడు విమువక యుండి యది దిద్దుటకును, టీకవ్రాయుటకును నన్నుఁ బ్రోత్సాహపరచుచు గ్రంథమును బూర్తిగావింపఁ జేసిన శ్రీవేదునూరి రంగయ్య పంతులుగారి యందుఁ గృతిపతులు మిగులఁ గృతజ్ఞులై యుందురుగాక.

ఇందు శ్లేషలు మొదలగునవి మెండుగానున్నందునఁ బాఠకులర్థగ్రహణమునఁ దొట్రుపడకుండ సుగమముగానుండుటకై కవ్యభిప్రాయానుసారముగాఁ గృతిపతికోరికనుబట్టి చివరఁగొంతలఘుటీక వ్రాసినాఁడ.

ఈగ్రంథమున నచ్చటచ్చట నేనురచియించిన గద్యములునుఁ బద్యములును గొన్నిగలిగియుండుటచే వానిభేదములు తెలియుటకై వానిమొదట * నిట్టి నక్షత్రసంజ్ఞలుంచఁ బడియె.

ది 10 జూను ఆ 1912.
కాకినాడ.

పాడి వెంకటస్వామి,
వేంకటనారాయణపాఠి.
పిఠాపురపురాజావారి కాలేజీపండితుఁడు.

# శ్రీ ప్రభావతీపరిణయము.



విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.

చతుర్థాశ్వాసము.







శ్రీరస్తు.

# శ్రీ ప్రభావతీ పరిణయము.

## ప్రథమాశ్వాసము.

శ్రీలక్ష్మీపతి నాథకౌస్తుభమణి ♦ శ్లిష్టాత్మబింబప్రభో
ద్వేలవ్యక్తిఁ బరాబ్జనేత్రియని భా ♦ వింపంగ వేదానిత
ద్బాలశ్లేషత మాన్చి సవ్యకమలా ♦ ప్రాణేశుఁడా వేణుగో
పాలగ్రామణి వేంకటాచలపతి ♦ న్భద్రోన్నతిం జేయుతన్

సీ. పద్మ పద్మాలయ ♦ పద్మారి సోదరి
పద్మాక్షుసతి సిత ♦ పద్మపాద
కమల కమలపీఠ ♦ కమలసన్నిభనేత్రఁ
కమలకలంబుని ♦ గన్నతల్లి
యబ్జ యబ్జశిరోధి ♦ యబ్జశోభితపాణి
యబ్జసంభవుమాత ♦ యబ్జవదన
హీర హీరకలాప ♦ హీరాళిరోమాళి
హీరలసన్మధ్య ♦ హీరవేణి
తల్లితల్లి జగంబుల ♦ తల్లిసద్రు
వల్లి వనితామతల్లిస ♦ న్మల్లికాళి
సల్లలితహాస యలపాల ♦ వెల్లిబోద
వేంకటాచలపతియింట ♦ వెలయుఁగాత. 2

శా. సామాథర్వణఋగ్యజుస్సు లనఁగా ♦ సంధిల్లువేదంబులు
ద్దామప్రక్రియ నేకకాలమున నం ♦ దం బొందఁగాఁబల్కునె
మ్మోముల్నాలుఁగుదాల్చినట్టిసుమనో ♦ ముఖ్యుండుదీర్ఘాయువుల్
క్షేమం బిచ్చుత వేంకటాచపతి ♦ శ్రీశాలి కెల్లప్పుడున్. 3

సీ. గురుకాంతినిర్జిత ♦ కుందేందుకాదంబ
హాటకరత్నపీ ♦ ఠావలంబ
నీలనీలాలక ♦ నిందితరోలంబ
సద్వక్త్రజితపూర్ణ ♦ చంద్రబింబ
యంబుసంభవసంభ ♦ వాననాంబుజలంబ
కమనీయసరసస ♦ త్కవిజనాంబ
కాంచికాంచిత దివ్య ♦ కాంచనాంద్రినితంబ
యధరాధరీకృత ♦ మధురబింబ
వితతలోకకుటుంబ సం ♦ శ్రితకదంబ.
సరసగుణమణినికురుంబ ♦ శారదాంబ
కలితతాండవ మొనరించుఁ ♦ గాత తాత
రాణివాణిమదీయాగ్ర ♦ రసనసీమ. 4

సీ. అభ్రోల్లసత్కేశు ♦ లై చెలంగెడువార
లతులహీరకలాపు ♦ లైనవారు
కమలలసత్పాణి ♦ కాంతులు గలవారు
శిరమున శశికళఁ ♦ జెరుపువారు
ఘనసర్వమంగళా ♦ ఖ్యను గాంచి తగువారు
వాగర్థములరీతి ♦ వఱలువారు
రామాభిరామత ♦ రమణ కెక్కినవారు
పటుకదంబావాప్తిఁ ♦ బరఁగువారు

వేషభాషల నేకమై ♦ వెలయువారు
పార్వతీపరమేశ్వరు ♦ ల్భద్రమతులు
సిరుల సమకూర్తు రెంతయుఁ ♦ గరుణతోడ
వేంకటాచలపతికి నే ♦ వేళలందు. 5

సీ. ఏనాగముఖుఘన ♦ శ్రీనామ మెదనెంచి
యానాభిజుండు కృ ♦ తార్థుఁడయ్యె
నేకపిత్థప్రియు ♦ శ్రీకటాక్షము చెంది
నాకవల్లభుఁడు సు ♦ శ్లోకుడయ్యె
నే మహేశ్వరసూతి ♦ శ్రీమూర్తిఁదలపోసి
రామచంద్రుండు నీ ♦ రధినిగట్టె
నేపార్వతీసుత ♦ శ్రీపాదములఁ గొల్చి
గోపాలపతి నిందఁ ♦ బాపుకొనియె
నట్టిఘననాథుఁడఖిలలో ♦ కైకనాథు
డతిగుణసనాథుఁడమలశాం ♦ తాతిమేదుఁ
డాయురారోగ్యసంపద ♦ లొసఁగుఁగాత
వేంకటాచలపతికి ని ♦ ర్విఘ్నముగను. 6

సీ. కన్యకాంబ హిమాగ ♦ కన్యకాంబ యె గాక
పరసర్వమంగళా ♦ వాప్తిఁగనునె
కన్యకాంబ నుతవా ♦ క్కన్యకాంబయెగాక
మహితవాణియసంగ ♦ మలయఁగలదె
కన్యకాంబ యదక్ష ♦ కన్యకాంబయెగాక
బుధగురుప్రీతిచేఁ ♦ బొదలఁగలదె
కన్యకాంబ ధరిత్రి ♦ కన్యకాంబ యె గాక
వహ్నిప్రవేశత ♦ వఱలఁగలదె

కాన సీచాన శర్వాణి ♦ కనకగర్భు
రాణిరోహిణిరామాలి ♦ వేణి యనఁగ
నవని వెలసినపార్వతి ♦ యలరుసిరులు
వేంకటాచలపతి కిచ్చి ♦ వెలయుఁగాత. 7

సీ. క్షమఁ గవితాకల్ప ♦ కమునాటెనొక్కండు
శాఖశాఖోన్నతిఁ ♦ జరిపె నొకఁడు
సదుపమానోన్నతిఁ ♦ బాదలఁజేసెనొకండు
సుమనోర్ధగురుస్ఫూర్తిఁ ♦ జూపెనొకఁడు
ఖగవరాంతస్థితిఁ ♦ గల్పించెనొక్కండు
తులఁదూఁగ రసపుష్టి ♦ నిలిపె నొకఁడు
లలితపదస్ఫూర్తి ♦ వెలయించె నొక్కండు
నిఖిలగుణంబుల ♦ నించె నొకఁడు
వారి భాషావిలాసకా ♦ సారకవులఁ
గవులనాకూద్భవవ్యాస ♦ కాళిదాస
భారవిమయూరభవభూతి ♦ సూరిదండి
మాఘులను మాఘులను నాదు మదిని గొలుతు. 8

గీ. ప్రకటవాగనుశాసన ♦ పాత్రిమందు
బుట్టి శ్రీనాథుపదమును ♦ మెట్టి సోము
తలనువెలయించికుండలి ♦ తావునంటు
కవితయనుగంగగలయాంధ్ర ♦ కవుల్ఁదలఁతు. 9

క. గురుభక్తిని గొలిచెద మ
ద్గురుని న్వరనిష్ఠశక్తి ♦ గురునిమనీషా
గురు నోరుగంటిలక్ష్మీ
నరసింహామనీషగురుని ♦ ననగుహాగురినిన్. 10

సీ. ఏకవి శ్రీరాము ♦ కృష్ణుచేఁ దనబాల్య
దశయందు నూటప ♦ దార్లుగొనియె
నేమేటి శ్రీభూల ♦ తీ మాధవవిచిత్ర
నైషధాదుల నాంధ్ర ♦ భాషఁజేసె
నేశౌరి కావ్యప్ర ♦ కాశలక్షణయుక్త
నాంధ్రకావ్యపయోధి ♦ నలరఁ జేసె
నేకృతిజ్ఞ కృత ♦ వ్యాకృతిగణసూత్ర
ధాతుమాలలు సంస్కృ ♦ తమునఁజేసె
సత్ప్రసూతకృశ్యపాడివం ♦ శాబ్ధిచంద్రు
డైనవేంకటస్వామియాం ♦ ధ్రానుశాస్త్ర
పార్థునకుఁ గృష్ణునలెఁ దోడు ♦ పాటొనర్ప
బల్కినాఁడఁ బ్రభావతీ ♦ పరిణయంబు. 11

ఉ. ధారుణి శాస్త్రనైగమవి ♦ ధానము లేక విభాసివిద్యసం
స్కారము లేక మేలమర ♦ కాండపటిష్ఠత లేక భీరులౌ
వీరుల, బోలుచున్నకుక ♦ విప్రచయంబు లనూయబల్మిచే
వీరుల సర్వధీరులఁ గ ♦ విప్రకరంబుల గెల్వనేర్చునే. 12

వ. అని యిష్టదేవతాభినందనంబును గురుజనవందనంబును సుకవిపురస్కారంబును కుకవితిరస్కారంబును గావించి ప్రభావతీ పరిణయం బనునొక్క శృంగారరస ప్రబంధమును రచియింపం బూని యున్న సమయంబున. 13

—: కృతిపతిసభావర్ణనము. :—

సీ. రాజరాజసఁగను ♦ రహిఁ వెలింగెడివాఁడు
సర్వజ్ఞమైత్రిని ♦ జరుపువాఁడు
ధనదుఁ డసంగను ♦ దనరుచుండినవాఁడు
నిధినాయకుం డన ♦ నెగడు వాఁడు

మనుజధర్మాఖ్యచే ♦ మలయుచుండినవాఁడు
ధనపతి యనుఁగిను ♦ దగినవాఁడు
సోమాఖ్యచేతను ♦ సొంపునింపెడువాఁడు
శ్రీదుఁడనంగను ♦ జెలఁగువాఁడు
మఱియువైశ్రవణుండన ♦ మెఱయుశౌరి
యక్షరక్షకుఁడనఁగను ♦ లక్షితుండు
చారుపైఁడాన్వయాంభోధి ♦ చంద్రుఁడయిన
వెంకటాచలపతికీర్తి ♦ వితతిసుకృతి. 14

సీ. * చేయించె నేసూరి ♦ శ్రీవేణుగోపాల
బాలభోగంబు శా ♦ శ్వతపులీలఁ
గ్రీడించె నెవ్వఁ డాం ♦ గ్లేయనాయకసభా
కార్యనిర్వాహసభ్య ♦ గౌరవమున
నిప్పించె నేశ్రేష్ఠి ♦ యెఱమి రాజులకు ల
క్షలకొలందిగరొప్ప ♦ ముఁఋణములు
నిరువుకొల్పె నెవండు ♦ నిరుపేదలకు హూణ
సార్వభౌమునిపేర ♦ సత్రిమొకటి
ఋషివరు లఖండగోదావ ♦ రీజలంబు
సప్తవిధములఁ గైకొన్న ♦ చాయయంత్రి
నాళముల గౌతమిని గాకి ♦ నాడ వాడ
వాడలకతండె తెప్పించి ♦ వన్నెకెక్కె. 15

సీ.* పరఁగించె నేమేటి ♦ పదివేలు వెచ్చించి
టౌనుహాలనెడుస ♦ భానిలయము
నెలకొల్పె నేశౌరి ♦ నిజశుభాభిఖ్యచేఁ
గాలేజిలో నొక ♦ ఘనభవనము

జతగూర్చి సేవించుసం ♦ స్కృతపాఠశాలాభి
వృద్ధికై యొకకొంత ♦ విత్తచయము
పొసఁగించె నేదాత ♦ వసురాశి జంతుహిం
సా నివారకజన ♦ సంఘమునకు
మఱియు నాశ్రితపండితా ♦ మాత్యవరుల
కెందఱికిఁ దివ్యభవనంబు ♦ లెలమినిచ్చె
శ్రీమదాంగ్లేయచక్రిన ♦ ద్రివరదత్త
రావుసాహేబుబిరుదవి ♦ భ్రాజియతఁడు. 16

వ. వెండియు నవఖండాఖండభూమండల మహారాజాఖండలకాండ నిరంతర సేవ్యమానుండును ధనచయోత్తమర్ణతాకారణసమాగత రాజాధిరాజసంతతనిరంతర కాండాయమానవేదండ ఘటామద ధారాసంపాదితగృహాంగణకర్దమకర్దమనివారణపటుతరాజభూమ పరజోరాజమండలుండును లలితమహాజనాఖండలుండును గంభీరభూరిజంభాసురారికుంభిదర్పశుంభదంభోజవైరిడింభావతంస సంభాసమానశంభుకుమాభృబృందం భోదవాజిజృంభత్సువాజి కుంభీశసేశకుంభిద్విషదంభోరుహ సంభూత కుంభిగమనాంభోజ నేత్రిపర సురకుంభినీశాంభోధిసంభూతమణికామధేనుడిండీరహార వరహీరహీరశరకాండనారదపారదవిరాజమానకీర్తిమండల వలక్ష క్షౌమవస్త్రదశదిశామాననీమానసంరక్షకుండును నిరతాశ్రితరక్షకుండును నిరంతరపండితప్రకాండదత్తదానధారాసంభూతనవీనవాహినీసంభోగాభోగరత్నాకరుండునుసుగుణమణిరత్నాకరుండును గంగాయమునాసరస్వతీనర్మదామహానదీవంశధారానాగావళీ శారదా గౌతమీ కృష్ణా కావేరి తుంగభద్రా తామ్రపర్ణీనివాసి వస్త్రపాత్రాదిషోడశమహాదాన సంతోషితభూదేవదేవుండును సద్భక్తిభాసితసంతోషితవాసుదేవుండును ప్రతివార్షికప్రదత్తక

న్యాదిదానకోటికోటివిముక్త పైతృకాదిఋణుండును సౌగంధిక ఫుల్లహల్లకకువలయనీలాంబుజ సితకుముదపుండరీక కాండసంచార మరాళధార్తరాష్ట్రచక్రవాకబకోటకుక్కుటచక్రవిభాసిత సుధామధుమధురజలస్నానపానాదిసంతోషిత విబుధాదిసకలజన సేవితానేకసారకాసారతీరసంస్థాపిత దేవాలయ ప్రతిష్ఠానిష్ఠాపి తృవరిష్ఠుండును సకలభూతదయాళుండును నిత్యసత్యాదివభవ్య మహైశ్వర్యవర్యతాలకేశ్వరుండును నేపాలపాంచాలాంగవంగ కళింగ కాశ్మీర కర్ణాటలాట మరాట మగధ మాళవ కాశీ గయా ప్రయాగ పాండ్య ద్రావిడాది సకలదేశవ్యవహార విహారశోభితుండును గాంగేయధరాధర సారధీరుండును రత్నాకర సమానగంభీరుండును నిరుపమాన జగజ్జేగీయమానమహావైభవ భోగదేవేంద్రుండును ఖండాంతరాంగ్లేయాది ప్రభుమండలవర్ణనీయభాషావిశేష శేముషీధురీణుండును విబుధజనాహ్లాదకరరమణీయగుణమణిగణాభరణుండును మూరకసగోత్రపవిత్రుండును నీలమేఘశ్యామల కోమలగాత్రుండును రామకృష్ణపవిత్ర చిత్రచరిత్రానురూపప్రవర్తన రామకృష్ణవైశ్య శ్రేష్ఠపుత్రుండును నయవినయసౌజన్య సౌశీల్యాది నైసర్గికగుణప్రకారాకరుండును పైడాన్వయ క్షీరపారావార, రాకాసుధాకరుండును, వెంకమాంబాగర్భశుక్తి ముక్తాఫలాయ, పావనుండును రావుసాహెబు బిరుదాంకుండును నగు వేంకటాచల పతీంద్రుండు శరశ్చంద్రచంద్రికాసుధాధవళితభాసురంబును దేశాంతర కాంతాంతరీ పానీతనిస్తులసమస్తవస్తువిస్తారితసౌధాంతరసభామంటపంబునందొక్కనాఁడు శ్రీకన్యకాపరమేశ్వరీకృపాప్రాప్తగూటాలాది బహుగ్రామవ్యవహార పరిపాలన లబ్ధసర్వదిగంతరపర్యంతవిశ్రాంతకీర్తిమతియుధీమతియుసకలసద్గుణసంపద్ధన్యయుసజ్జనమాన్యయు

నగు మన్నయు మహాలక్ష్మాంబ సపరివారంబుగా నొక వంకయ
వనికాభ్యంతరంబునసభ్యభావంబు నెఱప; సతతతిరస్కృతదు
ర్వాసనసమస్తజనామోదనివారితసర్వక్షేదసతతసర్వమంగళనినాద
మేదురవాదవవంశపయః పారావారరాకాసుధాకరాంగ్లేయప్ర
భుదత్తరాయబహద్దూర్బిరుద విభ్రాజమాన వైశ్యకులరత్న వేం
కటరత్నా హ్వయుం డొకచాయ వెలుంగ; సురూపరతిరాజ
ధనజితరాజరాజ భోగదేవరాజవాచాఫణిరాజభూతిజితగిరిజా
రాజదానజితాంగరాజ వాదము వెంకటరత్న సోదరాన్నపరాజ
వర్యుం డొకవంకను దేజరిల్ల; చారుసరచ్చంద్రచంద్రికా ధవళ
కీర్తియు సకలకార్యకరణనిస్ఫూర్తియు సర్వసద్గుణప్రవర్తియు
నిత్యదానాచరణజనచక్రవర్తియు నగు గ్రంధి రామమూర్తి
యొకఠేవ ఠీవి ప్రవర్తిల్ల; జనజితనిధిస్వామియు శక్తిజితకుమార
స్వామియు శౌర్యజితరాఘవస్వామియు దానజితసహజకంకర
స్వామియు విస్సన్నపేటాద్యనేక గ్రామస్వామియు నగు మోతే
వేంకటస్వామి యొక చెంతఁ గంతసింప; సర్వపర్వతసముద్రపుర
గ్రామసకలజనసహితసప్తఖండాఖండ మహీమండలధారణ చణ
ఫణామండల శేషావతార సుబ్రహ్మణ్యనామ విరాజితుం
డగు చుండూరి సుబ్బారాయుం డొకచోట నీటున మెఱయు
చుండ; శారదచంద్రచంద్రికాచాక చకితచాకచీకళాదుర్య జగ
జ్జేగీయమానకీర్తి క్షోమదశదిశామానినీ మానసంరక్షకుండును
ధానరాధేయుండును నార్వాకాద్యనేక గ్రామపరిపాలకుండును
గల్పకంబులదొడ్డియు వేల్పులగిడ్డియు నగు పేరూరి వెంకటరెడ్డి
యొకయోరఁ గేరుచుండ; తరుణారుణప్రభాభాగధగ్య కలాకలా
పలీలావిలాస సమర్థవజ్రమయచాకచక్య విభాభాసురసురమణి
కలాకలాపవిభ్రాజితకర్ణకరకలాపాదిశోభితుండును మాంధాతృ

దధీచిరాధేయకల్పక కామధేనుచింతామణీ సమానదానప్రభా వుండును రూపజితకావభవుండును శాంతిదాంతిసౌజన్య సౌశీ ల్యాది సద్గుణగరిష్ఠుండును బలివెలకుల కలశ వారాశినిశాకరుం డునగు చిట్టెయ్య యొకపట్టున దిట్టఁదనంబున కొటపట్టయి యుండ) నిఖిలజ్ఞానవిజ్ఞానభవ్యులగు పితృవ్యులును సౌజన్యగుణ మేదురరసోదరు లగు సోదరులును వసంతజయంతకుమార సుకు మారులగు కుమారులును నిఖిలప్రయోజన దీమంతు లగుసా మంతులును పురాణవిద్యానవద్యము హోద్యోగు లగునుద్యో గులును సుజనహితులగు పురోహితులును సకలకార్యనిర్వాహ కతంత్రులగు మంత్రులును సంతతసౌజన్యపాత్రులగు మిత్రు లును సరసకవితాకాసారకవు లగు కవులును నిఖిలశాస్త్రపురా ణమండితు లగు పండితులును సంగీతసాహిత్యవిద్యాన వద్యప్ర వీణులగు వైణికులును నౌచకాం చయనమాగతదీనార గణనా గణకులగు గణకులును నిఖిలపేటికా విశేషనిష్కసం చయనీతా నీత సంచారు లగుచారులును సర్వకార్యనిర్వాహపటు లగు భటులును బరివేష్టింప నిష్టగోష్ఠివినోదంబునం గొల్వుండి. 17

మ. ననుగోపాలక బాలరూపహరి ప ♦ న్నాళీక సేవాసదా
జనితానందుని నీలకంఠకరుణా ♦ సారసప్రసారోద్భవ
ధ్వనబంధోచిత గద్యపద్యకవితా ♦ ధారాసుధామాధురీ
ఖని సత్పూరివిధేయుఁ బిల్చి పలికెం ♦ గారుణ్యమొప్పారఁగన్. 18

సీ. రామాయణముఁగవి ♦ రచియించుటనుగదా
రఘువంశవిఖ్యాతి ♦ రహిఁజెలంగె
భారతంబును వ్యాస ♦ భట్టారకుఁడు చెప్పఁ
బాండుపుత్త్రచరిత్ర ♦ పరిఢవిల్లెఁ

గాళిదాసుండు స ♦ త్కవితఁ గూర్పుటఁ గదా
విక్రమాదిత్యుండు ♦ వెలసెఁ బుడమి
వాగనుశాసను ♦ వాణిచేతనుగదా
రాజరాజనరేంద్రు ♦ తేజ మొలసెఁ
బెద్దనార్యుండు సత్కృతి ♦ పెంపు సూపం
గృష్ణరాయండు జగతిలోఁ ♦ గీర్తి కెక్కె
విశ్వవిఖ్యాతకీర్తికి ♦ వేఱొకండు
గలదె మార్గంబు సత్కీర్తి ♦ కాముకులకు. 19

సీ. వనములు స్వల్పజీ ♦ వనములు దేవతా
లయములు లఘుకాల ♦ లయములరయ
నిక్షేపములు చోర ♦ విక్షేపములు చూడ
సరసు లంతంతకు ♦ విరసగతులు
అగ్రహారంబుల ♦ త్యుగ్రహారంబులు
సంతతులును దుష్ట ♦ సంతతులగుఁ
దనువులు బుద్బుద ♦ జనువులు పరికింప
లక్ష్ములు చంచలా ♦ లక్ష్ములరయఁ.
బూర్వరాజయశోబింబ ♦ ముకుర మైన
కృతియె శాశ్వతవిశ్రుత ♦ కృతియ గాన
సకలసంపత్సమేతుఁడౌ ♦ జనున కవనిఁ
దలఁపనిర్దుష్టకృతి కీర్తి ♦ తనువు గాదె. 20

క. ఎన్నాళ్లు తనదుకీర్తులు
వన్నెమిగిలి పుడమి మిగుల ♦ వర్తిల్లుం దా
నన్నాళ్లు నాకమందున
సన్నుతులెసఁగంగ నుండు ♦ సద్భోగముతోఁ. 21

సీ. మాడ్గుల శ్రీకృష్ణ ♦ మహీపు మెప్పించితి
లాలితకృష్ణవి ♦ లాసకృతిని
రామకృష్ణార్జున ♦ త్రిసంధికావ్యముచెప్పి
అలపూసపాటినా ♦ నారాయణునకు
లీలతో నరసభూ ♦ పాలరాజీయము
స్వకృతిఁజెప్పి వెలయించి ♦ తతనిసుతుని
వినుతతత్త్వాదర్శ ♦ మనుకృతి నొసఁగితి
రహిఁ గొడేగజపతి ♦ రాయధనికి
నాంధ్రగీర్వాణకవితల ♦ నాదికవులఁ
బోలితివి సీకవిత్వంబుఁ ♦ బొగడ వశమె
నలువకైనను వేనోళ్ళ ♦ చిలువకైన
సోమశేఖర కవిచంద్ర ♦ సుగుణసాంద్ర. 22

చ. తరువులు నగ్రహారములు ♦ దైవతసద్మతటాకముఖ్యముల్
ధరనెట నిల్పి రచ్చటనె ♦ తారొకనుసత్కృతి లోకమెల్లడన్
బరఁగును గాన మీరొసరు ♦ పం దలపెట్టినయాప్రభావతీ
పరిణయ మన్ప్రబంధమును ♦ భవ్యతనాకుఁ గృతింబొనర్పుడీ 23

వ. అని సబహుమానంబుగాఁ దాంబూలజాంబూనదాంబరాభరణాదుల నాదరించిన నేనును సంతోష తరంగితాంతరంగుండనై కృతిపతి వంశావతారంబభి వర్ణించెద. 24

—* కృతిపతివంశావతారము *—

సీ. ఇందిరాసుందరీ ♦ మందిరాయుతపీన
వక్షస్థలముతోడ ♦ వఱలువాఁడు
వక్రనక్రచ్ఛేద ♦ విక్రమోద్భాసిత
చక్రాయుధావాప్తి ♦ జరుపువాఁడు

వేదవేదాంగసం ♦ వేదివేది జనించు
డంబై సనాభిప ♦ ద్మంబువాఁడు
నాకలోకాలోక ♦ లోకసంరక్షణ
లీలతోఁ జగంబు ♦ లేలువాఁడు
రక్షకుండు మహాసుర ♦ శిక్షకుండు
మాధవుండు సురక్షిత ♦ గోధనుండు
సనకదైవతమునిజన ♦ సర్వభక్త
రక్షణపరాయణుండు నా ♦ రాయణుండు. 25

గీ. అఖిలలోకైకమాతకు ♦ నాదిలక్ష్మి
కాకరంబైన యాహారి ♦ యంకతలము
నందుఁ బుట్టినవర్ణంబు ♦ నందుఁగీర్తి
ధనులు పైఁడాన్వయాగ్రిను ♦ లవినుత జనులు. 26

గీ. అట్టిపైఁడాన్వయమం ♦ దధికధనుఁడు
మూఁరకసుగోత్రదుగ్ధాబ్ధి ♦ పూర్ణచంద్రుఁ
డాశ్రితామరకల్పకం ♦ బమితగుణుఁడు
వఱలె సర్వయ్య యనియెడు ♦ వైశ్యవరుఁడు. 27

మ. అతఁడష్టాదశపీఠసంచయమునం ♦ దాద్యంబుఁదా నొచు నీ
క్షితిలో నొప్పెడుపీఠికాపురమునన్ ♦ శ్రీయుక్తసంస్థానవ
ర్ధితసంపద్విభవాభిరామకులల ♦ క్ష్మీపుత్త్రపౌత్త్రాదిసం
గతుఁడై నసర్వసవంశవృద్ధికరుఁడై ♦ క్రాలెన్మ హుండారుఁడై 28

గీ. అతనియర్ధాంగలక్ష్మి తా ♦ నన్నపూర్ణ
భారతీదేవి మంజుల పద్మపాణి
క్షమధరిత్రి బుధావళి ♦ కల్పవల్లి
లలితగుణలక్ష్మి వేంకట ♦ లక్ష్మి దనరు. 29

క. ఆదంపతులకుమారుండు ♦ శ్రీదుండన
వెలయుచుండు ♦ సిరు లలరారన్
వాదింపఁ గఁ ♦ బోఁ జెప్పడు
వేదవిదులఁ బూజసేయు ♦ వీరన్నధరన్. 30

సీ. పాండురీకృతకేశ ♦ పాశభారతిఁ గాంచి
చతురాననుఁడు వృద్ధ ♦ శంకఁ జూడ
ధవళీకృతోరుకం ♦ ధరు భర్గుఁగనుఁగొని
భర్తగాఁడనియుమా ♦ భామచూడ
నర్జునీభూతాఖి ♦ లాంగపార్వతిఁగాంచి
హరిసూతిమాతగా ♦ దనుచుబ్రమయ
నిష్కళంకీకృత ♦ నీరజారిని గాంచి
వడి లోకు లాశ్చర్య ♦ వశతఁజూడ
వెలసె నెవ్వని సత్కీర్తి ♦ విపులమహిమ
దండి ముల్లోకములు నిండి ♦ గండుమిగిలి
యతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ ♦ డనఘమూర్తి
విజ్ఞయవీరన్న వీరన్న ♦ పృథివి నలరు. 31

గీ. క్షమకు క్షమ యనజగతిని ♦ జరుగులేమ
వాణి శ్రీహరిరాణి నా ♦ వఱలు రామ
సతియు సద్గుణవతి యనఁ ♦ జనెడుభామ
వెలయు రమణాంబ వీరన ♦ పెండ్లియాఁడె. 32

ఉ. * ఆరమణాంబయందు సర ♦ సాగణి వీరనగాంచెఁ బుత్త్రులన్
శ్రీరమణీదయాంచితులఁ ♦ జిత్తసముద్భవతుల్యరూపులన్
సారసనేత్రమిత్రపద ♦ సారసభక్తివిరాజమానులన్
హారపటీరకీర్తుల మ ♦ హాత్ముల రామనవేంకనాఖ్యులన్. 33

క. అందగ్రజుండు రామన ♦ బృందారక
తరువులట్లు ♦ విలసిలు సుతులన్
కుందేందుహార శారద ♦ కందయశోదనుల
ఘనులఁ ♦ గాంచెను వేడ్కన్. 34

సీ. పితృవాక్యపాలనా ♦ చతురుఁడై విలసిల్లు
వీరన్న వీరన్న ♦ వినుతిఁ గాంచు
గౌరవసత్కళా ♦ ధారుఁడై విలసిల్లు
గవరయ్య విబుధాన్న ♦ కల్పమూర్తి
యాశ్రితరక్షక ♦ మాధీశకీర్తియౌ
పెదవేంకటస్వామి ♦ పెంపుమీఱు
శ్రీరమణీనాథ ♦ సేవాధురీణుఁడౌ
చినవేంకటస్వామి ♦ చెన్నుమీఱు
మారసుకుమారసౌందర్య ♦ మహితమూర్తి
వినుత వేంకటనరసయ్య ♦ విమలకీర్తి
శౌరిపంచాయుధము లన ♦ శర్వవదన
పంచకంబన ధరనుతిఁ ♦ గాంచి రెలమి. 35

క. వీరనతనయులలోనను ♦ ధీరమణా
గ్రేసరుఁడు ద్వి ♦ తీయుఁడుసుగుణా
ధారుఁడువనితాళిమనో ♦ హారుఁడు
వీరుండు వేంక ♦ నాఖ్యుఁడు వెలయున్. 36

సీ. అలరఁజేబియ్యంపు ♦ టన్నంబుఁ దినుటచే
నిష్టమృష్టాన్నంబు ♦ లిడఁగఁదినఁగ
గట్టుపెనిలయంబు ♦ గలిగియుండుటఁజేసి
పుటభేదనావాస ♦ పటిమఁదాల్చ

వడ్డికాసులు గొను ♦ వాంఛనుండుటఁజేసి
సర్వసంపదలెల్ల ♦ జనులకొసఁగ
దూరంబుగాలచ్చి ♦ దొలఁగి యుండుటఁజేసి
సతతలక్ష్మీనివా ♦ సతనుగాంచఁ
గోరి వేంచేయువేఁకట ♦ శౌరి యనఁగ
రమణ పైఁడాన్వయాంభోధి ♦ రాజరాజు
దాతలకు దాతయనఁ గవి ♦ ఖ్యాతిమెఱయఁ
గళలశ్రీలక్ష్మి కన్న వేం ♦ కన్నమిన్న 37

సీ. రాముఁడై జగదభి ♦ రాముఁడై సాకేత
ధాముఁడై ధాత్రిలోఁ ♦ దనరెనెవఁడు
కృష్ణుఁడై భక్తవ ♦ ర్ధిష్ణుఁడై సుగుణరో
చిష్ణుఁడై ద్వారకఁ ♦ జెలఁగెనెవఁడు
కరమొప్పుసం ♦ హర్తయై వేంకట
భర్తయై శేషాద్రిఁ బరఁగెనెవఁడు
నాథుఁడై నుతజగ ♦ న్నాథుఁడై లక్ష్మీస
నాథుఁడై నీలాద్రి ♦ నడచె నెవఁడు
అట్టిహరి కాకపురమున ♦ నవతరించి
భక్తపాలన మొనరించి ♦ శక్తిమించి
యనుచు విబుధులువర్ణింప ♦ నలరుచుండె
దీప్తయశుఁడై సవేంకట ♦ గుప్తధరణి 38

చ. * అతఁడు పతివ్రతాతిలక ♦ మైయలరారినభామ సూనృత
వ్రత గుణధామ శీలరుచి ♦ వర్ణనసీమ వధూలలామ స్వీ
కృతగురుబంధుమిత్రబుధ ♦ కీలితధామ దయాభిరామ సం
స్తుతబుధ ధానసంభవ య ♦ శోరమవీరమఁబెండ్లియెతగన్. 39

క. వీరమ్మ సకలవిబుధా ♦ ధారమ్మ
సుశీలరూప ♦ దాతృత్వగుణా
ధారమ్మ భాగ్యలక్ష్మి ♦ సారమ్మ
యటంచు జనులు ♦ సంస్తుతిసేయన్. 40

క. అలదంపతు లిరువురకును ♦ జలజాక్షుభుజంబు
లనఁ గ ♦ జలనిధులనఁ గన్
విలసితగుణు లుదయించిరి ♦ నలువురు
దశరథకుమార ♦ నందను లో యనన్. 41

సీ. వీరన్న భుజశక్తి ♦ వీరన్న యైమీఱు
వరదక్షసవననం ♦ వర్ధనమునఁ
జెలమయ యమృతంపుఁ ♦ జెలమయయైమించు
నలసుధామధురవా ♦ గమృతఘటనఁ
జలమయ కాంచనా ♦ చలమయయైకాంతి
ధృతివిభుధాశ్రియ ♦ గతిమతమున
వీరన్న సత్ప్రభ ♦ వీరన్న యైయొప్పు
భర్గదేవార్చనా ♦ ప్రతిభవలనఁ
బెద్దయును జిన్నయును నను ♦ పేరె గాని
నలుగురును నాల్గుదెసలకు ♦ వలయువారు
విభవవర్తనవిత్తాఢ్య ♦ విశదగతుల
జగతి వెలసిరి పాండురా ♦ జ్ఞాతయశులు: 42

ఉ. వారలలో విశేషగుణ ♦ వారిధి నిర్మలకీర్తిచంద్రిర
క్షీరధి దీప్తిజాలపరి ♦ శిక్షితభీకరభానుభానుమ
త్సారధి ధర్మకర్మసము ♦ దగ్రనిరాగ్రహచిత్తసత్క్రియా
సారధి వేంకటార్యసుతు ♦ చంద్రుఁడుచెల్మయయొప్పుఁబెర్మితోన్.

సీ. సరససత్కృతిధర ♦ స్వామికిఁదగుఁగదా
సుమనస్తతికి నివా ♦ సములనిమట
ఘనగుణరత్నాక ♦ రునకును దగుఁగదా
బాడబజీవన ♦ స్పర్శనంబు
చక్రరేఖాంకిత ♦ శయనకుఁ దగుఁగదా
బ్రహ్మపోషణకళా ♦ పారమహిమ
కీర్తింప శ్రీరామ ♦ మూర్తికిఁ దగుఁ గదా
గురువాక్యపద్ధతి ♦ జరపికొనుట
యనుచు నెవ్వని వర్ణింతు ♦ రనుదినంబు
సకలదిగ్దేశనృపసభా ♦ స్థలములందు
నతఁడుహీరపటీరసీ ♦ హారతార
కీర్తి చెలమయ్య యనెడుస ♦ న్మూర్తి దనరు.

శా. శ్రీపైఁడాన్వయదుగ్ధవార్ధిశశియై ♦ శ్రీచెల్మయార్యాగ్రణి
శ్రీపప్రాభవమూర్తి హారశరస ♦ త్త్రీలోల్లసత్కీర్తిస
ల్లాపప్రాంచితవర్తి దివ్యకరుణా ♦ లక్ష్మీకళాస్ఫూరి ప
ద్మాపద్మాసనఁ బోలువేంకమలతా ♦ తన్వీమణి న్బెండ్లియై. 45

క. ఆవేంకమాంబ గుణమణి
సావిత్రిని సారసాక్షి ♦ సతిని ధరిత్రీ
దేవిని శ్రీమద్భాషా
దేవిని బోలుచును సిరులఁ ♦ దేలుచునుండెన్. 46

సీ. బిచ్చమెత్తుచు నున్న ♦ ప్రియునివారింపని
యన్నపూర్ణ యదెంత ♦ యాభిజాత్య
దుంపదూఁడులు మెక్కు ♦ దొరను వారింపని
వసుమతితానెంత ♦ వరగుణాఢ్య

ధరణిదానము బట్టు ♦ ధవుని మాన్పింపని
శ్రీకాంత తానెంత ♦ స్థిరగణింప
పతితలవాకిలిఁ ♦ బాయక యుండిన
వాణిమితోక్తిసౌ ♦ భాగ్య మెంత
యనుచు శర్వాణి కళ్యాణి ♦ యబ్జపాణి
కమలజునిరాణి మించి యా ♦ కమల నయన
పతికిఁబూర్ణతాపంకతా ♦ భవ్యమతులు
వెలయఁగను జేయు గుణాలంబ ♦ వేంకమాంబ. 47

శా. పంకేజాప్తకళానిధు ల్బలహరుల్ ♦ పాండ్వగ్రిజాతార్జునుల్
పంకేజాక్షమహేంద్రు లశ్వినులుఁనాఁ ♦ క్రౌంచద్విషుల్ పుత్త్రులా
వేంకమ్మాంబకుఁ జెల్మయార్యునకుబ్ర ♦ ఖ్యాంబుట్టిరత్యున్నతుల్
వేంకన్నార్యుఁడు రామకృష్ణుఁ డనను ♦ ర్వీదేవకల్పద్రులై. 48

సీ. కవిరాజులును గాని ♦ కవిరాజులును గారు
సరిరామభక్తిని ♦ స్తారకిళల
నరసింహములు గాని ♦ నరసింహములు గారు
సాటివిక్రమబల ♦ పాటవముల
ధీరేంద్రులును గాని ♦ ధీరేంద్రులునుగారు
భూరిలక్ష్మీదాన ♦ భోగగతుల
నరవీరులును గాని ♦ నరవీరులునుగారు
వెలయుగోపాలన ♦ విక్రమముల
గురుమహాబలులును గాని ♦ పురుడు చూడ
గురుమహాబలులును గారు ♦ ధరణిలోన
మతిబలంబుల ననుచుఁ బం ♦ డితులు వొగడఁ
గరలి రెలమి వేంకనరామ ♦ కృష్ణు లవని. 49

—: వెంకనార్యుని కుటుంబము :—

క. ఆయిరువురిలో నగ్రజుఁ డాయతగుణుఁ
డధికవితర ణాభోగతరా
ధేయుఁడు దృఢబుద్ధిని గా ధేయుఁడు
శ్రీవెంకనార్య ధీవరుఁ డలరున్. 50

సీ. పద్మినీప్రియు నిదు భవ్యదర్శనమబ్బ
కవిచక్రములు ప్రీతిఁ గాంచు టరుదె
దానరాధేయ నీ దర్శనం బబ్బిన
విబుధేంద్ర సద్వాంఛ వీడు టరుదె
త్యాగమందార నీ దర్శనంబబ్బిన
ద్విజతతుల్ ఫలసిద్ధి దేలు టరుదె
తతకళారాజ నీ దర్శనంబబ్బిన
సత్పాలనంబు తా జరుగు టరుదె
యనుచు విబుధులు వర్ణింతు రనుదినంబు
సకలవాగీశ విత్తేశ సభలయందుఁ
బుణ్యపైడాన్వయాంభోధి పూర్ణచంద్రు
నవ్యగుణగేయు వేంకన నామధేయు. 51

మ. అలమేల్మంగను వేంకటేశ్వరుఁడు స త్యాదేవిఁ గృష్ణుండు శ్రీ
జలజాక్షీమణి సారసాంబకుఁడు శ్రీ శైలేంద్రకన్యామణీ
తిలకంబు న్గిరిరాజచాపుఁడును వా గ్దేవిన్సరోజోద్భవుం డున్
వలెమంగాంబను వేంకనార్యమణి శో భం బెండ్లియాడెం దగన్ 52

క. ఆమంగాంబారమణిని భూమండలి
వినుతసాధ్విఁ బుణ్యగుణసతీ
గ్రామణిఁ గులబాంధవచిం తామణి
నెన్నంగ దరమె ? దక్షుల కయినన్. 53

సీ. రతితోడ దివ్యభా • రతితోడఁ బద్మినీ
సతితోడ సాటి యీ • సాటినాక్షి
క్షితితోడ మాధవ • సతితోడ నలచంద్ర
మతితోడ సాటి యి • మ్మంజువాణి
దితిసుతోడఁగనఁబ్రభా • వతితోడశశిచారు
మతితోడ సాటి యి మ్మహితగాత్రి
సతితోడ నలవిభా • వతితోడ శక్రేభ
గతితోడ సాటి యి • కమలనయన
యధరజితబింబ విబుధజ • నావలంబ
సరసముఖజితసంపూర్ణ • చంద్రబింబ
యనుచు సుకవులు వర్ణింప • నలరుచుండె
మహితసద్గుణనికురుంబ • మంగమాంబ 54

శా*. ఆనారీతిలకంబునందుఁ గులవి ఖ్యాతుండు వేంకన్న వి
ద్యానిష్ణాతుని జల్మయాఖ్యసుగుణుం • దా ర్ఘైకసంపన్నిధిన్
నానాదీనజనావనాంచితు జగ • న్నాథం దృతీయాత్మజున్
శ్రీనారాయణమూర్తి నింగనియె న • ర్థివ్రాతకల్పద్రుమున్. 55

ఉ*. వారలలోన నగ్రజుఁడు • వార్ధిగభీరుఁడు దీనమానవా
ధారుఁడు పూర్ణరాట్సుజన • తాబహువర్ణితవాక్ప్రపంచసం
చారుఁడు హారహీరదర • శారదనారదపారదాచ్ఛక
ర్పూరయశోవిశాలుఁడయి • పొల్చెనుజెల్మయబుద్ధిమంతుఁడై. 56

ఉ. * సాధితశత్రుమండలుఁడు • సాధుజనావనుఁ డాశ్రితామర
క్ష్మాధరుఁ డర్థికోటినవ • కల్పమహీజుఁడు ధైర్యనిర్జిత
క్ష్మాధరుఁ డింద్రభోగుఁడు వి • శాలయశోరమణీయుఁ డౌజగ
న్నాథుఁడు పొల్చు సాధుగుణ • నాయకుఁ డై కులసింధుచం
ద్రుండై. 57

ఉ. * ఆయత సద్గుణాభరణుఁ • డాశ్రితసాధుజనావనుండు వి
ద్యాయువతీమనఃప్రభువుఁ • డార్యజనస్తుతకీర్తి నిర్జితా
త్రేయుఁడు సర్వసజ్జనవి • ధేయుఁడు మంగమముద్దుపట్టి నా
రాయణమూర్తి దీనజన • తాపగతార్తి ధరంజెలంగెడుఁగా. 58

గీ. వేంకనార్యునిసంతతి • విశ్వమందు
బుత్త్రపౌత్త్రాయురారోగ్య • భూతి గనుచు
దేవభూదేవతాభక్తిఁ • దేజరిలుచుఁ
ధరణివెలయుత నాచంద్రతారకముగ. 59

—: రామకృష్ణ గంగాధర రామరాట్ప్రభువర్యుల మైత్రి :—

చ. * చలమయ కార్యవర్యునకు • సజ్జనసంస్తుతవేంకమాంబికా
లలనకుఁ బుత్త్రుఁడై విబుధ • లాలితకీర్తికి వేంకనాఖ్యవి
ట్తిలకున కెన్నఁదమ్ముఁడయి •ధీయుతుఁడై కరుణాసముద్రుఁడై
వెలసెను రామకృష్ణుఁడుక•విప్రకరంబులు మెచ్చునట్లుగాఁ 60

సీ. * ఎవ్వానివాకిట • నిందిందిరాకాంత
కాంతదంతావళ • ఘటలువెలయు
నెవ్వానిమోసల • నిందచంద్రసమాన
మానవనాథవి • తానమలరు
నెవ్వానిసత్త్రంబు • లీశ్వరవిబుధక
విశ్రేష్ఠసంచయ • విశ్రుతంబు
లెవ్వానిమందిరం • బేపార్ద్దు బాంధవ
సందోహసన్మిత్ర • సంకులంబు
ఎవనివాహ్యాళి బహుమాన • వేంద్రయుతము
నెవనిమంజురసారసైం • ధవఘనంబు
వఱలె నెవ్వాఁడు రావుస • ర్వజ్ఞసింగ
మహిపపౌత్త్రుండు సద్గుణ • మహితుఁడెపుడు. 61

చూర్ణిక. అభూద భూతపూర్వస్సర్వేశ్వరఇవ సత్కుమారశోభితః నారాయణఇవ లక్ష్మీవిరాజమానః కృష్ణఇవ గోపాలసేవితః పరమేష్ఠీవ విబుధవిరాజమానః శంభురివ సర్వమంగళోపేతః రామఇవ సంవర్ధితమిత్రజాతః మహేంద్రఇవ సుమనోవాంఛాప్రదః చంద్రఇవ సకలకలాకలాపః పావకఇవ నిత్యశుచిః ధర్మరాజఇవ సర్వసమబుద్ధిః నైఋతిరివ పుణ్యజనాధినాథః వరుణఇ వాశాంతపాలకః సమీరఇవ మహాబలః కుబేరఇవ ధనదః ఈశానఇవ మహైశ్వర్యదాయకః భోజరాజఇవ కవితారసజ్ఞః కర్ణఇవ మహాదానపరః నారదఇవ సంతతహరిభజనానురక్తః రుక్మాంగదఇవ సంతతైకాదశీవ్రతపరాయణః అంబరీషఇవ ద్వాదశీవ్రతనిష్ఠాగరిష్ఠః శేషాహిరివ సకలధారుణీభారధూర్వహః కాంచనాద్రిరివ విరచితవిబుధాగారః కల్పవృక్షఇవ సుమనోభిరామః కామధేనురివ సంశ్రితకామప్రదానశీలః చింతామణిరివ సంతతవితరణచింతాపరః పీఠికాపురసంస్థానసింహాసనాధీశ్వరః రేచర్లగోత్రకలశార్ణవసుధాకరః రావువంశకమల వనకమల బాంధవః శ్రీనీలాద్రి రాయమహీపాలకతనూభవః వేంకటమహీపతి గంగాధరరామ రాయనృపాలతిలకః విరాజితః. 62

శ్లో. గంగాధరస్స్యాత్కమనీయభూత్యా
గంగాధర స్స్యాత్సశివాత్మరీత్యా
శ్రీరామరాజశ్శ్రితపోషణాద్వా
శ్రీరామరాజః క్షితిపాలనాచ్చ. 63

శ్లో. శ్రీగంగాధరరామరాడ్విజయతే సర్వజ్ఞచూడామణిః
శ్రీలక్ష్మీసమాజః కళానిధిరసౌ సద్బంధుచింతామణిః
లక్ష్మీనాయకహృద్గతః కువలయామోదీచజైవాతృకో
లోకానందకరో బుధాన్నదపర స్సన్మార్గగామీ సదా. 64

శ్లో. తస్య బాల్యసఖః ప్రీతః-రామకృష్ణాంశసంభవః
పైడాన్వయాబ్ధిపూర్ణేందుః-రామకృష్ణో విరాజతే. 65

శా. ఆగంగాధరరామనాయన్నృపవం • చాస్యుండు కోదండవి
ద్యాగంగాత్మజతుల్యవిక్రముఁడు సా • దంబాఱ సౌహార్దతన్
భోగార్థంబుఁగి రామకృష్ణ నకుఁగొ • పూర్వగ్రామమున్నాళ్ళగాఁ
బ్రాగల్భ్యంబుననీయఁగైకొనియె సౌ • భాగ్యంబు శోభిల్లఁగాన్

—* రామకృష్ణుని కుటుంబగుణౌదార్యములు *—

సీ. రామకృష్ణాఖ్యచే • రంజతుండనవచ్చు
గోపాలనప్రౌఢి • గొలుచుండ
రామకృష్ణాఖ్యచే • రాజితుం డనవచ్చు
వేదశాఖాభేద • విధులవలన
రామకృష్ణాఖ్యచే • రంజిల్లు నవవచ్చు
లక్ష్మీవిజయశక్తి • లాంఛనముల
రామకృష్ణాఖ్యచే • రమణీయుఁడనవచ్చు
భూతిపావనరుచి • రీతిగతులఁ
గాన నీనామమన్వర్థ • కంబటంచు
నఖిలవిబుధులు వర్ణింతు • రనుదినంబుఁ
బుణ్యపైడాన్వయాంభోధి • పూర్ణచంద్రుఁ
గీర్తిగుణసాంద్రుఁ శ్రీరామ • కృష్ణచంద్రు. 67

సీ. పొత్తికమెత్తల • బోరలఁబడునాఁడె
సాష్టాంగదండము • ల్సలుపనేర్చెఁ
బైపైకిఁజూచుచుఁ • బాణిచాఁచెడునాఁడె
ప్రార్థనసందతికిచ్చు • భంగినేర్చెఁ
నప్పప్పయనుపల్కు • లాలకించెడునాఁడె
వేదలమొరవినఁ • బ్రీతిగల్గెఁ

బుడమిపై నడుగుల ♦ నిడి పరు విడునాఁడె
విబుధదీనావన ♦ విధము నేర్చె
సరససౌజన్యకారుణ్య ♦ చతురగతులు
వెన్న బెట్టెడునాఁడె పో ♦ వెలయ నేర్చె
నహహా ! యీతనిగుణగణం ♦ బగునె పొగడ
నార్యవినుతుండు రామకృ ♦ ష్ణార్య వరుఁడు. 68.

సీ. చేసెనా? యుపకారచింత ♦ రాముశరంబు
తప్పినఁ దనమాట ♦ దప్పదెపుడు
తలఁచెనా? రక్షింప ♦ నలశర్వ్వ శరములు
తప్పినఁదనమాట ♦ దప్ప దెపుడు
ఇచ్చెనా? యాశ్రతి ♦ యినునిశాకరగతు
లప్పినఁ దనమాట ♦ దప్ప దెపుడు
వ్రాసెనా? కలముతోఁ ♦ బరమేష్ఠివ్రాతైనఁ
దప్పినఁదనమాట ♦ దప్పదెపుడు
మెచ్చెనా? యేరినైనను ♦ మ్మెటిజన్మ
శతతపఃఫల మీఁడేరె ♦ క్షితినటంచు
బుధులు సతతంబుఁ దనకీర్తి ♦ పొగడ వెలసె
రామకృష్ణుండు సజ్జన ♦ క్షేమకరుఁడు. 69

సీ. ఛాంతశోభానంత ♦ తల్పనిదానమై
పటుతరభూరిస ♦ త్పాత్రమగుచు
రఘుజీయనవవిధ ♦ రత్నాకరఖ్యమై
జనితసౌధపద్రిభా ♦ సహితమగుచు
బంధురమహనీయ ♦ సింధుసంకీర్ణమై
నీలకంఠప్రియ ♦ నిలయమగుచు

సర్వజ్ఞశేఖర ♦ సంభవస్థానమై
భవ్యమహాదేవ ♦ సేవ్య మగుచు
మహితబుధతరులకుఁదల్లి ♦ గృహమనంగఁ
దనరుటను నిజమందిరా ♦ స్థానసీమ
పూతలక్ష్మీజననవాస ♦ భూమియనుచుఁ
గెరలి యిరవొందఁ శ్రీరామ ♦ కృష్ణుఁడలరు.

సీ. సంతతశ్రీవిలా ♦ సప్రౌఢరీతిచే
బ్రహ్మచ్యుతులకన్న ♦ భవ్యుఁడనఁగఁ
బ్రత్యర్థిదానసం ♦ భావ్యలీలారతిఁ
గర్ణార్జునులకన్న ♦ ఘనుఁడనంగ
నతులితగుణధర్మ ♦ చతురతాకృతిఁబాండు
తనయరాములుకన్న ♦ ధన్యుఁడనఁగఁ
బుణ్యసత్యాశ్రియ ♦ భూతిహరిశ్చంద్ర
చంద్రజూటులకన్న ♦ సభ్యుఁ డనఁగ
మహితదిగధీశసత్సభా ♦ మంటపములఁ
బండితాఖండలులచేతఁ ♦ బ్రత్యహంబుఁ
బొగడఁబడుచుండ వెలసె సం ♦ పూర్ణకీర్తి
యార్యనుతచర్యరామకృ ♦ ష్ణార్యవరుఁడు. 71

ఉ. * అర్థుల నెల్ల బంధుతులి ♦ తాత్ములఁ గాఁగను బుజ్జగించు వి
ద్యార్థులఁబుత్త్రితుల్యులుగ ♦ నాత్మ గణించెడు నెల్లవేళన
న్యార్థుల నాత్మభావమున ♦ నాదరణం బొనరించు నెల్లకా
ర్యార్థుల రామకృష్ణుఁడుకృ ♦ తార్థులఁజేయుదయాభిరాముఁడై.

సీ. సాధుబృందావన ♦ సరణి నొప్పినవాఁడు
గోపాలనప్రౌఢిఁ ♦ గూర్చువాఁడు

గోత్రోద్వహానవృత్తిఁ • గొమరుమీఱినవాఁడు
వంశగానఖ్యాతి • వఱలువాఁడు
నరశతాంగాకల్ప • గరిమఁ గూర్చినవాఁడు
సత్యభామాప్రీతి • సలుపువాఁడు
నవయశోదానంద • నందనుం డగువాఁడు
ఘోరాఘసంహార • చారుకీర్తి
గానసీరామకృష్ణాఖ్య • గణుతి కెక్కె
ననుచుఁబండితజనములు • వినుతిసేయ
వెలసెఁబైఁడాన్వవాయాచ్ఛ • జలజహేళి
రామకృష్ణుండు పండిత • రజకుండు. 73

శా. సాక్షాదీశమహోత్సవంబుఁగనఁగా • సంప్రీతి రండో సహ
స్రాక్షాగారనౌకసులార ! యనుచు • న్సానందమై పిల్వఁగాఁ
దాక్షోణీసతి మీఁది కెత్తినభుజా • స్తంభంబులో నాధర
దాక్షారామముఖాలయంబులధ్వజ • స్తంభంబులొప్పారెడిన్. 74

సీ. వనములఁ జారుజీ • వనములు నాటించి
సరసులు మేలన • సరసులనిడి
కృతులు నెమ్మదిమెచ్చఁ • గృతుల రచింపించి
దేవాళి యలరం • గ దేవళమిడి
బ్రహ్మప్రతిష్ఠయు • బ్రహ్మళిగనఁ జేసి
నిక్షేపముల భూమి • కుక్షి నునిచి
సంతానముల మించు • సంతానములఁగాంచి
సత్త్రువులఁబెట్టి • సత్త్రులకు
వెలసె శిబికర్ణమాంధాతృ • బలిదధీచి
కల్పవృక్షచింతామణి • కామధేను

విపులవితరణసంపద్వి • వృద్ధికరుఁడు
రామకృష్ణుండు బుధరాజి • రక్షకుండు. 75

సీ. పద్మాక్షతల్పిత • పాథోధియును బోలె
క్షీరపరిభాసద • క్షీణమగుచు
నాదినారాయణు • నవతారవిభవమున
మత్స్యకచ్ఛపతను • మహిత మగుచు
ఫణరాజరాజిత • ఫణిరాజమును బోలె
ధారితకువలయో • ద్దామమగుచు
రాజీవకరహస్త • రాజీవమును బోలె
రాజీవశోభావి • రాజమగుచుఁ
గాకినాడాగ్రిహాల్గ్రి • ఘటితభవ్య
పటుశిలామయసోపాన • ఘటితదివ్య
సారకాసారవర మెన్న • సాధ్య మగునె
చూడ నలెఁ గాని యందలి • చోద్యములను. 76

సీ. చిత్రచిత్రము లైన • చిత్రము లివ్వలసిల్లుఁ
బలఁడికుండలచాయ • పరిఢవిల్లుఁ
దార్యత్రికములసం • తానంబు శోభిల్లు
స్వస్తివాచకతతి • సందడిల్లుఁ
బక్షోత్సవపురం • పరులును వర్తిల్లు
నిత్యోత్సవంబులు • నివ్వటిల్లు
నందదీపంబుల • బృందముల్ రంజిల్లు
భూరిఘంటాధ్వని • పూరటిల్లు
ననవి యే దీనిమహాత్మ్య • మెలమిఁబొగడ
ననుచు సురలును బంటితు • లభినుతింప

లీలఁ గట్టించె భువి భైర ♦ వాలయంబు
నార్యనుతుఁడైన రామకృ ♦ ష్ణార్యవరుఁడు. 77

శా. శంభుం డాశ్రితకోటి కిచ్చెద సదై ♦ శ్వర్యంబు రండంచు ని
ర్దంభప్రౌఢిమ మీఁది కెత్తినభుజా ♦ స్తంభంబు లో నా ధ్వజ
స్తంభంబు ల్దనరారె మహాళివిలస ♦ త్సౌవర్ణ సద్ఘంటికా
శుంభద్రావకజాలవాక్యతతిచే ♦ సొంపొందుచున్నిత్యమున్. 78

సీ. ఘనభూరిపద్మము ♦ ల్కలహంసలసుగాంచి
నరులుమానససరో ♦ వరమనంగ
రాజీవముల ప్రల్ల ♦ రాజీవములఁగాంచి
గురులు పంపాసరో ♦ వర మనంగ
నిర్మలమనుసుధా ♦ నీరపూరముఁ గాంచి
సురవరుల్ క్షీరసా ♦ గర మనంగ
స్నానపానాగత ♦ సాధుబుధులఁ గాంచి
సారగంగాపయః ♦ పూర మనఁగ
సూర్యరాయపురీస్థసం ♦ స్తూయమాన
రామలింగేశ్వరాగ్రహా ♦ రంబునందు
రామకృష్ణుండు నిర్మింప ♦ రమ్యమైన
హ్రదముఁ బొగడంగ సురలకు ♦ నలవియగునె. 79

సీ. అసురబాధకుఁడాఁగి యుణఁగునచ్చరలనఁ
బొలుపాఱుగుడిమీఁది ♦ బొమ్మలమర
విబుధసాలంబుతో ♦ వియ్యమందఁగఁబోవు
చున్న దోయనసాల ♦ మొఱపుమిగుల
జనకునిదర్శనం ♦ బును గోరి నిలుచువే
తాళుఁడో యన ధ్వజ ♦ స్తంభమమర.

దివిజు లంపినభవ్య ♦ దివ్యాన్న మొసఁగఁ
బ్రీణుతనై వేద్యసం ♦ పద చెలంగ
నన్నయనుమతి హృదయపరి ♦ సన్నగరిమ
సేనపలిలంకలోఁ బ్రతి ♦ ష్ఠించినట్టి
యచ్యుతసనాథచోడేశ్వ ♦ రాలయంబు
కెరలు శ్రీరామకృష్ణుని ♦ కీర్తిపోలె. 80

సీ. నాథుఁడై సద్గుణ ♦ నాథుఁడై కరుణాస
నాథుఁడై మించిన ♦ సాధువెవఁడు
కర్తయైనుతకళా ♦ ధర్తయై సాహసం
హర్తయై జగముల ♦ నలరె నెవఁడు
నేతయై భువనని ♦ ర్మాతయైకుశల సం
ధాతయై ధరణిలోఁ ♦ దనరెనెవఁడు
మిత్త్రుఁడై వరసతీ ♦ పుత్త్రుఁడై పరమ ప
విత్త్రుఁడై పుడమిని ♦ వెలసెఁ నెవడు
అట్టివిఘ్నేశ్వరునకు ధి ♦ వ్యాలయంబుఁ
గాకినాడపురంబున ♦ లోకమెన్న
శాశ్వతముగాఁగఁ గట్టించె ♦ సాంద్రకీర్తి
రామకృష్ణుండు శివభక్త ♦ రంజకుండు. 81

ఉ. గుంభితదుస్తమోజనిత ♦ కోపముతోడను రాజువిూఁది కు
త్తంభితశక్తితోడ జను ♦ తక్షకవాసుకిముఖ్యులో యనన్
జృంభదనేకదేవగృహ ♦ సీమలయందతఁడుంచు సద్ధ్వజ
స్తంభములొప్పెఁదద్విపుల ♦ శాశ్వతకీర్తులమూర్తులో యనన్. 82

సీ. శరహంసముల హంస ♦ శరశోభనిరసించి
వరహీరముల హీర ♦ వరమునొలసి

ధరమహేశ హేశ ♦ ధరములనిర్జించి
చంద్రికాలఁ దార ♦ చంద్రిమొలసి
హరిరాజమునురాజ ♦ హరినిధిక్కృతిసేసి
రస సుధారసధార ♦ రసముగ్రోలి
కల్పకంబులఁ గంబు ♦ కల్పకంబులమీఱి
పరకుందములఁ గుంద ♦ పరులఁగేరి
వెలసె నెవ్వనిసత్కీర్తి ♦ విశదమూర్తి
యతనిసద్గుణములఁ జెప్ప ♦ నలవియగునె
ధాతకైనను గింమక ♦ నేత కయిన
ననఁగ విలసిల్లె రామకృ ♦ ష్ణార్యవరుఁడు. 83

సీ. ఏసూరి సరసాళి ♦ యింపొంద బంతుల
పాలకు నాలుగు ♦ వేలొసంగె
నేనేత బాలుర ♦ కింగ్లీషుబోధించు
కాలీజికెన్మిది ♦ వేలొసంగె
నేదాత ద్విజవరు ♦ లెన్నంగనన్నస
త్రాళికి నిర్వది ♦ వేలొసంగె
నేమేటి ముదముతో ♦ సిల ననాథవివా
హాళికి నల్వది ♦ వేలొసంగె
నట్టిసుజనైకలోకవి ♦ ఖ్యాతయశుఁడు
ధైర్యగాంభీర్యసద్గుణై ♦ శ్వర్యయుతుఁడు
సాధుసజ్జనపోషణాం ♦ చన్మనస్కుఁ
డర్యమాతుంగుఁడె రామకృ ♦ ష్ణార్యవరుఁడు. 84

క. ఆరామకృష్ణయార్యుఁడు
శ్రీరాముఁడు సీతనట్లు ♦ చెలిమి వరించెన్

శ్రీరామ వేంకమాంబను
దారాపతిపదన సుమని ♦ తాతిలకంబుఁగా. 85

సీ. వాణితో లలితశ ♦ ర్వాణితో హరిశుక
వాణితో చ్యవనాళి ♦ వేణితోడ
సీతతో దేవేంద్రు ♦ మాతతోఁ గోసల
జాతతో నీలసం ♦ భూతతోడ
శాంతతో విలసితా ♦ నంతతోఁ గుంభజ
కాంతతో శశికుంద ♦ దంతతోడ
ఛాయతో రుచిరాన ♦ సూయతో మన్మథ
జాయతో నలహేమ ♦ కాయతోడ
సాటి యీబోఁటి యని బుధ ♦ కోటి వొగడ
సత్యశౌచపతివ్రతా ♦ కృత్యసంత
తాన్నదానమృదూక్తిప్ర ♦ సన్నభావ
విమలసద్గుణనికురుంబ ♦ వేంకమాంబ 86

సీ. రాజ్యహీనతఁ జెంది ♦ రాజిల్లువనరాజి
లోన నుండనినాఁటి ♦ లోకమాత
మానితమాతంగ ♦ మానినీజననంబు
గాంచకుండిననాఁటి ♦ గౌరిదేవి
ప్రాభవంబుఁ దొలంగి ♦ భర్తృవిక్రీతయై
చనకయుండిననాఁటి ♦ చంద్రమతియుఁ
బెంపు సొంపున బాసి ♦ తెంపునారణ్య
భూమిఁ జెందనినాఁటి ♦ భీమతనయ
యహహ యీభామ యని మహా ♦ మహులువొగడ
నిత్యసత్యపతివ్రత ♦ నిర్మలాత్మ

కవులకును బుధులకును నెన్నఁ • గల్పవల్లి
విబుధవినుతగుణాలంబ • వేంకటమాంబ 87

శా. ఆబ్బాలామణియందుఁ బుత్త్రులను దా • నారామకృష్ణుండు మె
నబ్బంగాంచెను బ్రహ్మవిష్ణుశివమూ • ర్త్యోదారుల న్ధీరులన్
మబ్బువ్వార్ధిప్లుకోదువంగిసువురో • మాన్యైకసద్భోగులన్
సుబ్బారాయని వేంకటాచలపతి • న్సుశ్లోకు జల్మయ్యనున్ 88

క. అందగ్రజుండు వెలసెను
నందునినవదనునిభంగి • నవరసకమలా
నందదుఁడు బానభాస్కర
నందనుఁ డన వెలయుచుండు • నవ్యప్రభలన్

సీ. కడునివిఁగాంక్షించి • కాసినుఁడందుమా
కవచకుండలములు • గాన రావు
కనకాంబరముఁ గాంచి • కంజాక్షుఁడందుమా
శంఖచక్రంబుల • జాడలేదు
ప్రాభవంబున బుధ • సాంబుం డందుమా
వేయుఁగన్నులరీతి • వెలయలేదు
సర్వజ్ఞతఁ జూచి • శంకరుం డందుమా
శిరమున నెలవంక • చెలఁగ లేదు
కాముఁడందుమ సౌందర్య • గరిమఁజూచి
చెఱుకువిల్లును మఱి మీను • సిడములేదు
అనుచు విబుధులు వర్ణింప • ననుదినంబు
రంజిలుచునుండె శ్రీసుబ్బ • రాయఘనుఁడు. 90

గీ. వాణి యనఁగను లలితశ • ర్వాణి యనఁగ
రతి యనంగను శ్రీరామ • సతి యనంగ

క్షోణియనఁగను విసుతగీ • శ్వాణి యనఁగ
నలరు శేషమాంబను బెండ్లి • యాడె నతఁడు. 91

సీ. చంచలత్వము మాని • సంచరించెడులక్ష్మి
బహుళభాషిణిగాక • భ్రిజలుభాష
సామ్రాజ్యహీనతఁ • జనకన్నసావిత్రి
ఘనపాంసులాకారఁ • గానివసుధ
న్యూనవంశోద్భవ • గానియరుంధతి
యర్ధాంగియునుగాని • యన్నపూర్ణ
దనుజపుత్త్రిక గాక • దనరుశచీదేవి
యినునకు నెగ్గుచే • యనిసుకన్య

యనఁగ రంజిల్లె ధీరయు • నదిమితోక్తి
సతతసంపత్తి ఘనపుణ్య • కృతిసుపశ్య
రమ్యతరగాత్రి సత్పుత్త్రి • రమణరక్తి
శిష్టసద్గుణనికురంబ • శేషమాంబ. 92

గీ. రామకృష్ణార్యవర్యుని • ప్రేమసీమ
వేంకమాంబాసతీగర్భ • వీచి హైమ
రోచి రెండవసుతుఁడు సు • రూపమదను
డనఁగ వేంకటాచలపతి • యవని వెలసె. 93

సీ. విబుధసంప్రార్థనా • విహితావతారుండు
నధికవిశ్వామిత్ర • యాచకుండు
అఘతాటకాగ్రహ • హారణప్రభావుండు
శివధర్మదానపం • క్తిష్టలక్ష్మి
స్వగురూపదిష్టోరు • సవసనన్మార్గుండు
ఖరదూషణక్షపా • చరవిరోధి

భూసురోత్తముజూతి ♦ భూరిసంపద్వ్రాత
యాంతతసయవార్ధి ♦ సేతుకర్త
మూర్ఖదుర్జనఖలసం క్తి ♦ సుఖవిదారి
గౌరవామితసామ్రాజ్య ♦ గరిమఁ గనుట
సతని శ్రీరామచంద్రు ప్రసం ♦ చెప్పఁదగదె
సరసగుణసాంద్రు వేంకటాచలపతీంద్రు. 94

క. శ్రీభామకృష్ణునకు నా ♦ ర్యారమణిం
బోలు వేంక ♦ మాంబాసతికిన్
గూరిమి మీాఱఁగబొడమును ♦ ధీరుఁడు
చలమయ్య యను తృ ♦ తీయసుతుఁడిలన్.

ఉ. ఆచలమయ్య ధీరతహి ♦ మాచల మయ్యమరాచలంబు స
ద్యాచకదేవతాళికి మ ♦ హావిబుధాన్నవితీర్ణతాసుధా
సేచనమూర్తి భూతిశశి ♦ శేఖరమూర్తిసమస్తదానవి
ద్యాచరణమూర్తిదీనజన ♦ తాపగతార్తి సుకీర్తిమెన్నఁగన్.96

ఉ. శాంతియుదాంతియున్ సుగుణ ♦ సంపదయున్ స్వరధర్మశీలమున్
శాంతమనోజ్ఞభాషలును ♦ సన్నుతదానదయాంభిలాషయున్
సంతత దీనరక్షయును ♦ సర్వకళాఘస్యాతోడగోష్ఠి యా
శాంతవిహారకీర్తులును ♦ నాచలమయ్యకుఁ దవ్వఁగల్గునే. 97

శా. శ్రీగోపాలబాలకృష్ణశుభప ♦ త్త్రేవాసవాసందను
శ్రీగోపాలకదాసముఖ్యులకు భా ♦ సిల్లంగ సద్భావభుల్
శ్రీగోపాలకబాలకార్పితము గాఁ ♦ జేయించి యర్పించె నా
శ్రీగోష్ఠానములెల్లనిండ యశముల్ ♦ శ్రీదల్కరయార్యుండిలన్.98

సీ. చలికాలమందున ♦ బలితంపుదుప్పటు
లోకవిధావళికిచ్చెఁ ♦ గోటికోట్లు

వర్షకాలమునందుఁ • బట్టుబట్టంబుల
విద్వాంసులకిచ్చె • వేనవేలు
ఎండకాలమునందు • దండిపండితులకు
ఛత్రపాదుకలిచ్చె • శతశతములు
సేతుప్రసకుడుగా • సీకిఁబోవువారికిఁ
బాథేయముల నిచ్చె • బహుశతములు
హవ్యకవ్యాది కర్మంబు • లాచరించు
కర్మఠులకెల్ల వెండియుం • గరములిచ్చెఁ
బుణ్యపైడాన్వయాంభోధి • పూర్ణచంద్రుఁ
డైనచలమయ్యఁ బోలువా • రవనిఁ గలరె. 99

సీ. కల్లోలవీచుల • నల్లసిల్లెడుపాల
వెల్లివెల్లువలతోఁ • వియ్యమంది
సాంద్రశరత్కాల • సంపూర్ణపూర్ణిమా
చంద్రచంద్రికలతోఁ • సరసమాడి
సాయన్నపద్మార్గ • జాటజూటవిలుఠ
ద్గాంగభంగములతోఁ • గయ్యమాడి
హారహీరపటీర • తారతారావళి
కాంతులతోఁ బ్రసం • గంబు సేసి
నల్లగిత్తపల్లవల్లీమ • తల్లిగా
నల్లసల్లసల్లసం • బాడియాడి
కొంచగుబ్బలియంచలఁ • గూడికూడి
చలమయార్యుని సత్కీర్తి • జగమునిండె 100

ఆ. వె. అతఁడు సిరులచేత • నవనీతమునందు
నెజలుటింగవల్లు • వారికన్య

సుగుణాధన్య నిశ్చల • సుందరీజనమాన్య
శేషమాంబఁ బెండ్లి • చేసికొనియె. 101

సీ. శారద యనుచును • సన్నుతించుచునుండ
భారతి యనఁగను • బ్రిబలరాదె
కమలపాణియటంచు • ఘనులు నుతింపఁగ
శ్రీలక్ష్మియనుమను • జెలఁగరాదె
పరిణ్ణి యటంచు • గురుజను లెన్నఁగ
సర్వమంగళ యంచుఁ • జాటరాదె
శచియించు నిరంతంబు • సాధులు వొగడంగ
గీర్వాణి యనుచును • గెరలరాదె

సీత యనుచును బొగడిక • సేయుచుండఁ
బరమగోత్రోద్భవ యటంచుఁ • బలుకరాదె
వినుతపతిభక్తి దేవతా • విబుధభక్తి
శిష్టవర్ణితగుణాలంబ • శేషమాంబ. 102

—: కృతిపతి :—

చ. లలితవిశాలకీర్తులు సు • లక్షణలక్షితమూర్తులు న్నలా
కలితవిలాసవర్తులును • గౌరవపూర్ణులు నైనవారిలోఁ
పలఁ దగుమధ్యముం డరయఁ • బాండవమధ్యమునట్లు వెంకటా
చలపతివన్నె కెక్కె గిరి • జాపతి మించినభూతిసాంద్రుఁడై. 103

ఉ. సారసబాణసుందరుఁడు • సారసవైరికలాకలాపుఁడున్
సారసమిత్రతేజుఁడును • సారసనేత్రమాభిరాముఁడున్
సారససారవాఙ్నతుఁడు • సారసమూతిలసచ్చిరాయుఁడున్
ధీరుఁడు వేంకటాచలప • తిప్రతిభాన్వితుఁడొందుఁగల్గునే. 104

సీ.* ఏపట్టి రామకృ ♦ ష్ణేంద్రలక్ష్మీమహా
క్షీరాబ్ధికల్పన ♦ కారణంబు
ఏసూరి పైడిపా ♦ టీంద్రాన్వవాయసం
తానంబునకునుసం ♦ తానమాళి
ఏమేటి నిజజన ♦ కేందిరాసుందరీ
పౌనర్భవమునకుఁ ♦ బ్రథమమూర్తి
ఏవాఁడు యంత్రిగో ♦ దావరీజలయుక్తిఁ
గాకినాడకు నవ్య ♦ గౌతముండు

ధర్మనిర్మథనప్రదో ♦ దాత్తపటిల
చిత్తవృత్తిమహోద్యోగ ♦ శిక్షకుండు
ఎవ్వఁడట్టిజగద్గేయు ♦ నెన్నఁ దరమె
వేంకటాచలపతిచంద్రు ♦ విభవసాంద్రు.

సీ. ప్రబలనత్తమతమః ♦ పాటనపాండిత్య
మొనయు నీతనిసుద ♦ ర్శనవిభూతి
క్షమఁ బుణ్యజనవర్థ ♦ నము సేయు నీతని
స్తవనీయసద్గుణ ♦ ధర్మపటిమ
ప్రత్యర్థిహానవ ♦ స్వస్తిసితిప్రదలీల
నలరారు నీతని ♦ యాదరంబు
నిరుపమమదధరా ♦ సురదానగరిమంబుఁ
జెందు నీతనిమహా ♦ నందకాఖ్య

విశ్వవిఖ్యాతిసంపత్తి ♦ విబుధతతికి
విపులసౌఖ్యంబు లిడుఁగదా విక్రమంబు
లగుట నిజనామ మన్వర్థ ♦ మయ్యెననఁగ
వేంకటాచలపతియర్య ♦ విభుఁడు వెలయు.

సీ. కల్పకంబును మ్రాను • గాఁజేసినకొఱంత
చింతామణిని ఱాయిఁ జేయుఱవ్వ
సౌరభేయిని బశు • జాతిఁజేసినరట్టు
బలిని రక్కసుఁజేసి • నిలుపు వెలితి
తరణిజుఁగౌరవ • దాసుఁ జేసినతప్పు
శ్రీదుఁ బింగాక్షుఁగాఁ • జేయుకోఁత
కమలవైరిని క్షీణ • గాత్రుఁజేసినసేగి
శిబిని మాంసదుఁ గాఁగఁ • జేసినసడి

మలపుకొనఁ జూచి కాఁబోలు • జలజభవుఁడు
తనర నీదాతను సృజించె • ననుచు బుధులు
వినుతిసేయంగ దినదిన • వృద్ధినొందె
వేంకటాచలపతి బుధ వినుతకీర్తి. 107

సీ. శ్రితచాతకావళి • గతతృష్ణ లనుదీఱె
దారిద్ర్యవనవహ్ని • తాప మాఱె
సాధుసస్యాభోగ • సంపద లలరారె
నిఖిలార్థిసరసులు • నిండిపాఱె
సుజనమయూరము • ల్సొంపుపెంపున దారెఁ
బటుమహత్తరులసం • పదలుమీఱె
నార్యవాణీప్రవా • హంబులు నొప్పారె
సాధ్వీమహీస్థలి • చల్లఁబాఱె

ఖలజనాననపద్మశ్రీ • భలును జాఱె
దుర్జనమరాళసంతతు • ల్దొలఁగిపాఱె
సకలజాతులు జాతుల • సౌరు గేరె
వేంకటాచలపతి దాన వృష్టివేళ. 108

సీ. బుధగురుండనఁ దగు ♦ బులుసుపర్వికాశవే
దార్థికి నూటప ♦ దార్ల నొసఁగె
బుల్లెశ్రీదక్షిణా ♦ మూర్త్యాదిసత్పండి
తాళికి నూటప ♦ దార్ల నొసఁగె
నలపరవస్తురం ♦ గాచార్యవిజ్ఞాన
సూరికి నూటప ♦ దారు లొసఁగె
శతఘంటకవితావి ♦ శారదశారదా
దరులకు నూటప ♦ దార్ల నొసఁగె
వేదవేదాంగపాఠక ♦ వేత్తలైన
పండితాళికిఁ గుండల ♦ ప్రకర మొసఁగె
సరసహృదయుండు వేంకటా ♦చలపతీంద్రుఁ
డతనియౌదార్య మెన్నంగ ♦ నలవియగునె. 109

సీ. శ్రీజగద్గురువర ♦ శ్రీపాదపద్మముల్
శతసువర్ణసుమపూ ♦ జలను నలిపె
నవరపతంజలి ♦ యౌా భాగవతిహరి
శాస్త్రికి నూటనిష్కములు నొసఁగె
వ్యాకరణాచార్య వర్యసుబ్రహ్మణ్య
శాస్త్రికి నూటని ♦ ష్కములనిడియె
సర్వతంత్రార్థవి ♦ శారదశ్రీరామ
శాస్త్రికి నూటని ష్కముల నిచ్చెఁ
బూజ్యమతిహనుమచ్ఛాస్త్రి ♦ మొదలుగాఁగఁ
బండితవరేణ్యులకుశత ♦ ప్రతతులొసఁగె
నార్యపైడాన్వయుని వేంక ♦ టాచలపతి
వైశ్యభోజుఁడటంచుఁ జె ♦ ప్పంగఁదగదే. 110

సీ. శారదశారద ♦ శారదాలలితంబు
శరహంసశరహంస ♦ సన్నుతంబు
వరహీరవరహీర ♦ వరహీరకలితంబు
చంద్రాంశుచంద్రాంశు ♦ చర్చితంబు
తారాళితారాళి ♦ తారాళిఘనశోభితంబు
సురసింధుసురసింధు ♦ శోభితంబు
శరజాతశరజాత ♦ శరజాతవినుతంబు
గోజాతగోజాత ♦ గోపితంబు
సకలదిగ్వనితాస్యన ♦ చర్చితంబు
విశ్వవిశ్వంభరాధార ♦ విశ్రుతంబు
పూర్ణపండితకవిరాజ ♦ వర్ణితంబు
భవ్యమగువేంకటాచల ♦ పతియశంబు. 111

క. ఆవేంకటాచలపతియు
భూవలయంబున నైశ్వ ♦ పుంగవకోటిన్
శ్రీవిలసిలువార నిభు
ధావళి వర్ణించునవ్వ ♦ యంపుంగనర్యన్. 112

ఉ. మన్యము పెవ్వవంశబుధ ♦ మాన్యమహోన్నతదుగ్ధవార్ధిరా
ట్కన్యను భూతినీలనగ ♦ కన్యను సుందరరూపభీమరా
ట్కన్యను సద్గుణాళిమహి ♦ కన్యను భాగ్యసమృద్ధిభీష్మరా
ట్కన్యను సత్యమాంబ యను♦కన్యను బెండిలియాడె వేడ్కలోన్

క. ఆసత్యమాంబ క్షమమున
భూసతి సంపత్సమృద్ధి ♦ బుణ్యసమృద్ధిన్
శ్రీసతి పాతివ్రత్య
శ్రీసతి యని బుధులు మెచ్చ ♦ జెలంగెధరిత్రిన్. 114

సీ. అలసురాధిపుతల్లి ♦ యై కాంలకుండిన
దేవతామాత తా ♦ దీటువచ్చు
నిరతరజోవృత్తి ♦ నెగడక యుండిన
సర్వంసహాదేవి ♦ సవతు వచ్చుఁ
జంచల యై ధాత్రి ♦ మించక యుండిన
శ్రీలక్ష్మి నుద్దిగాఁ ♦ జెప్ప వచ్చు
నలుఘరినోళ్ళలో ♦ మెలఁగక యుండిన
భారతి సాటిగాఁ ♦ బలుకవచ్చుఁ

జండికాదేవియనుపేర ♦ జరుగకున్న
సర్వమంగళ సరి యంచుఁ ♦ జాట వచ్చు
భవ్యసౌభాగ్యదివ్యసం ♦ సత్ప్రవృత్తి
నన్నుతిలమిన్న యైనస ♦ త్యాంబతోడ. 115

సీ. రామకృష్ణునిగన్న ♦ రమణియై యుండంగ
దేవకియనుచుఁగీ ♦ ర్తింపవలదె
నారాయణునిగన్న ♦ నారియై యుండంగ
నదితిమహాదేవి ♦ యనఁగరాదె
వేంకటేశ్వరుఁగన్న ♦ వెలఁదియైయుండంగ
నలవికుంఠ యనంగ ♦ వెలితియేమి
సత్యనారాయణ ♦ స్వామిని గాంచంగ
దేవమాతయనంగ ♦ నేవ యేమి

రామకృష్ణుని గన్నట్టి ♦ రమణి గాఁగ
దన్ను వసుదేవురాణిఁగా ♦ దలఁచు టరుదె
యనుచుఁ గోవిదు లెన్నంగ ♦ నవనివెలసె
సద్గుణగణావలంబ యీా ♦ సత్యమాంబ. 116

గీ. తరుణిసత్యాంబ గురునిల్లు ♦ వరునియిల్లు
నలరఁ జేసెను సుగుణిఁటి ♦ కతికశనత
ధనునియింటికిఁ బసుపా ♦ తంబుఁగూర్చి
వలలు చుండినదివ్యభ ♦ వానిఁదెగడి. 117

సీ. సత్యాంబయందు వి ♦ శ్వజనీనకీర్తియౌ
వేంకటాచలపతి ♦ వితరణఖని
రామకృష్ణాంశల ♦ రహిఁ జెలంగెడువాని
రామకృష్ణాఖ్యునిఁ ♦ బ్రేమసుతుని
నారాయణునివిత్త ♦ సారాయను ద్వితీయు
వేంకటేశ్వరుసత్త్వ ♦ వేంకటేశు
సత్యవాక్యనిదాను ♦ సత్యనారాయణు
రామకృష్ణసమాను ♦ రామకృష్ణు
రమణి వేంకటరత్నాంబ ♦ రత్నమాంబ
సబలమాణిక్యమాంబ సీ ♦ తాంబలక్ష్మ
మాంబ యనియెడుసంతతి ♦ నమరఁగాంచె
కలశవార్ధి యబ్జాదులఁ ♦ గన్నయట్లు. 118

సీ. భావింప దేవకీ ♦ దేవిముందఱఁజేరి
కేళిసల్పెడురామ ♦ కృష్ణులనఁగ
శ్రీరుక్మిణీదేవి ♦ చెంగట వసియించు
ప్రద్యుమ్నముఖసుత ♦ ప్రకరమనఁగఁ
గౌసల్యముందట ♦ ఘనలాస్య మొనరించు
రామాదిపుత్త్రవ ♦ ర్గం బనంగఁ
గుంతిదంతిగమన ♦ చెంత మెలంగెడు
ధర్మరాజాదిపు ♦ త్త్రికులసంగఁ

బరమపితృభక్తి గురువర • భక్తి దేవ
భక్తి బాంధవమిత్రాను • రక్తి లలిత
సూక్తి సద్గుణపుంజసం • యుక్తిఁ గలిగి
వెలసెను గుమారవర్గంబు • విశ్రుతంబు. 119

శా. పాథోరాశితటస్థనీలనగశుం • భత్పుణ్యపూర్ణీమహా
సౌధోగ్రోరువిహారరీతికలనా • శాంతాత్ముఁడౌ శ్రీజగ
న్నాథస్వామికి నిత్యభోగమును నా • నందాప్తిఁ జేయించునా
శ్రీధన్యుండగు వేంకటాచలపతి • శ్రీ నెన్నఁగా శక్యమే. 120

మ. కరుణాసాంద్రవిచారధీరజనవి • క్యాతోరుసన్మల్లికా
శరడిండీరపటీరనారదయశ • స్సత్పీఠికాసీతికా
పురసామ్రాజ్యరమావిహారకలనా • పూజ్యాంఘ్రి శ్రీశక్కటే
శ్వరదైనందినపూజలన్నొరపునై • శ్వర్యంబడెం దున్నడే. 121

సీ. ఎంతపర్యంతమ • భ్రాంతశుభ్రాంతవి
భ్రాంతులై యలపుష్ప • వంతు లుంద్రు
ఎంతపర్యంతమ • త్యంతశాంతతఁ గకు
బంతదంతావళ • కాంతులుంద్రు
ఎంతపర్యంతమ • నంతపథాంతరా
క్రాంతులై నిశకాంత • కాంతులుంద్రు
ఎంతపర్యంతమ • నతాంతరాశాక్రాంత
కంచుకికాతుండు • గంతు లిడెడు

నంతపర్యంతమును గీర్తి • మంతుఁడగుచుఁ
బుత్త్రపౌత్త్రయురారోగ్య • భూతిమతులఁ
రామకృష్ణార్యపర్యని • ప్రేమసుతుఁడు
వేంకటాచలపతి ధాత్రి • వెలయుఁగాత. 122

క. ఏతాదృశపూతాతి
ఖ్యాతామలసుగుణమణికి • ఘనతరఘృణికిన్
సీతాపతి పదసేవా
చేతోగ్రామణికి వైశ్య • చింతామణికిన్. 123

క. పారావారాధిగం భీరునకున్
దురితజాల • భీరునకు మహో
దారునకు సర్వసుజనా
ధారునకున్ రామకృష్ణ • తనయాగ్రణికిన్. 124

క. శ్రీచతురమతికి బహువి
ద్యాచర్యాసారరతికి • యాచకభృతికిన్
బ్రాచుర్యకృతికి ధైర్యజి
తాచలవరపతికి వేంక • టాచలపతికిన్. 125

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన ప్రభావతీ
పరిణయంబును శృంగారరసప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టి
దనిన :— 126

—: *కథాప్రారంభము* :—

శా*. శ్రీరమ్యం బగునైమిశం బున జగ • జ్జేగీయ మానక్రియా
గారంభం బొనరించి శౌనకముఖా • ద్యంతర్ముఖుస్సర్వవి
ద్యారామాస్యపునీతు సూతుఁగని ప్రాం • చద్భక్తిసంజాతులై
ధారాళంబుగ నిట్లు వల్కిరిసుధా • ధారానుకారోక్తులన్. 127

సీ*. తెలిపితివి మాకు యదుకుల • తిలకుఁడైన
కృష్ణువిష్ణుమహాద్భుతచరిత్ర • కృపదలిర్ప
వింటిమదిమె మెల్ల వీనుల • విందొనర్చె
నింకఁ బ్రద్యుమ్న కథఁ జెప్ప • వేమహాత్మ. 128

మ॥ సురవిద్యాధరసిద్ధసాధ్యమునిసం ♦ క్షోభకక్రియాభీకరా
సురరాజేంద్రుఁడువజ్రవాహుఁడుమహా♦చోద్యంబుపద్యుమ్నుఁడా
సరపంచాస్త్రుఁడు వానినేపగదిఁగూ ♦ ల్పంజాలెఁదత్పుత్రినే
కరణిం బెండిలియాడెఁదెల్పఁగదెవా ♦ క్ప్రాగల్భ్యమేపారఁగన్.

క॥ అని యాదరమతి నడిగిన
వినియాతఁడు దెల్పఁ బట్టె ♦ విధ మంతయునీ
కనుమోదంబునఁ దెలిపెద
ననుచుఁబరీక్షిన్నరేంద్ర ♦ నకు శుకుఁడనియెన్. 130

—: *పురవర్ణనము* :—

సీ. గురునిత్యకళ్యాణ ♦ ధరచారుభవనంబు
వరసుమనోబృంద ♦ వందితంబు
గురుబుధకవిరాజ ♦ నిరతనివాసంబు
సారామృతాశయ ♦ సన్నుతంబు
నధికరంభాదగో ♦ జావాసలలితంబు
సింధుజాతమహాశ్వ ♦ బంధురంబు
సర్వజ్ఞశేఖరాం ♦ చద్భాసమానంబు
గజరాజశతకోటి ♦ విజయదంబు
నగుచు వెలసెను సురపురి ♦ ననుకరించి
యధికశాలాశిఖాగ్రియుం ♦ త్రివతరణ
గగనగంగాపయఃపూర్ణ ♦ కలితఖేయ
నిరతభరితంబుద్వారకా ♦ పురవరంబు. 131

ఉ. సాలమనంతరత్నపద ♦ సంగతిఁగాంచెనటంచు ఖేచరుల్
జాలి యనంతరత్నపద ♦ సంగతిఁ గాంచెను దానిఁ జూచి వే
శాలలనంతరత్నపద ♦ సంగతిఁగాంచె వివేకశాలికిన్
మేలగువారిశోధుశ స ♦ మేలముఁగోరుట యుక్తమేకదా. 132

మ. సుమనశ్శేఖరులున్ సుపర్వులనఘుల్ • సుజ్ఞానగీర్వాణులున్
సములున్ గోవరులుం బుధుల్ తతముఖుల్ సర్వజ్ఞులు న్పక్పతుల్
విమలాకారులు భాస్వరుల్ వసుఘనుల్ • విద్యాధరుల్ పూజ్యులు
త్తములై యెప్పుడురప్పురంబునబుధో • త్తంసంబులౌ భూసురుల్.

ఉ. రాజకుమారులావిభవ • రాజకుమారులు జ్ఞానసత్కళా
రాజకుమారులర్థనిధి • రాజకుమారులు శౌర్యపార్వతీ
రాజకుమారు లర్థిరుచి • రాజకుమారులు రూపభార్గవీ
రాజకుమారు లాస్యజల • రాజకుమారులు పొల్తురప్పురిన్.

మ. ధనఘుల్ పుణ్యజనేశ్వరుల్ నిధివరుల్ • ధర్మజ్ఞ వర్యుల్మహా
జనధర్మల్మతి యక్షశిక్షకపరుల్ • సర్వజ్ఞమిత్రుల్లస
ద్ధనభర్గుల్ గురుగోధినాథులు మహో • దారుల్పదా శ్రీశప
త్తనవై శ్యేశ్వరు లాకుబేరులనఁజో • ద్యం బేమిధాత్రీస్థలిన్.

క. అద్రులు స్థైర్యంబునబల
భద్రులు హాలశిక్షభూరి • బలసంపద సౌ
భద్రులుభూతిసమున్నతి
రుద్రులుతత్పురమునందు • రూఢిగశూద్రుల్. 136

సీ. ధర్మగుణాక్షేప • తనుగాంచి మించిన
శరవేగ మేపాటి • సాటివచ్చుఁ
బక్షపాతంబునఁ • బైపయిం దిరిగెడు
గరుడివేగం బెంత • పురుడువచ్చు
శాఖశాఖాభంగ • సంచారమునమించు
శ్వసనువేగం బెంత • సవతువచ్చు
నలమహాబిలమున • ననిశంబుఁదిరిగెడు
సర్పివేగం బెంత • సమమువచ్చు

ననఁగ విలసిల్లు రత్నకాం ♦ చనవిరచిత
కింకిణీమాలికానము ♦ ట్టంకితోరు
ఘణఘణారావరణితాది ♦ గ్గణమహీంద్ర
సింధుచయములు తత్పురీ ♦ సైంధవములు. 137

సీ. దానధారావృష్టి ♦ ధరణీతలము నింప
విపులకర్ణఖ్యాతి ♦ వెలయు టరుదె
లలితపద్మ విలాస ♦ కలనఁ దేలుచునుండ
కమలాకరస్ఫూర్తిఁ ♦ గాంచుటరుదె
నారదసముదగ్ర ♦ గౌరవృత్తి చెలంగఁ
బర్వతోన్నతరీతి ♦ పరగు టరుదె
కుంభసంభవరీతి ♦ కొమరారు చుండంగ
ద్విపదవిచ్ఛేదతఁ ♦ దోఁగు టరుదె
యనుచు వర్ణింపఁదగియుండు ♦ నప్పురమునఁ
బుష్కరాపీతమంజుల ♦ పుష్కరాప
గాలసత్పుష్కరాత్మ ♦ సంకలితకర్ష
వారణములై సతత్పురీ ♦ వారణములు.

గీ. హారులువేగతిరస్కృత ♦ హారులుపురిని
వారనంబులునగగర్వ ♦ వారణములు
గోపురములు శిఖోల్లిఖ ♦ ద్గోపురములు
వరణముద్గతతారకా ♦ వరణమచట. 138

సీ. నారికేళులసారు ♦ నారికేళులరీతి
సరసఫలావాప్తి ♦ సంఘటించు
కమలాకరంబులు ♦ కమలాకరములట్లు
పటుపారసములతో ♦ భాలఁ జెలంగు

రాజమార్గంబులు ♦ రాజమార్గంబుల
భంగి సద్రత్నసం ♦ పదలఁ జెలఁగు
వాహినీవరములు ♦ వాహినీవరముల
గతి సింధుకాంచనం ♦ గతిని మించు

గ్రామ లారామమేఖలిత ♦ సీమలఁ గొత్త
సత్కుసుమనఃప్రపూర్తిచే ♦ నెగడు చుండు
నహహ తత్పురివర్ణింప ♦ నలవి యగునె
ధాత కయినను గంధుకి ♦ నేర్పరైన. 140

శా. రంభేస్వాగత మాస్యతాం హరిణి! భ ♦ ద్రింకచ్చిదూర్వ స్త్వహో
శంభోత్తేస్తి? సఖ్యోస్తునే వరతనో! ♦ సౌఖ్యాని కిమ్మంచు వే
సంభాషింతురు సారభాష విలస ♦ త్సౌభాగ్యభూదేవరా
డంభోజాక్షులు దేవభామినులతో ♦ హర్షిన్ బురి న్నిత్యముల్. 141

సీ.* వకుల గన్నేరులకు ♦ బరిమితి దెల్పవే
బారకుఁ గొంచెంబు ♦ పైని బడును
గోరంట కెలదెమ్మంత ♦ కుందరదన యది
రాగానుగతమయి ♦ రమణ గాంచు
దండలదరిఁ జనుఁ ♦ జెండుబఁ జూపవే
యవినీకుఁ గొనఁదోటి ♦ కలవి గావు
బొడ్డుమల్లియ మాటఁ ♦ బోలునే చెలి యది
వరనిధులకుఁగాక ♦ వలనుపడునె

యొనరు నీసుమనం బెందు ♦ నొదవుఁ జెపుమ
యెఱుఁగవా సామి సరసుల ♦ నేపుగాంచు
ననుచు నర్మోక్తు లాడుచు ♦ రనుదినంబు
రసికజనపుష్పలావికా ♦ రమణు లచట 142

సీ. ధరములో నీలాంబ ♦ ధరములో చూడంగఁ
గుచకచరచన లీ ♦ కొమ్మలకును
నదములో నవకోక ♦ నదములో చూడంగ
నాభీకరంబులీ ♦ నారులకును
గంబులో దగుమాని ♦ కంబులో చూడంగఁ
గంఠాధరంబులీ ♦ కామినులకుఁ
గరములో శుభ్రాంశు ♦ కరములో చూడంగ
నూరుహాసంబులీ ♦ యువిదలకును
అనుచు రసికులు వినుతింప ♦ నలరుచుందు
రప్పురంబున సరసవి ♦ హారలలిత
సారసారసమార్గణో ♦ దారశాస్త్రి
వారపారగమతులైన ♦ వారసతులు. 143

సీ. సుందరమందిర ♦ శోభాతిరస్కృత
గోపురం బలద్వార ♦ కాపురంబు
రమణీయధారుణీ ♦ రమణీశిరోమణీ
నూపురం బలద్వార ♦ కాపురంబు
సర్వసంపన్నిధి ♦ గర్వాభిభూతాల
కాపురం బలద్వార ♦ కాపురంబు
కామితార్థప్రద ♦ శ్రీమహాలక్ష్మికిఁ
గాపురం బలద్వార ♦ కాపురంబు
కనకసౌధోల్లిఖితతార ♦ కాపురంబు
భోగభాగ్యవిమోహిత ♦ భూపురంబు
కాంతమణిగణశోభిత ♦ గగనచుంబి
గోపురం బొప్పుఁ దద్ద్వార ♦ కాపురంబు
వ. అప్పురవరాధీశ్వరుండు, 145

సీ. చక్రంబుచే దైత్య ♦ చక్రంబులనుద్రుంచి
విక్రమస్ఫూర్తితో ♦ వెరయువాఁడు
కమలమంజులపాణి ♦ కమలంబు చేకొని
విమలరక్షణవృత్తి ♦ వెలయువాఁడు
వినతనందను నెక్కి ♦ వినతనందనువృత్తి
వినుతి లోకములందు ♦ వెలయువాఁడు
శేషావితల్పవి ♦ శేషాగ్రమున జగ
త్పోషణాంచన్నిద్రఁ ♦ బొందువాఁడు
మహితకాళీయఫణిఫణా ♦ మణిగణోరు
రంగరంగత్ప్రకారత ♦ రంగితాభి
నటనచటులపటుక్రియా ♦ ఘటనశాలి
భక్తజనపాలకుండగు గో ♦ పాలకుండు. 146

సీ. నీలనీలప్రభా ♦ జాలజాలాంబుదా
లోకనవానట ♦ త్కేకిచయము
హీరహీరద్వార ♦ వారవిభాపూర
నీరభ్రమాగత ♦ సారసంబు
కాంతనిశాంతోడు ♦ కాంతకాంతజకాంతి
పాండుపుష్పభ్రమ ♦ భ్రమరకులము
రత్నరత్నాళీచి ♦ రత్నరంజితధామ
ధామబింబాశాప ♦ తచ్ఛకంబు
తప్తకాంచనవేదిని ♦ క్షిప్తగరుడ
మణిఘృణివ్యాజఖాణభ ♦ క్షణవిలోల
బాలపవమానకంఖాణ ♦ భాసురంబు
నగుచు వెలసినభర్మసౌ ♦ ధాగ్రమందు. 147

సీ. సాత్యకిమొదలగు ♦ సహజన్ము లొకవంక
నుద్ధవాక్రూరాదు ♦ లొక్కవంకఁ
బ్రద్యుమ్నసాంబాది ♦ బాలకు లొకవంకఁ
జొక్కుచునందాదు ♦ లొక్కవంకఁ
బ్రబలానిరుద్ధాది ♦ పౌత్త్రు లొకవంక
నురుబలరామాదు ♦ లొక్కవంక
వసుదేవపరికృత ♦ వర్మాదు లొకవంక
నుగ్రసేననృపాలుఁ డొక్కవంక
వందిమాగధు లొకవంక ♦ వారవనజ
వదన లొకవంక సన్మంత్రి ♦ వర్గసేన
భటజనాగ్రణు లొకవంక ♦ బలిమి బలసి
కొలువఁగొలువున్నతజని వై ♦ కుంఠుకడకు. 148

సీ. విశ్వపూజ్యుఁడైన ♦ విబుధాధినాథుండు
లీలముల్లోకంబు ♦ నేలురాజు
అహిబలమదభేది ♦ వైనట్టికాశ్యపి
నెఱిసుధర్మావాప్తి ♦ మెఱయుసుకృతి
వెలుచభూభృత్పక్ష ♦ భేది యానసమాత్రు
సురుచిరంభాభోగి ♦ సోమయాజి
కార్యసంగతి వేయుఁ ♦ గన్నులఁగనువాఁడు
సాంద్రప్రభాశ్రీ మ ♦ హేంద్రమూర్తి
డంబుతోఁ ద్రిదివేశచ ♦ యంబుతో హ
యంబుతో హరిదీశ వ ♦ ర్గంబుతో ర
యంబుతో గురుమునిసమూ ♦ హంబుతోడ
వచ్చె సంభ్రమ మెదమీఱ ♦ వాసవుండు. 149

క. బృందారకపతి యమరులు
గ్రిందుగఁ గొలువంగ ద్వార • కాపురి కరుగన్
నందసుతుం డెదురేఁగియు
మందానందంబుతోడ • మగుడీశ్వరునిన్. 150

క. కొని వచ్చి యుచితరత్నా
సనమునఁ గూర్చుండఁ జేసి • సముచితమర్ఘ్యా
ద నడపి సురపతితో నిట్లనియెన్
యదుపతి వినూత • నామోదముతోన్. 151

చ. కుశలము నీకు శక్రసుర • కోటికి వీటికిఁ గల్పవాటికిన్
కుశలమె తల్లి కర్థిసుర • గోరుహవల్లికి స్త్రీమతల్లికిన్
కుశలమె నీదురాణికిని • కోకిలవాణికిఁ బద్మపాణికిన్
కుశలమె దంతి కుగ్రరద • కుంతికిఁ జక్కదనాలదొంతికిన్. 152

వ. అనిన నప్పురుషోత్తమున కప్పురుహూతుం డిట్లనియె. 153

సీ. నీకరుణాలోక • లోకబాంధవరుచి
వటిలవిపత్తమో • వ్యాప్తిగలదె
నీదయామృతపాద • పాదపప్రభలు గల్గ
దాసచకోరకో • ల్లాస మరుదె
నీకటాక్షవినీల • నీలాభ్రరుచిపర్వ
భక్తకేకిప్రీతి • పరగు టరుదె
నీనామమంత్రవి • జ్ఞానగానము గల్గ
శ్రితజనామోదసం • సిద్ధి యరుదె
నీకృపాదృష్టి మాపైని • నివ్వటిల్లఁ
గుశలమే గాక మఱియొక • దశలుగలవె
యైన నొక్కటి వినిపింతు • నవధరింపు
సరసగుణవర్తి గోపాల • చక్రవర్తి. 154

మ. కలఁడుద్యద్దుస్సహశక్తికిణాంకితభుజా • గర్వాభిభూతోల్లస
ద్బలభిత్పావకభానుసూనుదనుజే • ట్పాసీయసామీరిణ్మహా
బలయక్షేశ్వరశర్వసిద్ధమునిగీ • ర్వాణోరువిద్యాధరా
వలిగంధర్వుఁడు వజ్రినాభుఁడనుక్రి • వ్యాదాధినాథుండిలన్.

వ. మఱియు సరోజాసనవరాతిరేకంబున నపూర్వగీర్వాణుండు దుర్వారాఖర్వగర్వాతిశయుండై సుపర్వావరులం గూడి మదీయంబగు నమరలోకంబున కరుదెంచి రూక్షేక్షణంబుల నన్ను వీక్షించి, కాశ్యపుల మగుమన కిద్దఱకు సామాన్యంబుగ ననుభావ్యం బగునీరాజ్యలక్ష్మి నీవొక్కరుండ వనుభవింప న్యాయంబు గానేరదు; సాపత్నికుల మగుమాకును సమంబుగ సగం బనుభవించుట యుచితంబు. నీ వనుభవించినంతకాలంబు మేమును యథేష్టంబుగ ననుభవించి పిమ్మట నీరాజ్యంబు తుల్యంబుగఁ బంచికొనఁ దలంపుఁగొని యియ్యది నీ కెఱింగింప నియ్యెడ నరుదెంచితి. ధర్మం బారసి న్యాయప్రవర్తనంబున నీమనంబు చొనిపె దేని నివ్వివాదంబు సర్వంబునిర్వర్తించు. అట్లు గాదేని రాజ్యంబు వీరభోజ్యం బనునది నీ యెఱుంగనియది కాదు. అని పలికిన నేనును; సాపత్నికులకేకాదు సోదరులకైనను రాజ్యం బవిభజ్యమానంబు; జ్యేష్ఠానుక్రమపరిపాలనయోగ్యంబు; అకించనులపగిది పంచికొని కుడువందగదు. ఇంతియకాక పైతృకం బగునీరాజ్యంబు పిత్రానుజ్ఞచే నే ననుభవించుచున్నవాఁడను గాని వేఱొండుగాదు. అన్నదమ్ముల మగు మనము కలహించి పోరాడుట యెంతయు నీచవృత్తి. పూజ్యులగు కాశ్యపులును నిప్పుడు తపస్సామ్రాజ్యమునఁ బొదలు చున్నవారలు గదా మనము వారిపాదపద్మములసన్నిధిం జేరి యియ్యది విన్నవింతము. వారలేయది యాజ్ఞాపించిన నయ్యది శిరసావహించి మెలంగుద మని సాంత్వనవాక్యంబులు పలికిన నయ్యది యేమికళయో కాని యందుల

కాతం డియ్యకొనియె. తదనంతరంబ మే మిరువురమును గలసి కాశ్యపులసన్నిధి కరిగి యిది యంతయు విన్నవించిన సత్త్రయాగదీక్షాపరతంత్రు లగు జనకులును, నించుక యాలోచించి తలపంకించి యన్నలారా! తగునుత్తరం బొసంగఁ దడవు చాలక యున్నది. సత్త్రయాగానంతరమునఁ గర్తవ్యంబు వ్యక్తపరచెద మంతదనుక దురాలోచనంబుల గంతులిడక చింత లుడిగి మంతనంబున నుండుఁడని యాజ్ఞాపించిన, వల్లెయని యనుజ్ఞవడసి నిజనివాసస్థానంబున కరుదెంచి యియ్యది మీకు విన్నవింప నేతెంచినాఁడ దుష్టనిగ్రహంబును శిష్టపరిపాలనంబును గావింప నరరూపంబున నున్ననారాయణుండవుగాని కేవలనరుండవు గావు. నీకెఱుంగనియది లోకంబున నేకడం బ్రవర్తిల్ల నేరదు. ఆక్రూరరాత్రించరునిబాఱినుండి నన్నేవిధంబునం దప్పించి రక్షించెదవో నే నెఱుంగనని దీనాలాపంబులు పలికిన సర్వజగన్నియామకుం డగు నయ్యాదినారాయణుండును, నారాక్షసేశ్వరుండు తెగునుపాయంబు కొంతతడ వూహించి యయ్యది మనంబున దిట్టపఱచికొని యన్నా! జేజేలమిన్నా! వీనివలన నీకావంతయు జడియవలసినది లేదు. వీనికిఁగాలం బాసన్నంబైనయది. వీనికి మారకుండును బొడమియున్నవాఁడు. అని భవిష్యదర్థంబు మంతనంబున దెలిపిన సంతసించి యంతకు నీవవలంతి వని వేఁడిన శ్రీకాంతుండిట్లనియె.

గీ. దీని కొక్కయుపాయంబుఁ ♦ దేటపఱతు
రాజహంసలఁ బంపి యా ♦ రాక్షసేంద్రు
కన్యకామణిసన్నిధిఁ ♦ గామరూప
విభవ మెన్నంగఁ జేయుము ♦ వేగ నీవు. 157

వ. అన విని యమరేంద్రుం డుపేంద్రునిననుజ్ఞం గొని యరిగె నని శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కెఱింగించిన నవ్వలికథ నడుగుటయు. 158

క. ఘోషానపరీశంబరరిపు • వేషా
నతాకాంతిపూష • విద్వజ్జనసం
తోషా మృదుభాషా జిత • శేషా
శ్రీరామకృష్ణ • శిష్టతనూజా. 159

చ. నవనవలాలసత్ప్రబల • నానటదీశజటాతటీలుఠ
ద్దివిజతరంగిణీజనిత • తీవ్రతరోరుతరంగసంగతి
ప్రవిమలనీరఫేనఘన • భాసురకాంతిమలిమ్లుచోజ్జ్వల
చ్ఛవిలసమానకీర్తిఘన • సార పురాతనవైశ్యవల్లభా. 160

మాలిని. అమలగుణసమాజా • యాశ్రితాదిత్యభూజా
దమశమగుణభాజా • దానరాధాతనూజా
విమలసుకవిరాజా • విశ్వవిఖ్యాతిభోజా
సుమహితరవితేజా • సూరిసంతోషబీజా. 161

ది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసరసకవితాసామ్రాజ్యద్రావిడశాఖా
పస్తంబసూత్ర కౌండిన్యగోత్ర శ్రీమదోరుగంటికులపవిత్ర జోగిశా
స్త్రినరసమాంబాతనూభవ శ్రీరామకృష్ణార్జుననారాయణీ
యత్ర్యర్థి ప్రబంధాదిబంధుర ప్రబంధరచనావైభవ
సోమశేఖరకవిప్రణీతంబైన శ్రీప్రభావతీపరిణయం
బను మహాప్రబంధంబునం

బ్రథమాశ్వాసము.





శ్రీరస్తు.

# శ్రీ ప్రభావతీపరిణయము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీరమణీచూడామణి ♦ కారుణ్య
కటాక్షలబ్ధ ♦ ఘనవిభవ మహో
దార వరరామకృష్ణ కు ♦ మారా
వేంకటచలపతి ♦ మహితవిచారా. 1

వ. అవధరింపుము శ్రీశుకయోగీంద్రపుంగవుండు పరీక్షిన్నరేంద్ర
చంద్రునకు నిట్లని వక్కాణించె. 2

ఉ. ఇంద్రుఁడు మంతనంబున ను ♦ పేంద్రుఁడు చెప్పినచొప్పునాత్మలో
సాంద్రతరానురాగమున ♦ సంతస మందుచుఁ జింత నేసి ప
క్షీంద్రుల హంసరాజముల ♦ నొంతయు వేడుకఁ బిల్వఁ బంచి ని
స్తంద్రకటాక్షవీక్షణను ♦ ధారసధారలఁ దేల్చి యిట్లనున్. 3

సీ. సన్మార్గసంగతి ♦ సన్మానసస్థితి
నలరుచున్న పరమ ♦ హంసలార!
ఆచక్రవాళాంత ♦ భూచక్రవిక్రమ
ప్రాప్తిఁ గేరెడు ఖగ ♦ వరములార!
ధర్మకాలానుగ ♦ కర్మకాండప్రథి
తంబు లౌనజవాహ ♦ నంబులార!

సతికి భారతికి శ్రీ ♦ సతికి భర్తలఁ గూర్పఁ
గడు నేర్పుగలవిహం ♦ గంబులార!
శ్రీగసీరవిభాగవి ♦ శేషశక్తి
గలిగివర్తించుమిమ్ము బోఁ ♦ టులకుఁ గాక
యన్యులకు దీనిఁ దీర్పంగ ♦ నలవి యగునె
దేవకార్యరహస్యంబు ♦ భావ మలర

వ*. కాశ్యపుల మగుట మీరును మేమును బరస్పరకార్యసంఘటనంబు గావించుకొను చుండుట యుచితంబు. ప్రకృతకార్యం బెద్ది యన నవక్రవిక్రమాక్రాంతదిక్చక్రదేవచక్రుం డగువజ్రనాభుండను దానవేశ్వరుండు పరమేష్ఠివరగర్వదుర్వహుం డై విష్టపత్రితయంబుఁ గష్టపఱుచు చున్నవాఁడు. ఆదైత్యాగ్రణికిఁ బ్రభావతి యనుకన్యకాలలామంబు గలయది. ఆమెకును శ్రీకృష్ణునినందనుం డగు ప్రద్యుమ్ననకును సంధానం బొనరింప వలయు. అక్రూరరాక్షసుని పురంబు వజ్రపురంబు. అయ్యది వజ్రాయుధంబున కైన నభేద్యంబు. అందు గాలి యైనను జొరవెఱఁగందు ఇంక నన్యుల నెంతటివారు? మీరప్పురంబు నెట్లు చొచ్చెదరో? యీమంత్రంబు నెట్లు నెఱవేర్చెదరో? నేనెఱుంగం జాల. మీబుద్ధిచాతుర్యం బంతయుఁ గాన్పింపం దగునవసరంబు తట స్థం బైనయది. అనిన, దేవా? మీరాజ్ఞ యిచ్చిన నెంతటికార్యం బైన సాధింపంగ సమర్థులము. రహస్యంబు భేదంబు కాకుండ మాయదార్శక్తిఁ గార్యనిర్వాహణంబునకుఁ గడంగెదము. సెల వొసంగుఁ డని ముదలం గొని స్వర్గంబుం గడచి వియన్మార్గంబున నరుదెంచుచుఁ గైలాసాభిముఖు లై కొంతవడి నడచి "వజ్రపురంబు ప్రవేశించు తెఱంగెట్లు? ప్రభావతితో మంతనంబున మాటలాడుమార్గం బెట్టు" లని యోజించి యొక్క యుపాయంబు మనంబున దిటవు గావించుకొని యంగఱం దనరాక వేచి యుండ నందుంచి నలువురితో నాకాశమార్గంబున నెగసి:—

సీ. మల్లికామూలతీ • నల్లికాజాతీమ
తల్లికామాధవీ • వేల్లితంబు
సురసాలఖర్జూర • వరసాలమోచామ
ధురసాలకృతమాల • విరచితంబు
తాళీలసన్నారి • కేళీతమాలకం
కేళీబృహత్ఫలా • కీలితంబు
సారామ్రివకుళమం • దారామ్లతరుకోవి
దారానశాశ్వత్థ • పూరితంబు
బాలబదరీపరంటత • కోలబిల్వ
జంబుజంభీరభూజల • జాతలికుచ
పూగతాంబూలికాబింబ • ముఖవిభూషి
తంబులలితంబు పర్మిమదావ • నంబుగాంచి 6

వ. అపర్మిమదావనాంతరంబున. 7

సీ. చక్రివాకబకోట • చక్రితిత్తిరిఖేట
సుందరసారస • నందితంబు
శతపత్రికల్హార • నుతకోకలదవార
తతహల్లకామోద • దర్పితంబు
రాజీవరాజీవి • రాజచ్ఛఖగరాజ
విమలభాసంభూత • విశ్రుతంబు
సారామ్లమల్లీర • సాలోరుజంబీర
వేలాగుచిస్ఫార • వేల్లితంబు
పుష్పసారపయస్సార • పూరితంబు
చారుతరభృంగసంగీత • సంగతంబు
రమ్యతీరంబు కమలాక • రంబు మెఱయఁ
గాంచి విహరింపఁజొచ్చెన • య్యంచమిన్న. 8

ఉ. అంతట నొక్కనాఁడు దను ◆ జాధిపనందన యక్షదేవతా
కాంతలు గొల్వ వచ్చె మణీ ◆ కంకణకాంచనకాంచికింకిణీ
కాంతిజిగాల్జి గాలగ్రుచుఁ ◆ గ్రాలుచు దిక్కులనావరింపఁగా
సంతసమొప్ప చారుతర ◆ సారసవాటికిఁ బద్మకోటికిన్. 9

గీ. వచ్చి సరసునఁ దనువిభా ◆ వైభవమున
వెలుఁగఁ జేసెడు రాయంచ ◆ విధముఁ గాంచి
తరుణులును దాను మెల్లనఁ ◆ దాటితాటి
పరమహంసను మాయ నాఁ ◆ బట్టుకొనియె. 10

గీ. పట్టుకొని తెచ్చి తత్ప్రాంత ◆ భాగమందు
దినకరదీప్యమానమై ◆ వెలుఁగుచున్న
చంద్రికాంతశిలామయ ◆ సౌధమందు
రత్నపంజరమున నుంచె ◆ రాజవదన. 11

గీ. భిన్నతను జెందువిధమునఁ ◆ జిన్నవోయి
రమణిఁ గనుఁగొని పలికె నా ◆ రాజహంస
మనుజభాషల మిక్కిలి ◆ వినయ మొప్ప
మంజులామోదనవసుధా ◆ మధురఫణితి. 12

సీ. నిముసంబు నను బాయ ◆ నేరక యుండిన ప్రాణ
వల్లభ తానెంత ◆ దల్లడిల్లునొ
కన్నులు దెఱవని ◆ కడుఁ జిన్ని ప్రాయంపు
శిశువులాఁకటి కెంత ◆ జిక్కరొక్క
మూఁడుకాళ్ళఁ జరించు ◆ ముదుసలి ననుఁగన్న
మాత తానెంతని ◆ భీతివడునొ
తగఁ దోడునీడలై ◆ పొగడొందుచుండిన
చెలికాండ్రు తామెంత ◆ చిక్కువడిరొ

యహహా ! నే నేమొనర్తు నే ♦ మందు విధిని
వేడుకొనియెదఁ గరుణతో ♦ విడువుమమ్మ
కొమ్మ నీకొక్కడగు మేలుఁ ♦ గూర్తునమ్మ
దివ్యగుణసీమ మానవ ♦ తీలలామ. 13

క. అను హంసవాక్యములు తన
మనమున కాశ్చర్యమును న ♦ మందానందం
బును గలిగింపఁగ నెచ్చెలిఁ
గనుగొని యిట్లనియెఁ బ్రేమ ♦ కడలుకొనంగన్. 14

మ. కలకంఠీ కలభాషణంబులను బల్కంజొచ్చె ♦ నీచిత్రమున్
గలదే పక్షులు మాటలాడునఁట లో ♦ కంబందు నెందైననీ
కలకంఠంబును వీడ కిచ్చటనె సౌ ♦ కర్యంబుగా నుంచి ని
చ్చలుబోనంబులు పెట్టి పెంచుదమె వా ♦ క్చాతుర్యమాలించుచున్

గీ. అనిప్రభావతి యారాజ ♦ హంసఁజూచి
దుష్ప్రవేశంబు రాక్షసే ♦ ంద్రునిపురంబు
నెట్లుచొచ్చితి వెవ్వతె ♦ వీవుమనుజ
భాషలెటులబ్బెఁ జెల్పుమా ♦ భావమలర. 16

క*. అన విని ఖగరాజు మనం
బునఁబ్రాణాపాయచింత ♦ వో విడచి ముదం
బునఁదనవచ్చినకార్యం
బనుకూలంబగు నటంచు ♦ నను మధురోక్తిన్. 17

సీ. బ్రహ్మాధివాహన ♦ పరమహంసాగ్రణుల్
వంశకర్తలు మాకు ♦ వనరుహాక్షి
పరసుధామధురమ ♦ ద్వాణు లాలింపంగ
విబుధేశు లీశులు ♦ విమలగాత్రి

సరసలీలాభోగ • సన్మానసస్థలి
యావాస మెంచరా • జీవపాణి
బృందారకావగ • బొందామరలతూండ్లు
విందులై వెలయురా • కేందువదన
భారతీచతురానన • ప్రభృతిసురల
బ్రణయగతిగూర్చు టేమాకు • బనిగదమ్మ
సరససంగీతసాహిత్య • చతురకృతులు
వెన్నతోఁ బెట్టినవి మాకు • సన్నుతాంగి. 18

వ. అనిన నాహంసావతంసంబునకుఁ గన్యకాలలామం బిట్లనియె. 19

సీ. జేజేలకును గామ • సిద్ధివృద్ధిఘటించి
చిరభోగ మిడుహంస • వరము కాదె
ఘనసత్త్వసంపద • దనరార భక్తసం
ఘంబుఁ బ్రోచెడుహంస • గరిమ కాదె
వేదవేదాంగాది • వివిధవిద్యామహా
మతినిఁ బూనుట హంస • మహిమ గాదె
సకలలోకాలోక • సాఫల్యసంసిద్ధి
గ్రాలఁ జేయుట హంస • లీల గాదె
యభవుఁ బూనుట యాహంస • విభుతఁ గాదె
సతతజనజీవనము హంస • కృతియ గాదె
గాన నినునెంచ నే నెంత • దానవినుము
రమ్యపతగావతంస యో • రాజహంస. 20

క*. అనియెడియరాళకుంతల కనురాగం
బెద జనింప • నాశుచిముఖి యి
ట్లను నీకొక్కరహస్యం బునుదెల్పెద
వినుము మోద • మునఁ బూఁబోఁడీ !. 21

క. ముదమెదఁగదురఁగ హింసము
బొదలించెడుపాత్రిణసఖుల ♦ మోహాహ్మముద్దుం
బదముల సూనృతసుగుణా
స్పదముల వినకుండు రేలు ♦ సఖులు శుచిముఖి. 22

వ. అనిన నమ్మరాళయాన కమ్మరాళరాజం బిట్లను నోయమ్మా! భవదీయాన్వయ విశేషాదికంబులఁ గనుఁగొన కుండ నెద్దియుఁ బలుక వలనుపడదు. కావున నయ్యవి వివరించి యించుక నాపీను లకు విందొనరింపుమనిన శుచిముఖితోఁ బ్రభావతి యిట్లనియె. 23

— *ప్రభావతి రాజహంసంబుతోఁ దన యన్వయాదులు చెప్పుట* —

సీ. కశ్యపాభిఖ్యచేఁ ♦ గడు నొప్పు చుండిన
తాత మానసవాస! ♦ తాత మాకుఁ
గనకాక్షు తపనీయ ♦ కశిపుల కనుజుండు
తగువజ్రనాభుండు ♦ తండ్రి మాకు
మూఁడులోకములకు ♦ మూల మాతయనంగ
వెలయుపార్వతి యిలు ♦ వేల్పు మాకు
జయ యన విజయనా ♦ సతిపరిచారికల్
సంతతంబునుబ్రాణ ♦ సఖులు మాకు
రజితగిరిసీమ కల్పకా ♦ రామధామ
పార్వతీదివ్యవన మాట ♦ పట్టు మాకు
వజ్రమణిమయగోపుర ♦ వరము వజ్ర
పురము మంగళకలశముకా ♦ పురము మాకు. 24

క. నామంబు విను ప్రభావతి
శ్రీమతిరుద్రాణిచంద్ర ♦ శేఖరివరసే.
వామాహాత్మ్యంబున నే
నీమహిఁబుట్టితి నటంచు ♦ నెన్నుదు రార్యుల్. 25

క. కరిగమనపలుకులకు మది
నరు దంచుచు హంస మిట్టు ♦ లనె సతి యంతః
కరణంబున నిరుపమ మగు
కరుణారస ముప్పతిల్లఁ ♦ గా సంప్రీతిన్. 26

సీ. భారతి వని నిన్ను ♦ భావింతు నందునా
కచ్ఛపి కెంగేలఁ ♦ గానఁబడదు
పార్వతి వని నిన్ను ♦ భాషింతు నందునా
కంజారినవరేఖ ♦ గానఁబడదు
శ్రీసతి వని నిన్ను ♦ సేవింతు నందునా
కమలంబు ముంజేతఁ ♦ గానఁబడదు
అలజగన్మోహిని ♦ వని యెంచుకొందునా
కైసుధాకలశంబుఁ ♦ గానఁబడదు
అయిన రూపంబు లావణ్య ♦ మరసి కనఁగ
వనిత! చతురాస్యుఁ డరయ స ♦ ర్వజ్ఞుఁడును సి
తాబలోచనుఁడును మోహ ♦ నాంగుఁడైన
నాయకుఁడు నామనంబునఁ ♦ బాయ కుండు. 27

క. ఏమే మీ ఖగరాజమ
నీమాటలు వినఁగ నాదు ♦ నెమ్మనమున న
త్యామోదంబుదయించెను
నేమంబున నుండుమనుచుఁ ♦ జెలివేగముగన్. 28

క. రంజన్మణిపుంజిత మగు
పంజరమున నున్న ముద్దు ♦ పక్కిదొరను దా
నంజక చేకొని లోచన
కంజంబుల నద్దుకొనుచుఁ ♦ గామిని వల్కెన్. 29

గీ. బాల్యలౌల్యమనఃక్రియా ♦ పటిమవలన
నిన్ను నాయాన పెట్టితి ♦ నీడజేంద్ర
నొచ్చెఁగాఁబోలుఁ బక్షము ♦ ల్సచ్చరిత్ర
మదిని నిన్ననుగనలేక ♦ మానసౌక. 30

గీ. చతురమతి కాత్మ యెంతయో ♦ సంతసించె
ముద్దుమాటల కెద యెంతొ ♦ మోదమందెఁ
బ్రౌఢి పరికించి చెప్పనే ♦ పాటిదాన
నీనుడువునాయకునిఁదెల్పు ♦ పీను లలర. 31

క. అనుమాటల కానందము
మనమున జనియింప దనుజ ♦ మర్దనతనయున్
మనసిజుని దెలుప నిదియే
యనుకూలం బయినసమయ ♦ మని ప్రౌఢోక్తిన్. 32

— * ప్రభావతి రాజహంస ప్రద్యుమ్ను నెఱింగించుట * —

గీ.* అతఁడు నీవలెఁ బ్రాంచితుం ♦ డఖిలలోక
వాంఛితాఖండనిరుపమై ♦ శ్వర్యయుతుఁడు
దివ్యరూపపరాక్రమో ♦ దారుఁడగుట
ద్యుమ్ననామాభిరాముఁడు ♦ తోయజాక్షి. 33

గీ*. అనిన నెఱిఁగియు నెఱుఁగని ♦ యటుల లజ్జ
యాననంబున దళుకొత్త ♦ నంచఁగాంచి
పలుకు నీప్రౌఢిమ నెఱుంగ ♦ వల్తి నెట్లు
తెలుపు మానందనునిరీతి ♦ తేటపడఁగ. 34

క. అనియనుమోదము మనమున
ననుపముగఁబొడమియడుగ ♦ నాఖగవరమున్
మనసిజచరితము వనితకు
వినిపింపఁ దొడంగెఁ బ్రేమ ♦ వెల్లువపాఱన్. 35

క. ద్వారక మణిగణవిలస ◆ ద్ద్వారకవాటా
క్షిప్తాగ్ర ◆ వారక మోక్ష
ద్వారక సంతతనవసుమ ◆ కోరక
యొకరాజధాని ◆ గొరలు న్ధరలోకా 36

సీ. గోపాలనప్రౌఢి ◆ నేపాఱు చుండిన
గోపాలనప్రౌఢి ◆ గొఱలువాఁడు
ఘనవంశగానవి ◆ ఖ్యాతిని దేలిన
ఘనవంశ గానని ◆ ఖ్యాతివాఁడు
విమలబృందావన ◆ వృత్తియుం దుండిన
విమలబృందావన ◆ వృత్తివాఁడు
చక్రినాయక రీతి ◆ సలుపుచు నుండినఁ
జక్రినాయకరీతి ◆ సలుపువాఁడు
దరముఁ దాల్చినవాఁడైన ◆ దరములేని
వాఁడు శ్రీకృష్ణనామంబు ◆ వాఁడు మఱియు
సల్లలితకీర్తివల్లవీ ◆ పల్లవుండు
దేవదేవుండు తత్పురా ◆ ధీశ్వరుండు. 37

వ.* అట్టి శ్రీమన్నారాయణుండగు శ్రీకృష్ణమూర్తికి సాక్షాల్లక్ష్మి యగు రుక్మిణీదేవియందు రతీవల్లభుండు ప్రద్యుమ్ననామంబున నుద్భవించె. మఱియు రుక్మబాహు రుక్మనేత్ర ప్రభృతులు ననేకు లాత్మకుం బొడమిరి. జాంబూనద ప్రభాలలితగాత్రి యగు జాంబవతియందు సాంబప్రసాదవైభవుం డగుసాంబుండు లోనగు పెక్కండ్రుకుమారు లుదయించి రం దగ్రజుం డగుప్రద్యుమ్నుండు. 38

సీ. వాలుఁగన్నులవాఁడు ◆ నీలనీలాంభోజ
నీరదాంచచ్ఛాయ ◆ నెగడువాఁడు

తళుకుఁజెక్కులవాఁడు ♦ నలకూబరవసంత
నలజయంతాకృతి ♦ నలరువాఁడు
మొలకనవ్వులవాఁడు ♦ బలుకెంపుగలకెంపుఁ
దలకించుచుమధురా ♦ ధరమువాఁడు
చిలకపల్కులవాఁడు ♦ చలబంభరాజీవ
రాజీవపత్రినే ♦ త్రములవాఁడు
కర్ణకుండలచాకచ ♦ క్యములవాఁడు
కటకమణిరుచిభాగధ ♦ గ్యములవాఁడు
లలితగ్రైవేయ ధాళధ ♦ ళ్యములవాఁడు
ఘనుఁడు విలసిల్లుఁబ్రద్యుమ్నుఁ ♦ డనెడువాఁడు. 39

గీ. చందమామమామ ♦ చందంబుఁ దెల్పెడు
చిన్నవన్నెమోము ♦ చెన్నువాఁడు
తనదుతల్లిఁ దల్లి ♦ తల్లిగాఁ దెల్పెడు
తనువిలాసలీలఁ ♦ దనరువాఁడు. 40

క. రాజకుమారులు మాధవ ♦ రాజకుమారులును
రాజ ♦ రాజకుమారుల్
రాజకుమారులు యాదవ ♦ రాజకుమారునకు
సాటి ♦ రారు మృగాక్షీ. 41

సీ. సత్యపదస్థాన ♦ సంస్థితుం డగుబ్రహ్మ
వాణికై యెవ్వాఁడు ♦ వాఁడిచెఱచెఁ
గంటఁజూచిననాఁటి ♦ కార్పణ్యమెదఁబూని
వేదాశ్వసగము గా ♦ వించెనెవఁడు
అచ్చుంపునెమ్మేను ♦ మచ్చలు డాయంగ
ఘనవాజి కెవ్వాఁడు ♦ కారణుండు

పరమహంసను రాగ ♦ భంగిచేఁ బుష్పిణి
పద్మినికర మంటఁ ♦ బఱచెనెవఁడు
తగనిమగువల మగలను ♦ దగులుమాల్పి
కూర్మిసమమైనజోళ్ళను ♦ గూర్చునెవ్వఁ
డట్టిదివ్యుఁడు వర్ణింప ♦ నలవి యగునె
మన్మథుండు సఖీకృత ♦ సన్మనుండు. 43.

సీ. సంపూర్ణశశివిభా ♦ సదనంబు వదనంబు
శ్రీజితేందిందిర ♦ శ్రేణివేణి
దరసమాకలితసౌం ♦ దర్యరోధి శిరోధి
వరహేమనవకళా ♦ వాస నాస
కమలచారుప్రభా కరములు కరములు
నలజలావర్తస ♦ నాభినాభి
పద్మమంజులవిభా భరణము ల్చరణముల్
సోమునిజవరాండ్రు ♦ జోళ్ళుగోళ్ళు
మవ్వ మిగులొత్తు వెన్నెల ♦ నవ్వు నవ్వు
నహహా యాతని వర్ణింప ♦ నలవి యగునె
ఫణిపతికినైన సురసైన్య ♦ పతికినైనఁ
బశుపతికినైన భారతీ ♦ పతికినైన. 43

సీ. మామచక్కదనంబు ♦ మోమునందుధరించి
మొనయుచుండినజగ ♦ న్మోహనుండు
తండ్రినీలచ్ఛాయఁ ♦ దనకేశములఁ దాల్చి
వెలయుచున్న త్రిలోక ♦ విజయశాలి
తాతపాంసుద్యుతి ♦ దరహాసమునఁ బూని
లలి జెలంగినమహా ♦ లక్ష్మిసుతుఁడు

తల్లిసౌభాగ్యంబు ♦ తననేత్రములఁ దాల్చి
యలరారుదివ్యప ♦ ద్మాంబకుండు
మేన బలరామలీలలు ♦ పూనువాఁడు
సూనబాణతనుస్థితి ♦ సొబగువాఁడు
మానినీమానహరణని ♦ జ్ఞానశాలి
దోర్విభవచక్రవర్తి ప్ర ♦ ద్యుమ్నమూర్తి. 44

సీ. లలిమేను తొలిమేనుఁ ♦ బలుమీనుఁబోలిన
వాలుఁగన్నులమేలు ♦ డాలువాఁడు
తఱినాటితా-బేటి ♦ పరిపాటిపోలిక
జెలఁగు పదాగ్రము ♦ లలుగువాఁడు
గిరిధీరుఁ బరుఁ జీరు ♦ నరహీరుమధ్యం ఁ
బోలెడునెఱికౌను ♦ పొలుపువాడు
అలసోమకులసోము ♦ బలరాముపోలిక
లాలితదరహాస ♦ లీలవాఁడు
రాజవిజయాభిరతి నల ♦ రారువాఁడు
ప్రబలధర్మగుణావలం ♦ బనమువాఁడు
బాలగోపాలలీలలఁ ♦ గ్రాలువాఁడు
కాముఁ డభిరూప కామినీ ♦ కాముఁ డలరు. 45

సీ. కమలాభిరామ మహా ♦ కన్గవ గలఫలం
బానీగజాత్ముఁ బెం ♦ డ్లాడ వలదె
కాళీలసద్వేణి ♦ కలిమి మించినఫలం
బాయభ్రకేశుమై ♦ నంట వలదె
మంజువాణీసుధా ♦ మధురత గలఫలం
బాచకురాస్యు ము ♦ ద్దాడ వలదె

పద్మినీజాతిసం ♦ పదరీతి గలఫలం
బావిభాకరుకరం ♦ బంట వలదె
తారకాచారుమూర్తివై ♦ తనరఁగ ఫల
మామహారాజుకొఁగిట ♦ నలర వలదె
మూఁడులోకములందున ♦ మోహనాంగుఁ
బోలుసుందరుఁడీఁకలేఁడు ♦ భుజగవేణి. 46

— *ప్రభావతి ప్రద్యుమ్నుని మనంబునఁ గాంక్షించుట* —

వ. * అనిన నప్పక్కి తేనిపలుకుల కంతరంగం బెంతయు, నాథ రాకాంతునియందు స్నేహభాజనం బగుటయుం గొంత వడి చేష్టలు దక్కి యల్లనఁ దెలసి కరపద్మసం ఘటితసరసీరుహంబున విసరి కొనుచుఁ బులకల నిమిరికొనుచుఁ బర్వతరాజ పుత్త్రిక చెప్పినచొప్పారయుచు నాతం డ యీతండని నిర్ణయించుకొని మనంబున దిటంబూని కలహంస గనుంగొని వానీరథంబ! నామనోరథంబుం దీర్ప నీకన్న నన్యులు వలం తులె? ఒకనాఁడస్మత్కులదేవత యగు పార్వతీదేవి నాకు స్వప్నంబున సాక్షాత్కరించి త్రిలోకసుందరుండగుకందర్పుండు నీకుఁబతి కాఁగలం డని వరం బిచ్చినయది. త్రిలోకమాత యగునామె వాక్యంబుల కన్య థాత్వంబు సంభవించు నెట్లు? నాటంగొలె నీదుర్ఘటం బగుకార్యం బెట్లుసంఘటిల్లు నని యనేకవిధంబుల నారయ చున్నదాన. హా! నాఁటి స్వప్నదృష్టదేవియే నేఁడీరూపంబునఁ బ్రత్యక్షంబై ప్రేరేఁచు చుండెం గాఁబోలు? దైవమా! యీలావణ్యనిధి నాగుణైకశీలు నెట్లు కనుఁ గొనఁజేసెదో? ఎట్లు సరుకూర్చె దోయని చింతించి యింతయేల యెం తయుం జాలిన యీప్రత్యక్షదైవం బుండనాకేమి కొఱంత యని ధైర్యం బంది ఖగ రాజంబుం గేల నిమిరియోహంసావంతసమా! నీవాతుప్రిచ్చ వానితో నీవెట్లుమాట లాడెదు నాయవస్థ నెట్లు విన్నవించెదు? అతని నిట కెన్నఁడు దోడ్కొని వచ్చెదు నామనం బెన్నఁడు చల్లఁజేసెదు?

నే నెఱుంగం జాల కుంటి. నీయొనర్చు కార్యంబునకుం బ్రతీకారం బేమి యొనర్చుదాన ? నైనం గృతజ్ఞతాసూచకంబుగ దీనిం గొమ్మని తన మెడ నున్న బన్న సరంబుం దానికిం బారితోషికంబుగ నొసంగి నీవీకార్యం బు సమకూర్చెద వేని నీకెన్నఁడుం గృతజ్ఞురాల నై యుండెద ; నింత కన్న నేఁ జేయునది లేదని విన్నవించి యొకపత్త్రంబునఁ దనవృత్తాంతంబు లిఖియించి రాయంచపత్త్రాంతరంబునం బొందుగఁగట్టినీకు నేమం బగుఁగాక ! పోయిరమ్మని మఱియు నిట్లనియె. 47

సీ. నానావిధానేక ♦ సేనాసనాథుఁ డై
జై దర్పయాత్రోత్సాహ ♦ సహితుఁడైన
దుష్టులరణవీథిఁ ♦ దునుమాడి వచ్చిన
సచివులతో గోష్ఠి ♦ సలుపుచున్న
కార్యఖడ్గవిలాస ♦ కలితుఁ డై యుండినఁ
జెలఁగ రహస్యంబు ♦ చేయుచున్న
నాత్మదైవోపాస ♦ నాసక్తుఁ డై యున్న
వెలయ విద్వద్గోష్ఠి ♦ మెలఁగుచున్న
నిదుర నెఱిసోగకన్నులఁ ♦ గదురు చున్న
వెలయు మజ్జన భోజన ♦ విధుల నున్న
మించుసంగీతగతి యాల ♦ కించు చున్న
తఱిని మనవిని దెలుపంగఁ ♦ దగదు సుమ్మి. 48

సీ. కర్పూరతాంబూలి ♦ కామహోత్సవుఁడైన
తగభూషణంబులు ♦ దాల్చుచున్న
వేశ్య లిర్వంకల ♦ విసరుచు నుండిన
సింహాసనంబునఁ ♦ జెలఁగు చున్న
ముద్దుబాలురతోడ ♦ ముచ్చటించు చునున్న
సుందరదరహాస ♦ శోభితుఁడైన

చెలికాండ్రతోఁగథ ♦ ల్చిత్తగించుచు నున్న
సరసులతోగోష్ఠి ♦ సలుపు చున్న
మవ్వ మగుమీాస మెఱపుగా♦ దువ్వుచున్న
సొగసు మణిదర్పణంబునఁ ♦ జూచు చున్న
చక్కఁగభుజించి శతపది ♦ దొ్రక్కుచున్న
వేళఁగనిపెట్టి నను విని ♦ పింపనమ్మ. 49

క.* అన వల్లె యనుచు ♦ హంసం బును
నా తరుణీలలామ ♦ మును జూచి భవ
జ్జనకమహా దారుణశా ♦ సన మీాపురి
మఱలఁ జేరఁ ♦ జనునే నాకున్. 50

వ. అనవుడు. 51

క. నీరాకకు నీపోకకు ♦ నేరక్షకు
లైన నిన్ను ♦ నేమొడ నైనన్
వారింపకుండఁ జేసెద ♦ గూరిమితో
నాకు శుభము ♦ గూర్పుము వేగన్. 52

గీ. అనిన నామాటలకు రాజ ♦ హంస యంత
రంగమున నించుకయుసంశ ♦ యుంబుఁ గనక
యమరకార్యంబు సమకూరె ♦ ననుచు నింత
యంత యన రానియానంద ♦ మంది పొంగి. 53

—: రాజహంస ప్రద్యుమ్నుని కడకేగుట :—

ఉ. అప్పుడురాజహంసజల ♦ జాస్యను వీడ్కొని వేడ్కమీాఱఁగా
నుప్పరవీధిపై నెగసి ♦ యొయ్యనమిత్రులఁ గూడిచట్టుపల్
చప్పుడు కర్ణపర్వశుభ ♦ సంపద నీనఁగబల్చిమాశయం
దప్పులరాశి పాశినిల ♦ యాకర మాశుగ డాసివాసిగనన్. 54

క. వరమతికలహంసము గనె
శరధిమహాసేనజనక ♦ శరధి న్దశరదా
శరధి న్నిర్భయవలదా
శరధిన్మ్భాభాగపరిధి ♦ శతపత్రిరధిక్. 55

క. పారావారము సరిదా
ధారము రంగత్తరంగ ♦ తతిశోభావి
స్తారము జలచరనిచయా
పారము సకలవిధరత్న ♦ వారాకరముక్. 56

గీ. అట్టిరత్నాకరంబులో ♦ ననుపమాన
రత్నసంపద్విచిత్రిచి ♦ రత్నదివ్య
పురవినిర్మాణ చాతుర్య ♦ గరిమ మించి
భూతిలక మైనద్వారకా ♦ పురము దరసి. 57

సీ. గోపురంబుల డాయు ♦ గోపురంబులఁ జూచి
యధరితశుభ బుధ ♦ పథములాని
చంద్రికాంతోపల ♦ చంద్రశాలలఁగాంచి
మేడాశ్రయంబు లా ♦ మేడలఁగని
తోరణంబులనొప్పు ♦ తోరణంబుల దాఁటి
బుధమహిమాభోగ ♦ బుధుల నెన్ని
రాజసూనువిలాస ♦ రాజసూనుల డాసి
సతులతో సరి యగు ♦ సతులఁ గడచి
రాజితంబైనమత్తేభ ♦ రాజి దరసి
చక్రిపోషణచణశూర ♦ చక్రి మడసి
సరసులకుఁ బ్రీతి పమకూర్చు ♦ సరసు లొలసి
కాంచనుద్యానవని నొక్క ♦ కాంచనంబు 58

వ. తత్సమీపంబున 59

క. కమలాకరంబుఁ గంటిని
గమలాకరమును బ్రవిమల ♦ కమలాకరమున్
కమలారాగోర్మికము
న్గమలాలంకృతము జలిత ♦ కంటకయుతమున్. 60

ఉ. సారససారసాళిఘన ♦ సారససారరసంబుఁజూడఁగా
సారసరస్తటంబునకు ♦ సారసబాణుఁడు వచ్చికాంచెనా
సారసరాజము న్విమల ♦ సారసనైరవిరాజము న్మహా
సారసువర్ణవాజమును ♦ స్వర్గముఖాళకరాళతేజమున్. 61

సీ. ముద్దులమురిపంపు ♦ మోముగోముల నెంచుఁ
బక్షవలక్షసం ♦ పదలఁజూచు
జలజసంచితచంచు ♦ చంచత్ప్రభలఁగాంచుఁ
జక్రాభిరామపు ♦ చ్ఛంబు నెన్నుఁ
జరణారుణప్రభా ♦ సరణికి వెఱ గందు
గమనచాతుర్యసం ♦ గతికి నలరుఁ
గిలకిల మనుజిల్గు ♦ పలుకుల కెదఁగుల్కు
నయనాభినయసము ♦ చ్చయము మెచ్చు
మహితసమ్మోదపోప్లూయ ♦ మాన మగుచు
విన్నఁజెలంగు నలచలి ♦ వెలుఁగనంగఁ
దనరురాయంచఁ గని పట్టఁ ♦ దలఁచెఁ దనదు
డెందమున నందనందన ♦ నందనుండు. 62

శా. కేళాకూళికి డిగ్గి హంసవరము ♦ న్గ్రేఁగంట నీక్షించుచు
న్నాళీకోరుమృణాలనాళముల వి ♦ న్నాణంబుగాఁ ద్రోయుచున్
నాళీకాంతరసీమఁ బొంచి చనుచు ♦ న్నాళీకబాణుండు స
త్కేళీలాలసలీలఁబట్టుకొనెఁ గెం ♦ గేలంఖగోత్తంసమున్. 63

వ. పట్టువడినయారాజహంసంబు ప్రద్యుమ్నున కిట్లనియె. 64

క. మదనా! కరుణామయహృ
త్సదనా! శ్రీవిజితనాక ♦ సదనా యుదూరా
ద్వదనా! వజ్రావళీసమ
రదనా! నామనవి వినుము ♦ రంజితగణికా

క. ధర్మంబు నిలుపఁ బుట్టిన
ధర్మాత్మునిసుతుఁడవీవు ♦ తగననుఁగొనుటే
ధర్మంబు? చూడ, సుమనో
ధర్మా! నీవంటిదివ్య ♦ ధర్ముల కరయన్. 66

గీ. అనిన విని యిట్టు లనియెనా ♦ హరిసుతుండు
నవ్యమగునీదుచక్కఁదన ♦ నంపుసొంపు
లలితశృంగారచేష్టావి ♦ లాసగతులు
గాంచఁబట్టితి నేనొండు ♦ గాదు నిజము. 65

—* రాజహంస ప్రద్యుమునకుఁ బ్రభావతి వృత్తాంతంబు చెప్పుట *—

వ* అనిన విని యయ్యమరమరాళం బిట్లను. ఓజగన్మోహనా! సౌందర్యాతిశయ విరాజమానయగునొక్క యపూర్వ పూర్వగీర్వాణ కన్యారత్నంబు సందేశంబుఁ గొని భవద్దర్శనార్థంబు వచ్చితి; తద్వృత్తాంతం బంతయు విన్నవించెద. వజ్రపురంబను నొక్క దివ్యపట్టణంబున వజ్రనాభుం డను పుణ్యజనపురందరుండు గలండతనికి నొక్కకుమారీతిలకంబు కల దామెసౌందర్యాదివిశేషంబు లత్యద్భుతంబులు వివరించెద. విను మని మంజులపదపుంజరంజితం బగు మనుష్యభాషణంబుల వక్కాణించిన మనుష్యభాషాజ్ఞానం బెట్లు కలిగెననుటయు మరల నది యిట్లను.

సీ. వేదశాస్త్రాదిక • వివిధవిద్యలనెల్లఁ
జదివింపఁగా నేర్తుఁ • జదువ నేర్తు
సంస్కృతాదిక మైన • సర్వసద్భాషలఁ
బలికింపఁ గా నేర్తుఁ • బలుక నేర్తు
సప్తస్వరాంచిత • సంగీతవిద్యలఁ
బాడింపఁ గా నేర్తుఁ • బాడ నేర్తు
నాకపాతాళాది • లోకసంచయ మెల్లఁ
జూపింపఁగా నేర్తుఁ • జూడ నేర్తుఁ
గశ్యపబ్రహ్మసంతతిఁ • గనకగర్భ
వాహము సరస్వతీశిష్య • వరుఁడ నగుట
విద్యలెల్లను రానింత • వింతయేమి
కామసద్గుణధామ! శ్రీ • గారసీమ. 67

వ. అనుచుం దరీల లామసౌందర్యంబు వర్ణింప శతానందునకైన దరంబెయైన నా యెఱిఁగినంత వాక్రుచ్చెద నవధరింపు మని చెప్పం దొడంగె. 68

సీ. యామినీభామినీ • ట్కామినీమణు లెన్న
సీమంతినీపాద • సితనఖములు
ఇందిరాసుందరీ • మందిరములు చూడఁ
జంద్రాననావిభా • స్వత్పదములు
జంభారిగంభీర • కుంభీంద్రఘనతర
కుంభంబు లాచాన • గురుకుచములు
నాళామృణాళాభి • లీలాకరము లౌర
వాళారుణాధర • వరభుజములు
అహహ యీయింతి సరసమో • హములదొంతి
కాముపట్టపుదంతి చెం • గల్వబంతి

యలరువాసంతి చెలువు చెం ♦ ల్వగువలంతి
మరునిదీమునకుంతి భూ ♦ వర ! పడంతి. 69

సీ. అన్నులతలమిన్న ♦ కన్నుల గనుఁగొన్నఁ
గమలానుగుణకళా ♦ కాంతిఁగాంచు
బిబ్బోకవతిగబ్బి ♦ గుబ్బలుఁగనుఁగొన్న
శ్రీఫలవిభవసం ♦ సిద్ధి చూపు
నొప్పులకుప్పబ ♦ ల్కుప్పుకొప్పుఁగనంగఁ
గాళీవిలాసమై ♦ ఖరిఁ దనర్చు
నీరజదళనేత్రి ♦ యూరుతీరు గనంగ
ఛాయాభినవరేఖ ♦ సవురు మీఱుఁ
గాన సామంజువాణి యా ♦ కమలనయను
రాణియో ? వాణియో ? భూత ♦ రాజుపద్మ
పాణియో ? భాస్కరాంబుద ♦ వేణి యగునొ ?
కాక యితరుల కీరూప ♦ గరిమ గలదె. 70

సీ. ఆననం బమలప ♦ ద్మాభిశోభ వహించెఁ
గర్ణముల్ శ్రీకళా ♦ గరిమఁ గాంచె
నాసిక కాంచన ♦ నవవిభూతిఁ దనర్చె
రదనాళి కుందసం ♦ పదఁ జెలంగె
నధర మంబుజమణీ ♦ మధురమై విలసిల్లెఁ
గంధరం బబ్జసం ♦ గతినిమీఱె
నారు హీరారాజి ♦ చారులీలల మించెఁ
గటిధరాచక్రసం ♦ ఘటనమెలఁగె
నాభి నవనిధిలక్షణో ♦ న్నతిఁ జెలంగె
మధ్య మొక్కటి దురదృష్ట ♦ మహిమఁ దాల్చె

తాను ముష్టికిలోనయ్యె ♦ హీనవృత్తి
వసుధ నిటుఁగాదె స్థితిలేని ♦ వాండ్రబ్రతుకు. 71

క. క్షోణీధరవీణాధర
శోణాధరులకును నిట్టి ♦ సొబగులు గలవే
క్షోణిశ్రోణీవాణీ
శ్రేణుల కెనఁగాఁవు చుమ్ము ♦ చిలుకలపలుకుల్. 72

గీ. బోటిగా దది రతనాల ♦ పేటి గాని
చాన గాదది గొజ్జంగి ♦ సోనగాని
యింతి కాదదిమల్లెపూ ♦ బంతిగాని
కొమ్మగాదది బంగారు ♦ బొమ్మగాని. 73

గీ. నెల తజంఘల కెదిరించి ♦ నిలువనోడి
విచ్చినవశాలిగర్భము ♦ లెవ్వన్ను చూపె
రాసిగూడినమకరము ♦ లాసిపిఁగె
జలగతుల కెందుఁగలుగునే ♦ సారమహిమ. 74

ఉ. చక్రమునేలు బాలకటి ♦ సారసలోచనచారునాభియుక్
జక్రము గేరునల్లజల ♦ జాతనిభాస్యకుచద్వయంబునుక్
జక్రములం జయించు వర ♦ శైలపయోధరవేణి పుష్పలి
ట్చక్రములక్ హసించునవ ♦ చక్రధరాత్మజ! యేమిచిత్రమో. 75

గీ. తనువు హేమాభిరామమై ♦ తనరుచుండు
సుదతినాస తిలోత్తమ ♦ శోభ మీఱు
నేత్రయుగ్మంబు హరిణిని ♦ నిగ్రహించుఁ
దొడలు రంభాజయప్రౌఢిఁ ♦ బడయుటరుదె. 76

సీ. అచలేశసంస్థితి ♦ రచన గాంచినఁ గాని
పరువంపుగజనిమ్మ ♦ సందు లేఁడె

చక్రాధినాథసం ♦ సర్గ మొందినఁగాని
జలజాతముకుళము ♦ లాటి యగునె
ధరణిశ్రీకరులమూ ♦ ర్ధమును జెందినఁ గాని
భూరికుంభంబులు ♦ బోలఁ గలవె
తాళసంగతిఁ జెంది ♦ మేళగించినఁ గాని
యతుకుకిన్నెరకాయ ♦ లలరఁగలవె
నునుపునఁ జెలంగి ఘనసార ♦ మును వహించి
జతవిడక విచ్చి పోక దు ♦ శ్చర్మ మిడక
మితరసము లేక మొఱయక ♦ మెఱుఁగు లేక
చెన్ను మిగిలిన చెలిమిన్న ♦ చన్నుగవకు.

సీ. సతిమోము సంపూర్ణ ♦ చంద్రుఁడే కాకున్న
మధురాధరసుధాప్తి ♦ మహిమగలదె
లలనబాహులు మృణా ♦ ళంబులే గాకున్న
కరసరోజములందుఁ ♦ గానఁ బడునె
ముదితకర్ణములు శ్రీ ♦ మూర్తులే కాకున్న
వరసువర్ణచ్ఛాయఁ ♦ బరఁగఁ గలదె
జలజాక్షి కంఠంబు ♦ శంఖమే గాకున్న
కలితముక్తాజాత ♦ కలన గలదె
కాంతచక్రరబొమ్మయే ♦ గాక యున్న
నారు చీమలబారందుఁ ♦ జేర నేల
యహహా యీయింతివర్ణింప ♦ నలవియగునె
భవునకైనను నాళీక ♦ భవునకైన. 78

క. ఫుల్లాంబుజాక్షి కాయము
వల్లియె కాకున్న పాద ♦ పల్లవగతియుఁ

మొల్లముఁగ నఖరకోశము ♦ లుల్లసితము
లగుచునెట్టు ♦ లొదవుం దలఁపఁగ. 79

చ. తామరసాయుధప్రియగ ♦ దంతికరంబులొ పంచసాయకా
రామశరస్తబకస్థలవినూతన ♦ రంభలొ శ్రీమదిందిరా
సామజగామినీతనయ ♦ సత్కలభంబులొ హేమరత్నభృ
త్స్తామశుభాస్థలింజెలఁగు ♦ కంబములోకనకాంగియూరువుల్. 80

ఆ-వె. పద్మబాణవైరి ♦ పద మింతిచనుదోయి
పద్మనాభపదము ♦ పడఁతికౌను
పద్మసూతిపదము ♦ భామినినెమ్మోము
పద్మజన్మపదము ♦ భామనవ్వు. 81

సీ. కలికి సుధాసార ♦ కాసారమేకాక
కన్నుఁదామరదోయి ♦ గలుగుటెట్లు
తరుణి మన్మథభద్ర ♦ దంతావళమె కాక
గురుకుచకుంభము ♦ ల్గొరలుటెట్లు
చిగురాకుఁబోఁడిమే ♦ న్మొగలిపొట్టయె గాక
మేన సుగంధంబుఁ ♦ బూనుటెట్లు
కమలాయతాక్షిబం ♦ గారు బొమ్మయె కాక
పసిమిమేల్వన్నెలు ♦ పొసఁగుటెట్లు
యింతి మరుచేతిపువ్వులు ♦ బంతి కాక
యూరుతుమ్మెదబారందుఁ ♦ జేరుటెట్లు
కాంత యువచిత్తనవమృగా ♦ కర్షణాజ
శబరమాయాకురంగి యౌ ♦ చంచలాంగి. 82

చ. స్థలజలజారుణ ద్యుతివి ♦ తానవిభూతులొ దివ్యవిద్రుమా
కలితనవప్రవాళరుచి ♦ కుందళలీలల్లొ సారలోహితో

త్పలలలితప్రభావిభవ ♦ భాసురమూర్తులో నూత్న వార్ధిక్రో
ల్లలదురుసాంధ్యరాగకమ ♦ లాకళలోకలకంకిపాదముల్.

మ. వరహీరంబు జయించు దానినడుముల్ ♦ వైశద్యదంతాళియు
న్వరహీరావళి జయించు నీలతర మూ ♦ వామాక్షినూగారు నా
వరహీరంబు జయించు సత్యమిది కై ♦ వారంబు గా దెన్నఁ గా
వరహీరాత్మజ! పోలలేరెనరుశే ♦ వ న్యూర్ధులోకంబులన్. 84

సీ. లసదబ్జముల గేరు ♦ లలితాంఘ్రిపదములు
వదనకంకవిలాస ♦ వైభవములు
సారంగముల మీఱు ♦ సకియనేత్రంబులు
వేణి యానానూన ♦ విభ్రమములు
చక్రంబులను దూఱుఁ ♦ జందాస్యపాలిండ్లు
కటినాభివిస్తృత ♦ గౌరవములు
పుష్కరంబును నవ్వుఁ ♦ బూఁబోఁడిమధ్యంబు
కరనఖానంత ♦ కాంతరుచులు
కలికికన్నులు శ్రుతిపార ♦ గంబు లారు
శాస్త్రధారాగ్రిరుచిరంబు ♦ సకియమేను
తలప జ్యోతిర్విలాసంబు తన్వి ♦ తనువు
విద్యులమయంబు నడుమే య ♦ విద్యగాని. 85

క. శ్రీలాకర్ణంబులు మగ
రాలా పల్వరుస బొంగ ♦ రాలాకుచముల్
మీలా కన్గవ మదనుని
వాలానూఁగారు నెన్న ♦ వరవర్ణినికిన్. 86

వ. ఆమెసౌందర్యాతిశయంబులు వర్ణింపఁ బక్షిమాతుండ
నేనెంతకుఁ జాలుదు ? నేమేల ? యన్యు లెవ్వరు నిచ్చట లేరు గదా
యని నలువంకలు పరికించి డగ్గఱి మెల్లన నిట్లనియె. 87

—* ప్రిభావతి వ్రాసిన యుత్తరము ప్రద్యుమ్నునకుఁ జూపుట *—

ఉ. ఆకలకంఠకంఠి భవ ♦ దంచితరూపవిలాసవిభ్రమా
స్తోకగుణావళి న్వినుచుఁ ♦ దోరపుమోహముఁ జెందిదుస్సర
వ్యాకులమానసాంబురుహ ♦ మైవిరహాంబుధిలోనఁ దేలిసీ
రాకయ గోరి పంపె నను ♦ రంజితభూషణ మంజుభాషణా. 88

వ* అని తనకంఠప్రాంతరంబుఁ జూపిన విస్మయానందాభిలాషలు ముప్పిరిగొనఁ జివాలున లేచి రాజహంసంబు కంఠంబుఁగవుంగిలించి దువ్వి ముద్దిడి మురిపంబు మెఱయ నాముద్దులరాచకొలంపుఁబులుఁగురాపట్టీ! తొలువేలుపుల కొలపుదు నెదారిగారాబు ముద్దుపట్టి నాకం పినకమ్మ నెందుఁబెట్టితి వని లాలించి యడుగుఁడుఁ బతాంతరంబు లన్వేషించుచు వీక్షించుచుఁ గానక కాలయాపనంబునకు నోరువం జాలక విసువుచు నొక్కపక్కం జక్కపఱపంబడి యున్నలేఖం గనుంగొని లేఖర్షభవల్లభతనూజాతుం డపరిమితానందంబునం బొంగుచు దృఢగ్రంధిబంధంబుల విప్పి భద్రముద్రికల నెడలించి పత్రికం దెఱచి చూచి చదువుకొని తన నర్మసఖున కిచ్చిన నతండునుం జదువం దొడంగె. 89

సీ. శ్రీమత్సురాసుర ♦ స్తోమపూజితుడైన
ప్రద్యుమ్నరాట్పాద ♦ పద్మములకు
సకి ప్రభావతి నమ ♦ స్కారముల్గావించి
వెలయవ్రాయంగల ♦ విన్నపములు
భవదీయరూపసౌ ♦ భాగ్యవిక్రమములు
రాయంచచేత ని ♦ రంతరంబు
వినుచు నీయందునా ♦ మనమును గీల్కొల్పి
యన్నపానాదుల ♦ నైనఁగొనక
మంజులాలాపగానసం ♦ పదలు వినక
మణివిభూషలు దాల్పక ♦ మంతనమునఁ

దనువుఁదాలిచి యుంటినీ ♦ దర్శనంబు
గానియెడ మేనిపొత్తొల్ల ♦ సూనబాణ. 90

—* ప్రద్యుమ్నుఁడు ప్రభావతిని జేరిమించుట *—

వ* అని చదివిన నప్పలుకులు తాను జదివికొనినదానికంటె నతి మధురమనోహరంబులై ములుకులవలె నాటిన మనం బవిసి యనిర్వాచ్యం బగు నొక్క తెఱవునబడి పరువిడిన నల్లనఁ గన్నుల మూసి కుదురుపఱచి కొంతవడి యక్కాంతం దనహృదయదర్పణాంతరంబున నిలిపి మరాళరాజవర్ణితంబు లగు సర్వావయంబుల సౌందర్యంబు మనోదృష్టి నుండఁజూచుకొని యానందించి యాలస్యంబైన నిట్టినిర్బంధంబున నాలేమ కోమలాంగకంబు లెంత గాసింబడునో యనువగపున నామెం బనిచె ననునస్మితలోచనుండై ప్రకృతావస్థం బ్రవేశించి యాభామామణియందుం గలప్రేమాతిశయంబుం భరింప నోపక రాజహంసంబుతో నిట్లనియె. 91

సీ* ఏలీలఁ గనఁబోలు ♦ బాలేందుసమఫాల
విమలవిద్యుల్లతన్ ♦ విలసనములు
ఏలీలఁ జెవిఁ గ్రోలు ♦ నాలాలితాలాప
పరభృతాభినుతాభి ♦ భాషణములు
ఏలీల విడఁజాలు ♦ బాలమైపూఁదీఁగ
లోలలోలంబకా ♦ లోకనములు
ఏలీలఁజనఁజాలు ♦ నీరేలు నలుజాలు
చంద్రాతపాభీల ♦ సాంద్రరుచులు
అనుచు వలవంత నలుదెస ♦ లనుచుఁగుదురు
పడుచుఁ జెమ రార్చుకొనుచు గ ♦ స్సడుచుకొనుచు
వడఁకుచును మేనిపులకల ♦ నడచికొనుచు
నఖునిచే యూఁదిలేచి ని ♦ శ్చలతఁబొంది 92

క॥ అనుకూలంబగుసమయం
బనువేచిపురంబు చొచ్చి • పుణ్యాజనవరే
ణ్యుని మది మెప్పించి భవ
న్మనోబ్జ మలరింతుననుచుఁ • దానుఁ జెదయన్. 93

వ॥ ఇంతియు గాక యచ్చటికి మేమును వచ్చుసమయంబు నిరీక్షించుచుఁ దనుజకన్యకం గనుంగొనుచుఁ దలలో నాలుకవలె మెలంగుచు నామెయంతఃకరణరీతులఁ బరికించుచు భావంబున స్నేహంబుఁ బాదుకొలుపుచుఁ బురాణేతిహాసంబుల బోధంబు గావించుచు ననన్య గోచరం బగు మంత్రవిధానంబున మెలంగునది యని పంచిన. 94

—: రాజహంస వజ్రపురమున కేగి ప్రద్యుమ్నుని వృత్తాంతము చెప్పుట :—

చ. వినయము మీఱుచుండయదు • వీరునివీడ్కొని వేడ్క మీఱ గొ
బ్బున వినువీధిపై కెగసి • భూరిబలంబునఁ బాఱి హంసి తాఁ
గనుఁగొనెఁ జంద్రకాంతమణి • కాంచనసంచితభిత్తియోగముఁ
ఘనతరదైత్యరాజవర • కన్యకసౌధవరాగ్రభాగముఁ. 95

వ॥ కాంచి సమయంబు నిరీక్షించు చుండుసవసరంబున నక్కాంత ప్రద్యుమ్నుని యందలి మోహాతిరేకంబున సఖీజనంబుల నొల్లక మదనవేదనాదోధూయమాన మానసాంబూరుహ యై హంసావతంసాగమనంబు నిరీక్షించుచు సౌధాగ్రస్థాలకంబున నేకాంతంబున విహరించుచుండ నమ్మానస సౌఖంబును నమ్మానినీమణిం దూరమ్మునఁగాంచి యిదియే సమయంబనిదరియసం జను దెంచి నిలువంబడి యుండ నయ్యసుర రాజకన్యకాలలామయు వికసితముఖారవిందయై యిట్లనియె. 96

క. ఆర్యనుత సీవు పూనిన
కార్యంబును దెలుపఁగదవె • కాదో ఫలమో
ధైర్యంబు నిలువ కున్నది
శౌర్యాత్మజుఁ డేమి యనియెఁ • జయ్యనఁ జెపుమా

వ. అనిన నయ్యంబురమురాళం బిట్లనియె. 98

ఉ. వచ్చును బద్మబాణుఁ డన ♦ వద్యచరిత్రుఁడు నేఁడొరేపొ తా
మెచ్చును నీదుమూపసద ♦ మేయగుశాళుల నాకు గౌరవం
బిచ్చును సంతసించి జల ♦ జేక్షణ నెమ్మదిలోన నమ్ము నీ
సచ్చరితంబు భాగ్యమును ♦ సర్వముఁజాలఫలించెఁగన్యకా. 99

వ. అనిన నక్కాంత సంతోషతరంగితాంతరంగయై యిట్లనియె. 100

సీ. ఏదారిఁ గనుఁగొంటి ♦ వాదారితారాతి
పట్టణంబు జితారి ♦ ఘట్టనంబు
నేభంగిఁగనుఁగొంటి ♦ వాభంగితారీశు
మదిరంబు విచిత్ర ♦ సుందరంబు
నేమార్గమునఁ గంటి ♦ వామార్గశుభవస్తుఁ
జంద్రశాల జితామ ♦ రేంద్రశాల
నేచందమునఁ గంటి ♦ వాచందనాభిఖ్య
శంబరారిని భోగ ♦ శంబరారి
జటులనటవిట గాయక ♦ పటలవీర
భటఘటితవందిమాగధో ♦ ద్భటభటాళి
తలితు దర్శన మెట్లబ్బెఁ ♦ దెలుపవమ్మ
రమ్యగతి మించ నాముద్దు ♦ రాచయంచ. 101

వ. అనిన విని యక్కలహంసయాన కిట్లనియె. నేనట్లు నీవలన సెలవు గొని పశ్చిమాభిముఖినై చనిచని చరమ సముద్రంబులోన ద్వారకాపురంబుఁ గాంచితి. దాని శృంగారంబు వివరించెద నించుక యవధానంబున నాలింపుము. 102

సీ. మహీ మహిళాశిరో ♦ మణిరత్నరంజిత
నూపురం బద్వార ♦ కాపురంబు

విపులగ దాగ్రిజ ♦ విజయలక్ష్మీబాలి
కాపురం బద్ద్వార ♦ కాపురంబు
తప్తచామీకర ♦ సప్తశాలాశ్లిష్ట
గోపురం బద్ద్వార ♦ కాపురంబు
పద్మాదినవనిధి ♦ సద్మాళివిజితాల
కాపురం బద్ద్వార ♦ కాపురంబు
భూరధాత్రీసముద్భవా ♦ నీతలలిత
సకలదిగ్దేశభూపాల ♦ చక్రిజనిత
షోడశసహస్రశతముఖ ♦ సుందరులకుఁ
గాపురం బెప్పు డద్ద్వార ♦ కాపురంబు. 103

సీ. ఏవంకఁ గన రింఖ ♦ దేణాంకరత్నాంక
మహిసముట్టంకిత మందిరమ్ము
లేదండఁ గనఁ జండ ♦ వేదండరథకాండ
కోదండధరచమూ ♦ కోటికోటి
లేచెంతఁ గన వింత ♦ నిందిందిరాకాంత
పారిజాతలతాంత ♦ పరిమళంబు
లేసీమఁ గన రామ ♦ హేమాద్రిసురధామ
సత్కామినీమణీ ♦ సముదయంబు
వెలయ దేవేంద్రపురమును ♦ వెక్కిరించి
దివ్యకౌబేరపురమును ♦ ధిక్కరించి
మెఱయు నవరత్న రత్నచా ♦ మీకరాంత
కుట్టిమంబు మురద్వేషి ♦ పట్టణంబు. 104

వ. ఆపట్టణంబునందు. 105

సీ. రాజరాజికి రత్న ♦ రాజితస్తంభాగ్ర
మణిదీపకోటులు ♦ మలయుచుండ

శ్రీమించి చెలఁగు జే ♦ జేమ్రానిక్రొవ్విరి
గుత్తులు నెత్తావిఁ ♦ గ్రుమ్మరింపఁ
దగటుబంగారుజి ♦ త్తరువుల విలసిల్లు
మణికుడ్యములు వింత ♦ మహిమఁ దనరఁ
దగుహంసతూలికా ♦ తల్పచయాందోళి
కాజాలమందందఁ ♦ దేజరిల్ల
శారికాశుకరత్నపం ♦ జరము లొప్ప
వివిధకస్తూరికాదివ ♦ స్తువులు చెలఁగ
నిలువుటద్దంబు లందంద ♦ వెలుఁగుచుండ
నరసి ప్రద్యుమ్ను దివ్యమం ♦ దిరముఁ గంటి. 106

గీ. కాంచి దర్శింప సమయంబుఁ ♦ గాంచుదనుకఁ
బ్రాంతభాగంబుననుఁ జాలఁ ♦ బ్రబలి యున్న
కుసుమకోరకఫలపత్ర ♦ విసరరుచిర
వర్ణనీయమహోద్యాన ♦ వనముఁ గంటి. 107

గీ. అందు విహరించుచుండఁగా ♦ డెందమలర
వచ్చెఁ గతిపయభటతతి ♦ బలసికొలువఁ
గాముఁ డత్యంతసుగుణాభి ♦ రాముఁ డగుచు
సారకా సారదర్శనో ♦ దారమతిని. 108

ఉ. తామరసాస్త్రుఁ డంతఁ గను ♦ దామరలం దిలకించి ప్రీతితోఁ
దామరలం గనుంగొనుచుఁ ♦ దామరసాకరమందు డిగ్గి కెం
దామరలం దెమల్చుచును ♦ దారుచుఁ బాఱుచు వచ్చిపట్టెను
ద్దామముదంబుతోడననుఁ ♦ దామరతూఁడులు మెక్కుచుండఁగన్.

వ. పట్టుకొనిన నేననేకవిధంబులగు మృదుమధురాలాపంబుల నాతనిమనంబుఁ గఱఁగించి సందేశంబుం దెలిపిన నతఁడత్యంతా మోదభరితాంతరంగుఁడై యిట్లనియె. 110

శా. ఏమేమీ దనుజాధినాథసుత దా ♦ నీలీల నిన్నంపెనా ?
మామీఁదం గలకంఠకంఠి కెదఁబ్రే ♦ మం బగ్గలం బాయెనా?
శ్యామారత్నము కింకరీజనము వ ♦ శ్యంబై దిటం బిచ్చెనా ?
సామాన్యంబిది గాదుఁ దెల్పఁగదె వా ♦ చాప్రౌఢిదీపింపగన్.

క. అని ప్రద్యుమ్నుఁడు పలికిన
విని ముదమొదఁగదురఁ జనిన ♦ వృత్తాంతంబున్
వినుమని మృధుమధురవినూ
తనమాధ్వీధార లొలుకఁ ♦ దగ నిట్లంటిన్. 112

ఉ. ఏమని విన్నవింతుఁదర ♦ ళేక్షణ నిన్వినునాఁటనుండియున్
బ్రేముడిమాటలైనఁ దన ♦ వీనుల సోఁకఁగనీయ దెంతయున్
సోమరిగాముపట్టుగటిఁ ♦ జూచుచు నన్నము నీరు నానదా
కాముని శాతకాండపరి ♦ ఖండితమానసపుండరీక యై. 113

సీ* ఏలోకమును జూడ ♦ నీలోకమే యంచు
సాలోక్యసంసిద్ధి ♦ జరుపఁ గోరు
ఏమాట లాలింప ♦ నీమాటలే యంచు
సామీప్యసంస్థితి ♦ జరుపఁ గోరు
ఏరూపు గనుఁగొన్న ♦ నీరూపమేయంచు
సారూప్యసంగతి ♦ జరుపఁ గోరు
ఏయోగిమును గన్న ♦ నీయోగమేయంచు
సాయుజ్యసంప్రాప్తి ♦ జరుపఁ గోరు
అకట యొది యాత్మ గనుఁగొను ♦ నదియె యెల్ల
యాత్మనీయాత్మ యని యైక్య ♦ మునఁ గోరు
బాల యేవేళ నీలీలఁ ♦ జాలిఁ దూలి
సర్వమును నీవె యనిమది ♦ సంస్మరించు. 114

క. అని విన్నవింప నాతం
డనుమోదము మెఱయ రత్న • హార మొసంగెఁ
గను మని చూపుచుఁ గమ్మం
గనుఁగొనుమని చూపెఁ దనదు • కంఠాంతరమున్. 115

వ. ఆవిశాలాక్షియు నవ్విహంగపుంగవు కంఠపత్రాంతరంబుల ఛన్నంబై యున్న కమ్మ గైకొని కనుకమ్ముల నద్దుకొని నీకుం బ్రత్యుపకారం బేమిగా నొనరింపం గలదాన నని యొక్కరత్నకంకణంబుఁ బారితోషికంబుగ నొసంగి వీడ్కొలిపి యద్దనుజరాజపుత్రికయు నప్పత్రికారత్నంబుం జదువుకొని పరమానందంబునం దద్వృత్తాంతంబు ప్రాణసఖికెఱింగింప నరిగెను. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం దెలిపిన నాతం డవ్వలికథ యనుగుటయు. 116

చ. విహితసురాసురేంద్రఘన • వీరసమావృతభోగిభోగవే
ష్టితధృతవామదక్షిణ వి • శేషచరద్గురుమందరాద్రిఘూ
ర్ణితవరదుగ్ధసాగరవి • నిర్మలతుంగతరంగరంగభా
సితవరగర్భనిర్భరవి • శిష్టయశఃప్రభవైశ్యశేఖరా. 117

క. ప్రేమాతతభామామణి
కామా వరభోగధామ • గంభీరగుణ
స్తోమా ఖలభీమా శుభ
సీమా వేంకాంబగర్భ • సింధుసుసోమా. 118

కవిరాజవిరాజితము. వినయవిశారద శారదనీరద • విశ్రుతశాశ్వతకీర్తిధరా
వినుతజనావన సంతతపావన • విష్ణువిభావన పాపహరా
ఘనసుగుణాకరవక్త్రసుధాకర • కాంతివిభాకరధైర్యధరా
మనసిజసుందరభోగపురందర • మంగళమందిరచారుకరా.

ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసరసకవితాసామ్రాజ్య ద్రావిడ
శాఖాపస్తంబసూత్ర కౌండిన్యగోత్ర శ్రీమదోరుగంటి
కులపవిత్ర జోగిశాస్త్రినందన మాంబాతనూభవ
శ్రీరామకృష్ణార్జుననారాయణీయత్ర్యర్థి
ప్రబంధాధిబంధుర ప్రబంధరచనా
వైభవ సోమశేఖరకవి ప్రణీతం
బైన శ్రీ ప్రభావతీ పరిణ
యం బను మహాప్రబం
ధంబునఁ ద్వితీయా
శ్వాసము.





శ్రీరస్తు

# శ్రీ ప్రభావతీ పరిణయము.

## తృతీయాశ్వాసము.



శ్రీరాజితగుణభాజా-నారాయణసుప్రసాద • నవకవిభోజా
సూరిజనకల్పభూజా-శ్రీరంజితరామకృష్ణ • శిష్టతనూజా. 1

వ. అవధరింపుము శ్రీశుకయోగీంద్రపుంగవుండు పరీక్షిన్నరేంద్రచంద్రునకు నిట్లని విన్నవింపం దొడంగె. 2

— వసంత ఋతువర్ణనము —

ఉ. సంతస మొప్పఁ దోఁచెను వ • సంతము మంజులకోకిలస్వనా
క్రాంతము కోరకప్రకర • కాంతము బంభరగానశోభితా
శాంతము సర్వమంగళని • శాంతము మోఁచితమానమానినీ
స్వాంతము ధూతసత్పథిక • శాంతము ఫుల్లలతాంతతాంతమై.

సీ. పతితపాండురచిత్ర • పత్త్రవిలాసంబు
చారుసుధాస్తీర్ణ • సభయు గాఁగ
మండితపున్నాగ • కాండకాండస్థితి
శాతకుంభస్తంభ • సమితి గాఁగ
వాసితావృతలతా • వాసంతికాపాళి
పటువితానవితాన • పటిమ గాఁగ
ప్రాంతభాగస్థలీ • ప్రచురపల్లవజాతి
చిత్రచిత్రాదర్శ • చయము గాఁగ

నంతరాంతరకలితల • తాంతసమితి
చారుమాణిక్యదీపసం • చయము గాఁగ
మదనసభాస్థలి యనఁగనా • మని చెలంగె
లలితకేళీవనంబు శ్రీ • విలసితంబు. 4

శా. ఆకేళీవనిఁ హంస చెప్పినశుభ • వ్యాహారలీలారసో
ద్రేకాంభోధి మునింగి తేలుచు మహా • ధీభూతచిత్తాబ్జయై
లీలోద్యానవనాంతరంబునకు వ్యా • లోలాంఘ్రిపంకేజయై
కేళీలోలవిలోలలోచనలతోఁ • గ్రీడింపగా వచ్చుచున్. 5

సీ. కమలాకరముచూడ • రమణీమణులతోడఁ
గేళికావనికి నే • నేల చనితిఁ
జనినంతలోన న • వ్వనగాజలోనికి
లీల హంసంబుతా • నేల వచ్చె
వచ్చినఁ జక్రాంగ • వరమును గొంచురా
నీలోత్పలాంబకు • నేల తెలిపె
తెలిపినయంతనే • యలవానిఁ బతి గాఁగఁ
తెలియరో యిట్టులా • సింపఁదగునె
ఆసపడుమాత్రఁ దాఁ దెత్తు • ననుచుఁ జనియెఁ
గాని ఖగమేడ ? ఘనరాజ • కార్య మేడ ?
రాకయదియేడ ? యుభవల • రాజుమేటి
ధాటి కివ్విధమున బోఁటి • తాళుదాన. 6

వ. అని మోహావేశంబున దురంతచింతాక్రాంత సంతాపిత హృదయారవిందయై శుకపికంబుల కలకలంబులకు సైరింపం జాలక మఱియు నిట్లనియె. 7

సీ. నెమ్మితోఁ బెంచిన • నీలకంఠంబులు
బెగడొందఁ గేకలు • వేయఁబొడఁగఁ

బ్రమదావనమరంద ◆ పాళిచేఁ బెరిఁగిన
యళులు ఝుంకారము ◆ ల్సలుపఁదొడఁగె
లలితబాలరసాల ◆ ఫలములఁ బెరిగిన
కోయిల ల్వికటించి ◆ కూయఁదొడఁగె
రంజిల్లుచపరంజి ◆ పంజరంబులఁ బెంచు
చిలుకలగమిరొద ◆ ల్సేయఁదొడఁగె
దైవగతి దప్పివచ్చిన ◆ ధరణిలోన
నహహా తనవారె పగివార ◆ లగుదు రన్న
పలుకుబడి యేలతప్పుఁబ్ర ◆ పంచమందు
ననుచు బలుచింత వలవంతఁ ◆ గొనుచుఁ గాంత. 8

చ. చెలులకు నించుకేని యను ◆ జెప్పక కప్పురగంధి యాత్మలోఁ
గలఁగి చకోరకేళికివి ◆ కస్వరసుస్వరకోకిలావళీ
కలకలరావపాళికిని ◆ గ్రాఁగుచు బంభరగుంభితారవా
వళికిఁజనంగవీఁగుచున ◆ వారణ వారణయాన యేగుచున్. 9

క. జోటి పరితాప మొందెను
మాటికి మాటికి మయూర ◆ మదధవళగరు
త్కోటీస్మరధాటీపరి
పాటీపాటీరనగజ ◆ పవనాదులచేన్. 10

క. పరితాపంబున నడువఁగఁ
జరణకిసలయములు గంది ◆ చస లేక సఖీ
విరహావిశేషం బెదలో
భరియింపఁగ లేక భీతి ◆ భారాలసయై. 11

వ. అమ్మానినీమణి శరీరాభిమానహీన యై నలువంకలు గలయం
గనుంగొని. 12

సీ. చూతాతికోమల ♦ జాతాగ్రికిసలసం
ఘాతాసలములోనఁ ♦ గ్రాఁగఁ జూచు
సారాతిమకరంద ♦ ధారాప్రవాహవాః
పూరాంతరమునందు ♦ మునుఁగఁజూచుఁ
గేళాకుళిమృణాళ ♦ నాళాలసత్తంతు
మాలాలి నురిఁ బూని ♦ వ్రేలఁ దలఁచు
మధురసారసపత్రి ♦ విధురసామోదోరు
మాధురసారముఁ గ్రోలి ♦ మదిఁ దలంచు
మదనుధాకకు శారికా ♦ మదమరాళ
తతులపికకు వరకీర ♦ యుతమయూర
కేకిగురుతరపికముల ♦ మూఁక కళుల
కాఁక కిల నోప లేక చా ♦ మీకరాంగి. 13

క. చెలికత్తెయ లత్తెరువుల
బలుతత్తఱ మంది వెదకి ♦ బాలామణి నే
కెలఁకులఁ గనలే కెడలం
దలఁకుచు నొకయెడ రసాల ♦ తరుమూలమునన్. 14

గీ. నేల నిలచినలేనెలఁ ♦ బోలుదాని
వానఁ గాననిలతగూనఁ ♦ బోనిదాని
దవ్వుదవ్వులఁ గాంచియ ♦ వ్వావ్వుఁబోండ్లు
లీలఁబరువిడి తమకేలఁ ♦ గేలుపూని. 15

సీ. మాతంగసంగతి ♦ మధుపాళు లొకవంక
ఝుంకార మొనరించి ♦ చౌకళింపఁ
బంచమధ్వని మీఱఁ ♦ బరపుష్టతతులొక్క
యెడఁ గూడుకొనికన్ను ♦ లెఱ్ఱసేయఁ

బ్రికటపలాశోరు ♦ శుకముఖులోకయోరఁ
గోపరసంబు ము ♦ క్కనసెదాల్ప
వరమహాత్తరులను ♦ వంచించువనశిఖి
గణ మొక్కయెడఁ బ్రిజఁ ♦ గాకపటప
బాంధులను ఘోరవిరహాతా ♦ పాంథులుగను
జేసి యశరీరభూతంబుఁ ♦ జిక్కఁ బఱప
వఱలు నెప్పుడు మధుమదా ♦ వనము వనముఁ
జేరఁ జెల్లునె వరసుదృ ♦ గ్వారమునకు. 16

క. అని యొకతె పలుకఁ బెగడినఁ
గనిమఱియొకమంజువాణి ♦ గ్రక్కునఁ బలికెన్
దనచతురత దనర సు
రా ననజాననతోడ మధుర ♦ వాచాఘణితిన్. 17

సీ. బ్రహ్మవాక్యజ్ఞాన పద్ధతినడిచెడు
పరమహంసలు యుక్త ♦ సరసులరయ
సతతంబు రామనం ♦ స్మరణఁ జేయుచునున్న
శుకతతి మంజువా ♦ జ్ఞికరయుతము

క. శాఖిశాఖాంతసం ♦ చారప్తి వఱలెడు
పరభృతద్విజతతు ♦ ల్వర్ణకృతులు
సూర్యసందర్శన ♦ సుప్రీతిఁ జెందెడు
కవిచక్రములు చూడ ♦ ఖగవరములు
శీతవాతాతపము లోర్చి ♦ చెలఁగుచుండు
కలితసన్మార్గగతు లెగ్గు ♦ దలఁచునటవె
బాల నీమది నింత వం ♦ తేల బేల
పూలు వనిఁ గోయుదము రమ్మ ♦ పూవుఁబోఁడి. 18

వ॥ అని మృదుమధురవచోరచనాచమత్కృతు లొలయ నాచక్ర రఁబోఁడిం బోధించి చక్కఁ బఱచి యక్కునఁ జేరిచి చెక్కుటద్దంబులు నిమిరి వేడ్కమీఱఁ దోడ్కొని చను నవసరంబున నవ్విధుముఖి పథ శ్రమంబు సహింప నోపక. 19

క. జోగుచుఁ జొక్కుచు మెల్లనఁ
జాఁగుచుఁ గై దండయొసఁగు ♦ సతినెమ్మేనన్
వీఁగుచుఁ జిత్తారభమున
దోఁగుచుఁ బూదోఁట కరిగెఁ ♦ దొయ్యలిగమితోన్ 20

క. వనితామణి కప్పుడు త
ద్వనితలుఁ గరకిసలయములఁ ♦ బ్రసవసమాఖ్యన్
జనితాదరమునఁ జూపిరి
చని తా విరహంబు మఱచి ♦ జరఁగు నటంచున్. 21

సీ. రంభను జూడుమా ♦ కుంభీంద్రసమయాన
రాజయోగ్యముదీని ♦ రాజసంబు
శ్రీనగంబును జూడు ♦ శ్రీనగవక్షోజ
యార్యప్రియానంద ♦ మై తనర్చు
సురసాలమును జూడు ♦ సురసారసానన
సుమనోభిరామమై ♦ సొంపుమించు
పున్నాగమును జూడు ♦ పున్నాగకచ యిది
పుణ్యాంగనాజన ♦ భూషితంబు
తిలక మిదె చూడు మానినీ ♦ తిలకదీని
వైభవము సర్వసౌభాగ్య ♦ వర్ణితంబు.
మాధవిని జూడుమా దీని ♦ మహిమ చెలియ
పంచజనదేవతాళినం ♦ పత్ప్రదంబు. 22

క. హేలావతి ! కేళివన
మాలాసారిణుల జలము ♦ మలఁగుచుఁ బొత్రా-
సాలావళులకుఁ గేరఁగ
బాలామణి చికురభంగి ♦ భంగుర మగు నుఁగా. 22

ఉ. మానితుఁడౌ మరుత్సుతుఁడు ♦ మాధవయుక్తుఁడు కర్ణభీష్మగ్రీ
ష్మానుగతప్రతాపము స ♦ మాప్తి వహింపఁగ ధార్తరాష్ట్రసం
తానము సంచలింప సుమ ♦ నస్తతిమీఁటి శిలీముఖోగ్రసం
ధానతఁ బాండుపత్రసము ♦ దాయము వ్రాల్చెను జూచితే సఖీ.

సీ. సారంగగమన యీ ♦ నారంగములఁ జూడు
మారంగ సరసఫ ♦ లాంచితములు
మల్లికాళి సతీమ ♦ తల్లికా యిది చూడు
వల్లికావేల్లిత ♦ పల్లవతతి
కేళాకళులఁ జూరు ♦ వేలాలసన్నారి
కేళావళులఁ జూడు ♦ నీలవేణి
కాంచనం బిది చూడు ♦ చంచలనేత్రి పు
ష్పాంచలశాఖాశి ♦ ఖాంచితంబు

అనుచు ఘనభూజరాజిని ♦ వనితచెలులు
కానిపించుచు విరహార్తిఁ ♦ గానకుండఁ
జివురులును బుష్పములు ఫల ♦ నివహములును
గోసి వడిఁ దెచ్చి యొక్కెడఁ ♦ గూడి వేడ్క. 24

సీ* చివురులన్నియుఁ గోసి ♦ చిందులాడితి మమ్మ
వనలక్ష్మి తానెంత ♦ వనటఁ గనునొ
పూవు లన్నియు రాల్చి ♦ తావు లార్చితి మమ్మ
కేళీవనం బెంత ♦ జాలి పడునొ

ఫలములన్నియు దుల్చి ♦ పర్వువెట్టితిమమ్మ
యుద్యాన వనమెంత ♦ యుడుకుగనునొ
మకరందములఁదీసి ♦ మాయఁజేసితిమమ్మ
యలరుఁదోఁటయదెంత ♦ యదరిపడునొ
చందనాచలపవమాన ♦ సంతతులను
నవిరళాభోగవిమలచం ♦ ద్రాతపముల
జోడుఁజేసికొనివసంతుఁ ♦ డీడఁబోక
యేమి గావింపఁ దలఁచెనో ♦ యెఱుగ మమ్మ. 25

గీ. అనుచు వెగ డొందురీతిగ ♦ నాడికొనుచు
నలఘుతర కేళికాశ్రమం ♦ బపనయింప
భామినీమణిఁ గూడి యా ♦ భామ లెల్ల
సరసశృంగారనవసరో ♦ వరముఁ దరసి. 26

— సరఃకేళీ వర్ణనము —

సీ. సుందర వైకుంఠ ♦ మందిరంబును బోలె
పద్మామలప్రభా ♦ భవ్య మగుచుఁ
గలితజాంబూనద ♦ కాశ్యపీధ్రమువోలె
భువనజాలాధార ♦ భూత మగుచు
సార్వభౌమాధిక ♦ సామ్రాజ్యమును బోలెఁ
బుండరీకద్యుతి ♦ పూర్ణ మగుచుఁ
గాత్యాయనీనాథ ♦ కరతరంబును బోలె
రాజీవశోభాభి ♦ రామ మగుచు
సరసహృదయావనీనాథ ♦ సభయుఁబోలె
లక్షణోపేతకవిచక్ర ♦ లలితమగుచు
నొప్పుచున్నది కంటిరే ♦ యువిదలార
దీన విహరింప ఘనయూర్మి ♦ దీఱుఁగాదె, 27

గీ. అని వనిత లాప్రభావతి ♦ ననునయించి
యీసరోవరమున స్నాన ♦ మెలమిఁ జేయ
సకలసంతాపములు వాయు ♦ సౌఖ్యమొదవు
నమ్మ ! యని కేళికై యాయి ♦ తమ్మిఁ జేసి. 28

గీ. వేణిబంధించి భూషణ ♦ శ్రేణిబిగియ
గట్టి కంచెలలంచులు ♦ దిట్టపఱచి
వలువ లటు పెట్టియొండుపా ♦ వడలు గట్టి
గొట్టములఁ బట్టి యాకొమ్మ ♦ చెట్టఁ బట్టి. 29

సీ. తమ్ములకామోద ♦ మిమ్ముఁ జేయుచుఁగల్మి
కొమ్మకాపురముండి ♦ కొఱలుచోటు
పుష్కరస్థితిఁగాంచి ♦ భూరిసత్కవితతు
లురుకుటుంబములతో ♦ నున్నచోటు
నిండారివరణవృత్తి ♦ నెనయుచు సరసత
దరని రంభాదులు ♦ దనరుచోటు
ఘనమహాత్తరులసం ♦ గతిగాంచి బహుజీవ
నాప్తిచే ద్విజకోటు ♦ లలరుచోటు
అనుచుఁ బుణ్యజనాంగనా ♦ వినుతిమించఁ
జేరి క్రీడింప మనవాంఛ ♦ తీరువేగ
రండనుచు నొండొరువులకై ♦ దండఁబూని
కాండమండలి నీరాడఁ ♦ గడగిరపుడు. 30

సీ. జలములోపల బోర ♦ గిలఁబడి యీఁదుచో
నురగకన్యకరీతి ♦ బరఁగెనొకతె
నిర్మలోదకమందు ♦ నిలచివర్తించుచో
దాక్షాయణి యనంగ ♦ దనరెనొకతె

యిందీవరాంతర ♦ మెనసి వెలంగుచో
విస్ఫుల్లికభంగి ♦ వెలసె నొకతె
కీలాలమున మన్ని ♦ కేలుదో జలరాశి
జనితాబ్జకర భాతి ♦ దనరె నొకతె
ముదమెలర్పంగ రాయంచ ♦ కొదమ నెదురఁ
దరుముకొని పోవ వాగెలు ♦ దప్పిచనిన
వాహనంబగు రాయంచ ♦ వట్టఁబోవు
భారతీదేవి యనఁ బ్రభా ♦ వతి యెసంగె. 31

క. క్షోణీతలమం దప్పుడు
రాణఁ బెలంగెను సరోన ♦ రంబని జలము
శ్రోణీ వేణీ భ్రాం
శ్రేణియుత యగుచు యమున ♦ చెలువునఁ జెలువై. 32

శా. బాలాగ్రామణియోలయోలయనుచు ♦ న్బల్మాలు గేల్దమ్ములం
గీలాలంబులు చల్లి వెల్లువలుగాఁ ♦ గ్రీడాగతిన్మున్గివే
లోలోనం జని తేలెదూరముగఁగే ♦ ల్లోయెత్తి క్షీరాబ్ధిలో
నాళీజాలముతోడ వచ్చు నలప ♦ ద్మాగార నామించుచున్. 33

క. కొమ్మొకొని శరము లొకసతి
చిమ్మఁగ నొకమందరమున ♦ చెలువున నలప
త్రిమ్మనుజల్గొని మఱలిచె
నమ్మయి చన సఖులు చూచి ♦ నగఁగొనినవ్వున్. 34

క. ఆలీల న్జలకేళి సల్పి సఖీమణులుఁ దాను ♦ దీరమునకుఁ బా
తాళంబునుండివరభుజగీలలనామణులనంగ ♦ గేరుచుఁజేరెన్. 35

చ. జలకములార్చి ముంగురులు ♦ చక్కఁగదిద్ది మడుంగు గట్టి భూ
షలు ధరియించి కంచెల గు ♦ చస్తబకంబులఁ దార్చి కన్గన

న్మెలపున నంజనంబు నిడి • మేనవలంది వెలంది గంధముం
మెలఁతుకి తెల్లరున్మదము • మీఱునిలంకృతలై చెలంగఁగన్. 36

—: సూర్యాస్తమయ వర్ణనము :—

క. జలజాతప్రియుఁ డపు డ
ప్పులజేనికి దనుజభీతి • పోవు నటంచున్
దెలుపఁగఁ జనుకైయుఁ బశ్చా
జ్జలనిధిదరి కరిగెఁ బద్మ • జాలము గుందన్. 37

సీ. ఘనసౌధవీధిశి • ఖా శ్రేణిఁ జెలిపిందు
భూరిలాక్షాగార • బుద్ధిఁ జూడఁ
బ్రాకారజాలాగ్రి • పటుకుటీరంబులు
ఒద్ధారుణాభ్రవి • భ్రమము నెఱప
సర్వపర్వతములు • స్వర్ణవర్ణము లౌట
వేల్పులు తమతావు • వెదకికొనఁగ
నతిదళో ద్యానవ్ర • తాగ్రము ల్పికకోటిఁ
జఁచత్కిసాలయ • శంకఁ బొదువ
బలసె విలసితగతి జపా • ప్రసవమసృణ
ఘుసృణసుస్థలజలజాత • కుసుమవిసర
శోణతామరసోదర • సోదరంబు
లగుచు నెగడెడు సిద్ధవ్ర • ద్ధాతపములు. 38

క. అంభోజప్రియుఁ డపు డప
రాంభోనిధిలోనఁ గ్రుంకె • నాతపపీడా
సంభూతాతిపాసా
గుంభితహరివేగవిహ్వత • గురురథుఁ డనగన్. 39

క. మందేహభటు లనఁగ నగ
సందోహము వెనుక దోఁగి ♦ సవితృఁడు దవ్వుఁ
జెందినఁ దూర్పున కరిగిన
చందంబున నీడ లపుడు ♦ సనెదీర్ఘములై.

సీ. కంజంబులకు వచ్చి ♦ కుంజంబులఁజొచ్చి
మంజులగతిఁ బుచ్చి ♦ మలఁగి మసఁగి
రాలేక త్రోవనుఁ ♦ బోలేక ప్రియు గానఁ
గాలేక కన్నీరుఁ ♦ గార్చి కార్చి
భువిమీఁదు జేకుచు ♦ దివిమీఁదఁ బాఱుచు
రవిమీఁదఁ గోపంబుఁ ♦ దవిలి తలివి
సగనవీథిని వ్రాలి ♦ మదనబాధకుఁ దూలి
వదనమెండఁగ వ్రోలి ♦ వగచివగచి

పరవిహంగముఁ గని కూడఁ ♦ బాఱిపాఱి
జోడుగాకున్న నందందఁ ♦ జూచి చూచి
విరహవేదనచేఁ గడు ♦ వివశయయ్యె
సరసి ప్రియుఁ బాసి వగ నొక్క ♦ చక్రవాక.

సీ. సాయంసమయదత్త ♦ సవితృతేజస్స్ఫుర
ద్బాడబానలశిఖా ♦ ప్రగ్రహంబొ
పరినటత్తారకా ♦ పత్రికలాపకలాప
భోగిభోగావల ♦ భూరిఘృణియొ
పశ్చిమాదేశ ♦ పాథోధితీరసం
భూతవిద్రుమకుంజ ♦ పుంజరుచియొ
విప్రమంత్రార్ఘ్యంబు ♦ విచ్ఛిన్న మందేహ
సందేహకీలాల ♦ జాలవిభయొ

వరుణశరణసభాస్థగా • వరణకరణ
కుడ్యమణిమయదర్పణ • గుప్తరక్త
పట్టవస్త్రవితానవి • భ్రాజమాన
యవనికాజాలమో యన • నలరె సంధ్య. 42

—: చీఁకటివర్ణనము :—

సీ. అఖిలదృక్కల్పిసేన • నడుమంగఁ గాలరా
వణికృతమాయాభ్రి • గణ మనంగ
మంతదేవహుఁ లంబర • మణిమీఁద వైచిన
ధూమకలంబక • స్తోమ మనఁగ
దిఙ్నటమారిషా • దిక మభ్రిపాత్రిలఁ
బఱపించునీలనే • పథ్యమనఁగఁ
బతిని గానక లోల • మతిచేత నెమకంగ
జగమెల్లఁ దిరిగెడు • ఛాయ యనఁగ
గగనభూతాలమధ్యాజ • గరసుపర్వ
వైరికంధరసంపూర్ణ • వర్ధమాన
బాలగోబాలగోపికా • లోలుఁ డనఁగ
దండిచీఁకటి భువనంబు • నిండెనపుడు. 43

సీ. గగన మన్మందిరి • గన్నులోఁ గను పట్టు
మొలకలెత్తిన మల్లె • మొగ్గ లనఁగ
శాయంతనేశలా • స్యక్షేపితతోత్తమాం
గతరంగిణీఫేన • కణములనగ
భావినిసాసోమ • పరిణయోత్సవచార
కల్పితకరదీప • గణమనంగ
దారకాలింగవి • స్తారసేవసమా
ధూతగీర్వాణాంగ • నాళి యనఁగ

గగనగోష్ఠిని శశిధర ◆ కాచఘటముఁ
బన్ని యూహించి తత్ప్రాంత ◆ భాగఘటిత
పటుతరస్ఫటికానూన ◆ ఘుటిక లనఁగఁ
గలితరుచిఁ దోఁచ నవతార ◆ కంబు లలరె.

క. పరిణతశశిగర్భంబును
ధరియించినప్రాచివక్త్ర ◆ తామరసంబుల్
బురుడించు మధువ్రతమో యన
స్థిరనింపగు చెన్నుతోడఁ ◆ దెల్పు జనించెన్.

— చంద్రోదయవర్ణనము —

సీ. ప్రాచీదిగంగనా ◆ పరిణయాగతకాల
విభుశిరస్స్థితశిరో ◆ వేష్టి యనఁగ
నైరావణారూఢ ◆ సౌరాధిరాట్ఛిరశ్చలిత
ముక్తాసిత ◆ చ్ఛత్ర మనఁగ
యామినీయవనికా ◆ గామిరాత్రినటన్న
టీహీరవరలలా ◆ టిక యనంగ
మారోగ్రజైత్రయా ◆ త్రారంభపూర్వాద్రి
ఘటితధ్వజస్వర్ణ ◆ కలశమనఁగ
మహితపూర్వదిశాగోప ◆ మానినీసు
మస్తకన్యస్తసౌధకుం ◆ భం బనంగఁ
బ్రాగ్ధరాధరశృంగాగ్ర ◆ భాగమందు
ననవద్యుతిఁ జంద్రమం ◆ డలము వెలసె.

సీ. సిరి మీఱి కైరవ ◆ శ్రేణులు వికసించె
నుడుకాంతకాంతంబు ◆ లొగిఁ స్రవించెఁ
జెలఁగ జీవంజీవ ◆ ములయామెతలుమించెఁ
జక్రవాకీతతి ◆ సంచలించె

మండితరాజీవ ♦ షండము ల్ముకుళించె
జారచోరావళి ♦ సంభ్రమించె
లలితాంపతులపాల ♦ యలుకలు విరమించె
విరహిణీసతులకు ♦ వెత జనించెఁ
జీఁకటి నశించె వార్ధులు ♦ చెంగలించె
మరుఁడు విల్లు ధరించె హి ♦ మాంబుమించె
రయలు శోభించె దిక్కులఁ ♦ బ్రభ భరించె
తార లంతంత మెల్లనఁ ♦ దార నేంచె. 47

శా. పూర్వోర్వీధరరాజితాచలముపైఁ ♦ బూర్ణాంబుజాతద్విష
చ్ఛర్వం డంకగళద్యుతు ల్మెఱయ లా ♦ స్యవ్యాప్తిశోభిల్లఁగా
సర్వాశావనిఁ బర్వెఁ జంద్రికిరణ ♦ చ్ఛాదోత్తమాంగస్థలీ
నిర్వక్త్రామరవాహినీజాతడిం ♦ డీరాచ్ఛగుచ్ఛచ్ఛవుల్. 48

—: వెన్నెలవర్ణనము :—

సీ. పరగ దుగ్ధాబ్ధిలోఁ ♦ బాల్ద్రావి శశిమేఘు
వరము నింపెడుపాల ♦ వానలనఁగ
విరహిణీసతులపై ♦ వెడలిన వెడవిల్తు
మల్లెక్రోలలవాన ♦ జల్లు లనఁగ
బడబానలపు వేఁడి ♦ కుడికెత్తి కలశాబ్ధి
పొంగారి వినువీధిఁ ♦ బొరలె ననఁగఁ
బృథుపురసౌధాగ్ర ♦ భిన్నాబ్జమండల
ధళధళనవసుధా ♦ ధార లనఁగఁ
గానఁ గాక నగేశ కై ♦ లాసరేవ
తీశలోకేశవనితామ ♦ రేశసింధు
సైంధవాంధకరిపువిభా ♦ బాంధవంబు
లప్పరంబున ధౌతచం ♦ ద్రాతపములు 49

సీ. కొండలన్నియు వెండి • కొండలై తనరారె
శరధు లన్నియు దుగ్ధ • శరధు లయ్యె
నగములెల్లను గల్ప • నగములై శోభిల్లె
దటిను లెల్లను వియ • త్తటిను లయ్యెఁ
బశులెల్ల వలక్ష • పశులై వర్తిల్లె
గోవు లెల్లను దేవ • గోవు లయ్యె
గజము లెల్లను సౌర • గజములై విలసిల్లె
రామ లెల్ల విరించి • రాములైరి
యహహా యీసాంద్రచంద్రిక • మహిమ నెన్న
నగునె యఘటనఘటనాస • మర్థశక్తి
యనుచు లోకులు వినుతింప • నలరుచుండెఁ
బండువెన్నెల నిర్భరా • జాండయగుచు. 50

వ. ఆమనోహరసమయంబున. 51

చ. జలకము లాడి ధౌత మగు • సన్నపుఁజీర ధరించి భూషణా
వలులు దొడంగి చందనము • వన్నెగఁ దాలిచి కన్నుదోయిఁగ
జ్జనమున బూని పుష్పములు • జారెడువేనలి దిద్ది చేడె చా
లెలమిఘటింపఁగాఁ బడక • టిండ్లకుఁ బోయె నునాధు లెంచగన్. 52

మ. వెల్లమడుంగు గట్టుకొని • వింతగ గంధముఁ బూసి వేనలిన్
మల్లెలదండఁ జుట్టి యురు • మౌక్తికహారములం ధరించి తా
రల్లనఁ దాఁకి సన్నవ ర • టంచు మది న్దలపోసె స్వైరిణుల్
పల్లవు లున్నతావులకు • భాసిలఁ బోయిరి పండువెన్నెలన్. 53

సీ. బంగారుకుండలఁ • బటికఁ బూసినరీతి
గబ్బిగుబ్బల మంచి • గంధములఁది

పసిపాఱుటాకుపైఁ • బొసఁగుపవ్వదపంక్తి
చాడ్పున వీఁపుపై • జడనమర్చి
వారిజంబుల నున్న • వలయంపుఁగామపూ
ల్కరణిసంఘుల్లఁబదాం • గదములుంచి
మెఱుపుపైఁ బ్రసరించు • మేఘకాంతి యనంగఁ
జెలువారఁగానీలి • చీరఁగట్టి
ఫుల్లజలజాతమున నున్న • మల్లెమొగ్గ
మాడ్కి మోమున నాసాగ్రి • మౌక్తికంబు
నెఱయఁగానచ్చెఁబ్రియునిస • న్నిధికి నొక్క
వారనీరదవేణి గీ • ర్వాణి యనఁగ. 54

వ. అట్టిమహానందసమయంబున నాపద్మిభావతి సఖీజనఁబులు చుట్టుం బరివేష్టించి కూర్చుండి వినోదంబులగు కథలు చెప్పుచుఁ గాలంబుఁ గడుపుచుండ సర్వజగంబుల నిండుకొని గండుమిగులు పండువెన్నెలలతండంబునకు బెండువడి ప్రియవిరహవేదనాదోధూయమాన మానసాంభోజయై పూసెజ్జసయింబొరలుచు లేచుచు నలువంకలు గలయం బరికించుచు నుస్సురనుచు నిట్టూర్పులు నిగిడించుచుఁ దల యూఁచుచు లచ్చిపట్టి ధట్టించి వైచుగట్టిపూవులకోరిలకు నెట్టన సైపంజాలక వాలుచుఁ దళుకులేఁజెక్కుటద్దంబుల జలజలం బరుగిడుకజ్జల సమన్వితంబగు కన్నీటి బిందువులం గొనగోట మీటి వైచుచు దురంత చింతాభరంబు సహింప నోపక చెంతనున్న సఖులలామఁ గనుంగొని యిట్లనియె. 55

క. ఇలలోఁ బుణ్యము చేసిన
జలజాక్షులు ప్రియులఁగూడి • సౌధస్థలి వె
న్నెలలోపలఁ గ్రీడింపఁగ
బలుమఱు విరహాబ్ధిలోనఁ • బడఁ బాలయితిఁ. 56

సీ. ఈచంద్రికలు గాయ ♦ నాచంద్రమణివేది
శ్రీచంద్రముఖిఁగూడి ♦ చెలఁగ వలదె
యీచకోరాచపైఁ ♦ దోఁచఁగోరిక దీఱ
నోచకోరాక్షి యిం ♦ పొంద వలదె
యీకైరవ చెలంగ ♦ నాకైరవపుసెజ్జ
జేకైరవాక్రీడఁ ♦ జొరఁగ వలదె
యీవెన్నెల వెలుఁగనా ♦ వన్నెలు ఫలింప
నావన్నెకానిమే ♦ నదుమ వలదె

యనుచు నక్కాంత గిడుఁ జింత ♦ గొనుచు వింత
వంతపడునంత శంబర ♦ హంత వేగ
శాతకాంతలతాంతోరు ♦ శరనితాంత
నిహతఁ గాఁ జేయ హోయని ♦ నెలఁత గలఁత. 57

శా. కేళీమందిరజాలజాల వివరా ♦ కీర్ణంబులై చంద్రికాం
తాళీభిత్తుల నీరుఁ జేసి ద్విజరా ♦ జాషప్రభల్చొచ్చియా
నాళీకాననవెంట సాటబడి మే ♦ నన్నాటఁగాఁ బద్మినీ
పాళిద్వేషి మహోగ్రశేఖరుని గో ♦ పప్రేక్షిచే నిట్లనున్. 58

—: చంద్రోపాలంభనము :—

ఉ. ఆదిని నాహిరణ్యహతు ♦ నాత్మ జనించి విరించిమస్తక
చ్ఛేదిశిరంబుమీఁద నివ ♦ సించి సురాధిపుపోషణంబు స
మ్మోదము మీఱఁజేసిగురు ♦ ముద్దియఁగూడిననిన్నుఁగూడఁగా
రాదు శశాంక కూడినథ ♦ రాస్థలిఁబంచమరీతి గల్గదే. 59

క. దుడుకుఁదన మేల యనడలఁ
బడఁతుల నిల్లేచ నీకు ♦ భాన్యం బఁటరా

నడుమంతరంపుఁగల్మికిఁ
దడఁబడి నీవింతత్రుళ్ళఁ • దగదు శశాంకా. 60

సీ. ప్రకటపద్మహస్తాది • పరిపాలకుఁడ వౌటఁ
గాలనేమిఖ్యాతి • ఘనుఁడ వౌటఁ
నమితతామసవిహా • పాక్షసంగుఁడవౌటఁ
దొలుఁతద్దైవతగురు • ద్రోహివగుట
బహుళకరవిస్ఫూర్తి • భాసిల్లుచుండుటఁ
గర్బురసారంగ • గతుఁడ వవుటఁ
బరగసత్సంతతి • బ్రభఁగాసిఁజేయుట
విరహారామూర్తిక్రి • ద్విభుఁడ వవుటఁ
దలఁచి చూచిననీకు న • ర్దశముఖునకు
భేద మున్నదె విరహిణీ • బిసరుహాక్షి
గురుతరౌఘతజై వాత్మ • కుండవగుచు
సమయ కుంటివి చంద్రదో • షాచరేంద్ర. 61

క. అజహత్కళంకపంక్తిని
కుజనులఁ బోషించునట్టి • కుటిలాత్ముఁడ వౌ
రజనీచరవరుఁడవు ని
న్ద్విజరా జని బుధులు పల్కఁ • దీఱునె చంద్రా. 62

క. మఱియొక పక్షపువృద్ధియు
దొరకిన నీవింతగాను • దుర్లైద వయయో
పెరుగుట విరుగుటకోఱ కని
మొఱఁగుఫుగద కుముదమిత్ర • యెప్పటికైనన్. 63

ఉ. ఘోరనిశాచరాధిపులఁ • గూల్పఁగఁగంకణ మూనినట్టియా
శౌరికిఁ గంటఁ జెందుట నో • సత్పథము న్భజయించుచుంటనో

మారునిఁ దల్లిఁ జూచుటనొ ♦ మాధవుఁ డెంతయుఁగాఁ చెఁగాకనీ
పౌరుష మెంచి కాదు విను ♦ పంకజవైరి నిశాచరాగ్రిణీ. 64

—: మన్మథోపాలంభనము :—

క. ఈరీతి మెఱయునత్రికు
మారునిఁ గడు దూఱి విషమ ♦ మార్గణములఁ బెం
పారఁ బరగించులచ్చికు
మారుని మారుని దలంచి ♦ మఱిమఱిఁబల్కెన్. 65

సీ. క్షమసుపర్వాశ్రయ ♦ చాపాన్వితుఁడ వౌట
విషమాంబకప్రభ ♦ వెలుఁగుచుంట
రహిమహోహావిశంబ ♦ రహఁగణోగ్రుఁడవౌట
సజనామవిఖ్యాతి ♦ నలరుచుంట
భోగిచూడామణి ♦ భూషితాంఘ్రుఁడవౌట
మాధవప్రియవృత్తి ♦ మలయుచుంట
మహితాసిరుద్ధకు ♦ మారాంచితుఁడ వౌట
ఖగముఖ్యగణయుతుఁ ♦ డగుచునుంట
నెంచి చూచిన నీవు నా ♦ యీశ్వరుండుఁ
దుల్య లయినను విరహాయు ♦ క్తోయజాక్షి
తతుల బాధించుఘోరపా ♦ తకమువలన
భంగ మొందితి మార క్ ♦ ష్టప్రచార. 65

ఌ

చ. తెఱవ లనాథభామినులు ♦ తీవ్రశిలీముఖకోటికోటిచే
నొఱయఁగదూయనేయు ♦ టెదియుక్తమెమేదినిదేహసౌఖ్య మం
దఱికిని నొక్కరూ పని మె ♦ దం దలపోయఁగరాదెయూరమే
నెఱుఁగనివాఁడు గాంచఁగలఁ ♦ డే పరకాయనివిష్టకష్టముల్

సీ. అళిమధు ప్రియనీగు ♦ ణానుగుణం బూను
త్కోరంపుమధుపాళి ♦ తోడఁ గూడి
గురుసుమనోమహా ♦ త్తరులగొమ్మలఁగోరు
కూరవనప్రియ ♦ కోటిఁ గలసి
సంతతంబు పలాశ ♦ సంతతిలోఁ జేరు
ఫలభంగకరశుక ♦ బలము నెరసి
సరసులు గలఁగంగ ♦ సంచరించుచునుండు
పటుతరశితపత్రి ♦ బలముఁ జెంది
వెలయ దోషాచరస్నేహ ♦ వృత్తిఁ బూని
మించి సర్వజ్ఞుతో విరో ♦ ధించినట్టి
నీకు సద్బుద్ధు లెటు కల్గు ♦ లోకమందు
మార దుర్వారవిరహిణీ ♦ వారశూల. 68

వ. అని పల్కి మలయానిలు నుద్దేశించి యిట్లనియె. 69

—: మారుతోపాలంభనము :—

క. కువలయ మల్లలనాడు
న్భువననిధులు సంచలించు ♦ బోరున సుమనో
నివహంబు వడఁకుఁ బలితో
పవనా నీ వోలయు మలయ ♦ భవనా పవనా. 70

చ. ఇలఁ గలకొండలం బెఱికి ♦ యేపున వారిధిఁ గట్టువేళ నీ
మలయముగానరాదొస్పృహ ♦ మాలెనొమారుతిగన్నతండ్రికిన్
నిలయ మటంచు భూరిదయ ♦ నిల్పెనొ గాకటులైనఁ జందనా
చలపవమాన నీయుడక ♦ సాఁగునెనీవిటుత్రుళ్ళుచుందువే. 71

క. జలజాసనుండు నిరతము
జలజాక్షులకెల్ల బాధ ♦ సల్పుదు వనుచున్

మలయానిల నిను మెసవ
న్నిలువదొర ననంతమూర్తిఁ • జేసెను గృపతోన్. 72

సీ. అఖిలద్విజశ్రేణి • కాధారమగుశాఖి
శాఖాలిభంగంబు • సల్పుచుండు
ఘనసుమనస్సులిఁ • గంపింపఁ జేయుచు
విపులపలాశపఙ్క్తి • వృక్కిబూను
సకలంబును దపించు • సర్వబకేళుఁడైన
మలినమార్గునితోడి • మైత్రి నెరపి
నిర్దయులై ప్రాణి • నివహంబు బాధించు
యామ్యకింకరులతో • నరుగుదెంచు
పాంసులాకార భువనప్ర • భంజనుండ
నీకుఁ గారుణ్య మెటు గల్గు • లోకమందు
లసదనాధావధూజన • విసరమందుఁ
దగ్గ విది యేర నీపూన్కి • బుగ్గిగాను. 73

క. ఈలాగని బాలామణి
చాలఁగ మేలాగు సడలఁ • జంద్రిక జగతిన్
గోలాహలగతి నిండిన
జాలిం బడి విరహ మోర్వఁ • జాలక మఱియున్. 74

శా. ఆమార్గంబునఁ జంద్రచంద్రికలు డా • యన్ దస్సి రాకాసుధా
ధామశ్రీసఖమైన నేత్రముపయి వ • స్త్రం బొత్తి రాగ్రత్తి యా
శ్యామా శేఖర మేడ్స్ దేవతిలదా • స్తా హాయరీగేయురీ
తీమోహీకృతవల్లకీ పటశ్శా • తీతప్రతీతధ్వనిన్. 75

చ. అంతట నీలవేణిఁ జెలు • లక్కున గ్రక్కునఁ జేర్చి కన్గవన్
దొంతరలైన బాష్పములు • దోరపుజీర చెఱంగు నద్దిమి

లుక్కంతలము లైదువుల్చి కొన ♦ గోరుల దువ్వుచుఁ గొప్పువెట్టిశ
య్యాంతరమందు నిల్చిచెద ♦ రార్చిరిచామరవాతసంగతిన్. 76

క. బాలా వేగంబే గో
పాలాగ్రణిసుతుఁడు వచ్చు ♦ ఫలియించునుగో
ర్కేలా! యీతొందరమది
బేలా! యిది సతులకెల్ల ♦ బీరముఁ జెఱచున్. 77

వ. అమ్మమ్మ కమ్మవిలుకానితళుకుఁదమ్మిలకోరీలెద గ్రుమ్మ ముమ్మ
రమ్ముగునుమ్మలమ్మున సొమ్మసిల్లినయన్నులతలమిన్నిం గన్నియలెల్లం
గనుంగొని. 78

క. ఇఁక నేమి సేయువారము
మకరాంకశశాంకమలయ ♦ మందానిలముల్
తిరికమకలు వెట్టమూర్చెలె
నకటా! యబల యని చెలియ ♦ లాదఱు వగతో. 79

సీ. కందోయి నరవిందబృందముల నమర్చి
గండమండలిని శ్రీ ♦ ఖండ మలఁది
కంధరంబున కాకి ♦ కముల్వదరత నుంచి
భుజశాఖలమృణాళ ♦ ములనుబెనఁచి
కుచకోకముల బన్న ♦ కోశంబులను బేర్చి
పాణులనవపల్ల ♦ వనములఁ దార్చి
యూరుల రంభోరు ♦ వారంబు సారించు
పదముల హల్లక ♦ ప్రతతిఁ గూర్చి
హృదయమున నవనీతంబుఁ ♦ బదిలపఱచి
యంటియాకులు వెన్నున ♦ నంటఁబరచి
కుందశయ్య శిరీషము ♦ లొప్పఁదుపఱచి
సతికి సకలోపచారము ♦ ల్సరిపిరపుడు. 80

వ. అనంతరంబ ప్రభావతిప్రియసఖి కామదేవు నుద్దేశించి మహావిధంబుల స్తుతియించి తత్ప్రసాదంబున లబ్ధసంజ్ఞయైన యక్కాంతం జూచి యొక్కింత సంతసించి రతీకాంతుఁ బూజింప నూహించి. 8

— మన్మథపూజ —

సీ. గొజ్జంగిమంచుతోఁ • గూర్చినపుష్పాడి
తిన్నెమీఁదను మాల • తీనికాయ
కాయమానముక్రింద • గేయమానవిమాన
ముగ నొక్కపూసెజ్జఁ • దగనొనర్చి
యందులో నరవింద • సుందరకర్ణిక
నిల్పి మధ్యంబున • నీరజాక్షు
తనయురూపము వ్రాసి • ఘనమృగమదమున
వలపట నుడురాజు • నలవసంతు
నిలిపి పారావతమరాళ • నికరశుకపి
కాళిపాళులసన్నిధిఁ • గీలుకొల్పి
సుందరులు పూజచేసిరి • షోడశోప
చారముల భక్తిదైవార • సరసలీల 82

సీ. ధ్యానమస్తులతాంత • ధన్వాయసతతమా
వాహనమస్తున • మ్యోమ్నహానాయ
ఆసన మస్తు సిం • హాసనసంస్థాయ
పాద్యమస్తువిరోధి • భంజనాయ
అర్ఘ్యమస్తు సితాంబు • జాక్షతనూజాయ
స్నానమస్తు రమాత్మ • సంభవాయ
చేల మస్తు సువర్ణ • చేలావృతాంగాయ
గంధోస్తుమధుశర • బంధురాయ

పుష్పనిచయోస్తు భూషణ ♦ భూషితాయ
ధూపదీపాదిసేవాస్తు ♦ దోర్బలాయ
ఫలనివేదన మస్తు శం ♦ బరహరాయ
సూనబాణాయ తుభ్యం న ♦ మో నమోస్తు. 83

వ. అని మఱియు నిట్లని ప్రార్థించి రప్పుడు. 84

సీ. నీప్రతాపస్ఫూర్తి ♦ నిండుపౌరుషమును
విడచినపార్వతి ♦ విభునకెఱుక
నీయాజ్ఞ దివిఁ బుష్పి ♦ ణీపద్మసీప్రీతి
సంగతుఁడై నట్టి ♦ సవిత కెఱుక
నీమహామహిమంబు ♦ నిఖిలగోపికలతో
నలరారుబృందావి ♦ హారి కెఱుక
నీబాణ సంధాన ♦ నియతినాళీకసం
గ్రస్తుఁడై వెలసిన ♦ స్రష్ట కెఱుక
బోటు లేపాటివారు నీ ♦ ధాటి కరయ
జందత్రిముఖిఁ బ్రోవు పద్మాక్షి ♦ సతిని గావు
మళిచికురఁ బెంచు మల్లికా ♦ హాస నెంచు
నవ్యశుకగామి చక్కఁద ♦ నాలసామి. 85

అ. గీ. మూఁడుకన్నులున్న ♦ వాఁడిశూలంబున్న
నాగసారమేరు ♦ చాప మున్న
నీదుదాడి కోడి ♦ నిఖిలేశుఁడు ను సగం
బాయెఁ గాదె మదన ♦ యబ్జవదన. 86

చ. ముది మది దప్పి లేఁత యగు ♦ ముద్దియవృద్ధునకునుసూపియా
మదవతినిన్నురూపిక న ♦ మానతఁ గూర్చినధాతచేఁతలౕ
వదలిచి తుల్యదంపతుల ♦ వావిరిఁ గూర్చెడునీమహాత్త్వసం
పదగతి చెప్ప శక్యమె కృ ♦ పానిధి శ్రీమదజాహ్వయప్రభూ. 87

ఉ. తెమ్మని పాంథకోటుల ను ◆ నిమ్ముచవర్గము నింక నుండ మో
సమ్మని జారభామినులఁ ◆ జయ్యనఁ దాఘ్రల వేగ వేగ మే
బామ్మని తెల్పుచున్నగతిఁ ◆ బోలఁ ద్రిభంగిఁ జెలంగఁ దామ్రచూ
డమ్ములకంఠనాదముల ◆ ధాక వినంబడె మందిరంబులన్. 88

సీ. కల్యాగ్నికై తెల్వ ◆ గనుశతక్రతురాణి
ముక్కునిన లరారు ◆ ముత్యమనఁగ
భానుశిక్షైకసిద్ధ ◆ పఱచినప్రాగ్వధూ
హస్తాగ్రనీరాజ ◆ నార్చి యనఁగ
తపనపురశ్చర ◆ ద్వాఃఖ్యమునీంద్ర
విలసితకర్ణకుం ◆ డలమనంగ
నాళీకబాంధవ ◆ నాశీఁమున వచ్చు
గుఱుసృతనానాయ ◆ కుం డనంగ
సవిత్రురఘుపుంగవుండను ◆ శాటరాజ
చిరనిపీడితపద్మినీ ◆ సీత కపుడు
చెలఁగ బ్రిత్యూషపవనజు ◆ చేతఁ బంపు
సొంపుముద్రిక యన వే ◆ గుఁజుక్క వొడిచె. 89

మ. వితతాభ్రస్థలకాయమానవివరా ◆ విఖ్యాతచాంద్రీలతా
తతతారావళికుందబృందములఁ బ్రా ◆ తర్మానితాంగోసిభాః
పతిఁబూజింపఁ దదాభ నామొఱసెతే ◆ వన్దెల్పు తత్ప్రాగ్బహి
ష్కృతనిర్మాల్య మనంగ దూరముగఁబా ◆ సెనాగ్రిజునిస్త్రీజుఁడై

చ. చరమదశార్ద్రవేళ వసు ◆ జాలముల న్దనయుందు డాచితా
జరిగి మహోదయాప్తిఁగని ◆ చయ్యన మిత్రుఁడు రాఁగదీపము
ల్విరసత తద్వసు ల్విడిచి ◆ వెల్వెలఁబాఱెను నిక్కలే కదా
ధరణిని స్నేహభంగకర ◆ ధర్మము లాత్మఁదలంచి చూచినన్.

మ. అరవిందాలయ సాంధ్యవేళ హిమధా ♦ మాంశూరుదాసావళీ
వరసమ్మార్జితపద్మపద్మదళసం ♦ వారారవంబుల్విభా
కరగోవర్గభుజిష్యసంతతులచేఁ ♦ గర్ప్యాదిఁ దీయించి తా
మరల న్జొచ్చె ననంగ విచ్చె నలము ♦ ల్మాసన్నిధానంబులై.

ఉ. మంజులతారకాగణన ♦ మంచితతీర్థమునందుఁ గాలముఖ్
రంజిలుచక్రయంత్రమున ♦ రాగవిభాంశుపట్లై నభాన్యఁడుం
గంజవిరోధియు న్దిరుగఁ ♦ గారవిమీఁదికేఁగ్రింది కబ్బుఁడుం
రంజితవృత్తిఁ బోయిరన ♦ రాజటఁగు్రింకెనుదోఁచెనూర్యుఁడున్

సీ. ఘనతరధ్వాంతన ♦ క్రము దుంపనరుదెంచు
సమయవిష్ణునిచేతి ♦ చక్రమనఁగఁ
గాలమన్మలకాఁడు ♦ కంధిపైఁ దేల్చిన
పటురశ్మియుత హేమ ♦ ఘట మనంగ
సత్కల్యకారుండు ♦ సర్వతేజస్స్వర్ణ
పుంజరముల్గరఁగిన ♦ బూది యనఁగఁ
బ్రాగ్వనితాహస్త ♦ పద్మదళోత్క్షిప్త
కాంచనమణికందు ♦ కంబనంగ
భావిరాత్రినిశాకర ♦ పరిణయంబు
జరుప దినలక్ష్మి దిగ్వధూ ♦ జనముఁ బిల్వఁ
బాణిఁబూనినసాక్షత ♦ పాత్రమనఁగ
భానుమండల ముదయాద్రి ♦ పయిని మెరసె 94

ఉ. చీఁకటిపేరిరాజు పర ♦ సీమకు గ్రక్కునఁ బాఱిపోవఁద
త్ప్రాకచయంబు వారిభవ ♦ భవ్యగృహంబుల డాఁగ భానుభా
నీకబటాళి తోలఁగను ♦ నేడ్చుచుఁ బోయెననంగ వేగనా
ళీకచయంబుఁ బాసెఁ దద ♦ ళిప్రకరంబు రొద ల్సెలంగఁగన్

ఉ. పెన్నిధి సన్నిధి న్గనిన • పేదగతి న్బ్రియుఁ గాంచి బాష్పము
ల్గన్నుల మేన నద్దుచును • గాటపురెక్కలఁ గౌఁగిలించుచు
న్బన్నుగఁ గంఠముల్పెనచి • వైచుచుఁ బాయుచు డాయుచున్మద
భ్యున్నతిఁ బక్రివాకి వెత • వోవఁ జరించె వినోదలీలలన్. 96

వ. అప్పు డాలలనాలలామచెలియ లాతరుణీమణిం దోడ్కొని నిజభర్తృ మార్గాభ్యంతరంబునఁ బ్రవేశించిరి. అది యంతయు నాహంసావతంసంబు పరిచ్ఛన్నంబుననుండి కనుంగొని క్రమంబునఁ బూసగుచ్చిన రీతి వారిపున కెఱిఁగించిన నాగీర్వాణసార్వభౌముఁడును నొక్కనాఁటి పూర్వనిశాసమయంబున రహస్యంబుగా ద్వారకానగరీలలామంబునకుం జని యొక్కచోఁ గురంగటఁ జెలంగు మృదంగరంగన్నినాదానుకారికరంగ లోచనాలాపిత సంగీతవినోదతరంగితాంతరంగులగు యువపుంగవులం గాంచుచు నొక్కచెంత నిశాంతచయసౌధాంతరంబునఁ బ్రియోపవిష్ట హంసతూలికాకల్పితానల్ప తల్పసమీపంబునఁ జిత్రకంబళనివిష్టాష్టాపదాంగీసి నాదితవల్లకీసల్లలితపల్లవాను కారిసుధామధురగాన విశేషంబుల నాలించుచు నొక్కచాయ జగజ్జేగీయమానవినూతన నీలపట్టాంబర వితానవిరాజిత చిత్రవిచిత్రపటపటల ఘటితవిశాలపీఠికా శాలాంతరంబున శ్రీమన్మహాభాగవతాది మహాపురాణపఠనార్థావబోధకవిద్వజ్జన లలితవచోరచనా విశేషంబులకు సంతసించుచు నొక్కప్రక్క శాతకుంభస్తంభశుంభత్సౌధాంతరంబునఁ బొలయలుకలవలననలఁగి తొలంగి పోవుజలజనయనాకుచోరు వేలాంచలంబుచేఁ జుట్టి పట్టినెట్టనఁ బ్రార్థించుయువజనచాటువాక్య శ్రేణీధోరణుల కానందించుచు నొక్కయెడ నన్యభరవక్షి నీపయోధరవరవర్ణనీయ మకరికాపత్రకుంకుమ రేఖాంకిత వక్షస్స్థలసనాథుం డగునాథునిం గాంచి తటాలునఁ బడకటింటి కవాటంబు వాటంబుగా బంధించినం గాంచి యెంతబోధించిన వినకున్నఁ బూర్వసుందరీమందిరంబున కరుగ నచట ఘటితకవాటం బగుకూటంబు

గాంచి యుభయభ్రష్టత సుస్పు రనుహూర్త రసికశిరోమణిం గాంచి నవ్వుచు నొక్కపట్టున నూతనభుజంగులు దారుపునేరుపుఃగత్తియలచేతి కెక్కు నగు రొక్కంబు సంగిన నామెఱుంగుఁ బోఁడి వారల నొక్క చక్కి నుండ నియోగించి రాకపోయిన నిందుకు నందుకుం జెడివీథివీథులం దిరుగువారలం గని హసించుచు నొక్కయోర విభాసితసభామంటపంబుల రామాయణాదిభూమికానాటకగానచాతురీగాతురీతీసుదతీగీతారావంబులువిని చొక్కుచు నొక్కచోటఁ గురూపు లగుధనదాతలకు ధనాపేక్ష వృద్ధవేశ్యాజనంబుల దమ్ముం దార్చినం బోక రహస్యంబుగా యువజనశిరోమణు లగు శృంగార శేఖరులసంకేతస్థలంబులకుఁ బోవువారవరవర్ణినీవారంబుఁ గని నివ్వెఱపడుచు నొక్కయెడ నిజనాథుల నిద్రపుచ్చి కుమార్గంబులఁ బూర్వసంకేతితవిట పటలస్థలంబులకుఁ బోవుజారకుటిలాలకలం జూచి యద్భుతం బందుచుఁ దిరస్కరిణీవిద్యావిశేషంబునఁ బరులు కెవ్వరికిని నెఱుకపడక యుండఁద ప్తకాంచన ప్రత్యుప్తజలజా ప్తమణిగణఖచితచంద్రశాలల మీఁటి నవరత్నస్థగితసౌధవీధులు దాఁటి వజ్రవైడూర్యచిత్రితంబు లగుభవనేశ్వరంబుల నతిక్రమించి రాజమందిరంబున బ్రవేశించి రత్నదీపితహాటకశయ్యాకవాటంబులు వెనుకఁ బెట్టి యొక్కపరిశాంతనిశాంతాంతరంబున. 97

సీ. వీథివీథికి రత్న • వినరరంజత్సంబ
దీపంబు లొకకోటి • దేజరిల్ల
మందారకనకార • వింద జాతీబృంద
కుందాళిగ్రంధంబు • ఘుమ్మనంగ
జగడంబుపగడంబు • దగుజాలువాపట్టి
మంచంబు లొకగొన్ని • మలయుచుండఁ
జిత్రవిచిత్ర మా • చిత్రదర్పణముల
శతము లిరవ్వంకల • నతిశయిల్ల

కనకశృంఖలదోలికా ♦ గణము లమర
దాంతకాంతాసనంబుల ♦ తతుల మెఱయ
యంత్రపాంచాలికాజాల ♦ మనురుచుండ
నలరుకంసారిశయ్యాగృ ♦ హంబునందు. 98

సీ. కురువులపైఁ జూచు ♦ చరణపద్మంబులు
శ్రీరుక్మిణీదేవి ♦ సేవ చేయఁ
గర్పూరతాంబూలి ♦ కలు హస్తములఁబూని
సత్యభామాసతి ♦ సరస నొసఁగ
మంజులరుచి మించు ♦ వింజామరలఁ గొంచు
కాళింది యనుభద్ర ♦ లీల విసరఁ
బయిని జేర్చినదివ్య ♦ పాణికంజంబులు
వెలయ లక్షణమిత్ర ♦ విందలొత్త
జాంబవతి మేనఁ జందన ♦ చర్చసేయ
నాగ్నజితి ముచ్చటలు దెల్ప ♦ నవరసములఁ
దనరి యొకహంసతూలికా ♦ తల్పమందు
వెలయు చుండినగోపికా ♦ విభుని గాంచె. 99

వ. కాంచి కురంగటం జరించెడుపరిచారికాతరుణులం గనుంగొని యింక లోనికింజనం దగ దని నెమ్మనమ్మున నెన్నుకొని తిరస్కరిణిం దిగనాడి నేపథ్యాంతరంబు వెలువడినరూపకపాత్రం బోయన రూపొంది నిలచినచిత్రపుత్త్రిక యో యన నిలువంబడి ద్వారపాలికచేఁ దనరాక యెఱింగించిన నాగోపాలకులశేఖరుం డగుగోపాలుండు చయ్యనలోనికి రమ్మని యుచితపీఠంబు పెట్టించిన. 100

సీ. చక్రశోభితపాణి ♦ వక్రమేచికవేణి
దూర్వాదళశ్యామ ♦ దురితభీమ

వనమాలికావక్షు ♦ వరపుండరీకాక్షు
ఘనహీర కేయూరుఁ ♦ గలితహారుఁ
గాంచనకౌశేయుఁ ♦ గమనీయతరకాయుఁ
జూర్ణాలకలలాటు ♦ శుభకిరీటు
సౌవర్ణకటిసూత్రు ♦ సరససద్గుణపాత్రు
భార్గవీలోలుస ♦ ద్భక్తపాలు
దళితదైతేయు లలితరా ♦ ధావిధేయు
రాజగోపాల సంగీత ♦ రసికశీలు
విస్ఫురోచిష్ణు శ్రీకృష్ణుఁగాంచి
యచరనాధుండు సన్నిధి ♦ కరుగుచుండ. 101

ఉ. వచ్చెడువజ్రిఁ గాంచి యదు ♦ వల్లభుఁ డల్లన లేచి గౌరవం
బెచ్చఁగ శయ్యడిగ్గి యెదు ♦ రేగుచుఁ జేకొని తెచ్చిగద్దెపై
మెచ్చుగ నుంచి పూజ లిడి ♦ మేలరయంగ నతండు పల్కె నీ
హెచ్చగుసద్దయామహిమ ♦ నెప్పుడు మేలని తెల్పి వెండియున్.

వ. వజ్రనాభునివృత్తాంతంబును విను మని చెప్పం దొడంగె. 103

ఉ. అంచలఁ బంపఁ గా నవియు ♦ నాతనిపుత్రిక నిత్యధన్యకి
న్గాంచక రాయభారమును ♦ గూరిమి మీఱఁగ జేసె నింక నీ
సంచితశాసనంబునను ♦ జాఁగెడువాఁడ నన్ంగ శౌరి భా
వించిసురేంద్రుఁబంచిచను ♦ వేర్పడమారునిఁబిల్చియిట్లనన్. 104

వ. నీవును సాంబుండును రుక్మబాహురుక్మనేత్రులును ననిరుద్ధుండును సాత్యకియుగదుండును ద్రిలోకరహస్యతంత్రుండగు నటగ్రామణిని సూత్రధారుఁ గాఁ గొని చని వజ్రనాభునివజ్రపురంబున నటవేషులై రామనాటకంబుఁ బ్రదర్శింపుఁడు. అప్పు డాతనికూఁతురు ప్రభావతి నీకుం బరిగ్రహయోగ్య నిన్ను వరియించుం గాన దానిని గాంధర్వంబుఁ బరిగ్రహించినఁ గుమారుం డుద్భవించు నంతదనుక నట నుండుము. తన్నిమిత్తంబుఁ గా నాతండు గళహించిన వానిని

వధించి తత్కుమారునకు నందుఁ బట్టంబు గట్టి రండు పొండని నియోగించినఁ బ్రద్యుమ్నుండు ను రోయంబోవుతీవ కాలం దగిలినచందంబునం దనరెనని యంతరంగంబునం బొంగి మహాప్రసాదంబని సెలవుం గొని సాంబాదులం దోడ్కొని వెంటనే సకలనాటకసన్నాహసమేతంబుగా బయలుదేరి వజ్రనాభుని పురప్రాంతంబున కరిగె నని శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కెఱింగించిన నవ్వలికథ యెట్టిదనుటయు.

క. ప్రేమాతతభామామణి
కామా వరభోగధామ ♦ గంభీరగుణ
స్తోమా ఖలభీమా శుభ
సీమ పైఁడాన్వవాయ ♦ సింధుసుసోమా. 106

చ. కరుణరమాపతీ లసద ♦ ఖండవిభూతిసతీపతీ మహా
సురచిరభోగదేవపతి ♦ సుందరవక్త్రనిశాసతీపతీ
సరసతసత్యవాక్యగతిఁ ♦ జంద్రమతీసుదతీపతీకృతీ
స్థిరమతివేంకటాచలప ♦ తీ సుకృతీ నవమన్మథాకృతీ. 107

మాలిని. సలలితగుణసాంద్రా ♦ చారువాచాఫణీంద్రా
బలహసితమృగేంద్రా ♦ భవ్యభోగామరేంద్రా
కలితజవఖగేంద్రా ♦ కాంతతేజోమహేంద్రా
విలసితరుచిచంద్రా ♦ వేంకమాంబాసుతేంద్రా. 108

ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసరసకవితాసామ్రాజ్య ద్రావిడ
శాఖాపస్తంబసూత్ర కౌండిన్యగోత్ర శ్రీమదోరుగంటి
కులపవిత్ర. జోగిశాస్త్రి నరసమాంబాతనూభవ శ్రీ
రామకృష్ణార్జున నారాయణీయత్ర్యర్థి ప్రబం
ధాదిబంధుర ప్రబంధరచనావైభవ సోమ
శేఖరకవి ప్రణీతంబైన శ్రీప్రభావతీ
పరిణయంబను మహా ప్రబంధం
బునఁ దృతీయాశ్వాసము





శ్రీరస్తు

# శ్రీ ప్ర భా వ తీ ప రి ణ య ము.

## చతుర్థాశ్వాసము.



శ్రీరమ్యహారహీరప
టీరసుధాసారపూర ♦ డిండీరశర
న్నీరదనారదపారద
శ్రీరంజితకీర్తివైశ్య ♦ శేఖరమూర్తీ. 1

వ. అవధరింపుము శ్రీశుకయోగీంద్రపుంగవుండు పరీక్షిన్నరేం
ద్రచంద్రునకు నిట్లని వక్కాణింపం దొడంగె 2

సీ. ప్రద్యుమ్నుఁడటురుక్మ ♦ బాహుసాంబాదుల
తోఁ భద్రగతివజ్ర ♦ నాభపురముఁ
జేరి యచ్చటఁ దగు ♦ వారిమైత్రిఘటించి
తన్నియోగంబునఁ ♦ దాను రామ
వేషంబు ధరియించె ♦ నెలయించె లక్ష్మణ
వేషంబు సాంబుండు ♦ వింతగొలుప
నొకవారసతి దాల్చె ♦ నుర్వీసుతావేష
మింకఁ దక్కినవార ♦ లెల్లరుచిత
వేషములు దాల్చిరిమ్మాడ్కి ♦ వివిధశక్తి
యుక్తులగువార లందఱు ♦ త్యుత్తమముగ

రామనాటక మాడి యా • రాత్రిచరుల
మెప్పు గాంచిరి యేమని • చెప్పవచ్చు. 3

వ. తత్సమయంబునఁ దద్విలోకనార్థ బాహుతంబై యరుదెంచిన పాతాళలోక నివాసవృద్ధ పూర్వగీర్వాణవర్గంబత్యంతానందభరితంబై సభాసదులను విలోకించి. 4

ఉ. వేసము గాదు చూడ రఘు • వీరుఁడితండు నిజంబురూపమున్
హాసవిలోకనస్వరవ • దాననేత్రభుజప్రకోష్ఠముల్
మీసము నొక్కరూపుగన • మేదిని వేసము లెన్నిచూడమో
వాసవవైరులార! యన • వారును జోద్యముఁజెందిరత్తఱిన్.

వ. అనంతరం బిది యంతయు వజ్రనాభుండు విని వారలం బిలిపించి యంతఃపురంబున నాటకప్రదర్శనంబునకు సెల విచ్చిన నవరత్నఖచిత సౌధాంతర పట్టవితాన రంగదభంగ విశాలరంగస్థానంబున నాటకంబును బ్రదర్శించిరి. అందు వెనుకటి యట్ల శ్రీరామవేషంబు ప్రద్యుమ్నుండును లక్ష్మణవేషంబు సాంబుండును సీతావేషంబు వారవధూరత్నంబును దాల్చిరి. మఱియు సాత్యకిమృదంగంబును రుక్మబహురుక్మ నేత్రానిరుద్ధగదాదులు వేణువీణాతాళశ్రుతులును నిర్వహించిరి. ఆసమయంబున నది గంధర్వాదిగానంబులమించి వెలుంగ జగదంబగన్న ధింజరుగు మహానటకైటభారిహాటకగర్భఖేటాధిపాదిమేళంబు నతిక్రమించి వెలుంగ దైత్యదానవగంధర్వ యక్షసిద్ధాదులు మూర్ఛిల్లిరి; తాలుగరంగె; మోడులుచిగిరించె; బాలురును మేను లెఱుంగ కుండిరి అప్పుడు తద్దనుజనాథుండు కనకాంబరమణిభూషణశ్రేణులు కానుకగానొసంగె. ఆసమయంబునఁ బ్రభావతి వారలం జూచి యాశ్చర్యపడుచుఁ జెంత నున్నశుచిముఖిం గనుంగొని రామవేషంబు ధరియించిన వానిం జూపి యల్లన నిట్లనియె. 6

సీ. శారదోదయఫుల్ల • సంచరద్భృంభర
కమనీయపుండరీ • కములకంటెఁ
జారుశరన్నిశా • సమయషోడశకళా
సంపూర్ణుఁడై మించు • చంద్రికంటె
నిందీవరాళీపు • రందరసుందర
మణిచాకచక్యధా • మములకంటె
ఘనతరోన్నతపూర్వ • కకుబంతవిభ్రాంత
సమదభద్రేభతుం • డములకంటె
నితనికన్ను లొప్పు • నీదొరమోమొప్పు
నితని కాంతి యొప్పు • నితనిభుజము
లొప్పు నితఁడెవండొ • చెప్పుమానాముద్దు
రాచయంచప్రేమ • రసముమించ. 7

వ. మఱియును— 8

సీ. రమియింప వలదె యీ • రాజశేఖరుతోడ
క్షితిసతియైజనిం • చినఫలంబు
భోగింప వలదె యీ • పూర్ణకళానిధి
కడిదిసద్రూపంబు • గన్నఫలము
సేవింపవలదె యీ • శ్రీపుండరీకాక్షు
జలజాతపాణినై • జనినఫలము
చర్చింపవలదె యీ • చతురాస్యుతోడను
సరసవాణియనంగ • జరుగుఫలము
బళిర యితనిజనని యెంతో • భాగ్యరాశి
భువిజనకుఁ డెంతపురుషోత్త • ముఁడొ దలంప
నిట్టిరూపంబు గంటిమే • యెన్నఁడైన
డంబు చెలు వొప్పమూఁడులో • కంబులందు. 9

సీ. చటులసంధ్యాకాల • నటదర్ధతారకా
ధవమౌళిదివ్యతాం • డవముకంటె
రాసకేళీమహో • ల్లాసగోపకవేష
నళినాక్షువేణుగా • నంబుకంటెఁ
జారణతుంబురు • నారదపర్వత
గంధర్వసంగీత • కలనకంటె
నిఖిలశ్రుతిస్మృతి • నిక్వాణసంగత
భారతీవీణార • వంబుకంటెఁ
గలిత మగుచును లాస్యస • మ్మిలిత మగుచుఁ
దరుపులు చిగుర్ప నీరుగా • శిలలు గరుగ
రంజిలెఁగరంబు నీమహా రాజవేషి
గీతిచాతుర్యమహిమంబు • రీతి వెలయ. 10

గీ. మందరంబున గీరంబు • మాడ్కిఁ జెలఁగు
మధ్యమంబున మదపిక • మహిమ దనరఁ
దారకంబునఁ గేకిచం • దమున వెలయు
నహహ వీరలగానంబు • నగునె పొగడ. 11

ఉ. బాణకుమార మారగురు • పంక్తిముఖాదులకంటెఁ జోద్యమా
రాణఁ జెలంగ నీచతుర • రంగదభంగమృదంగనాదముఁ
గాణకు నెక్కె నల్దెసలు • గప్పెఘుమంఘుమరావయుక్తమై
నాఁటె మెలర్పనీమహితు • నామము దెల్పుమరాళసత్తమా. 12

క. ఇన్నరవరకిన్నరవర
పన్నగవరసుతులకైన • భావింపంగా
సన్నరవరసుతులకునీ
సన్నుతగానంబు రూప • సంపద గలదే. 13

క. అందంబై యళిగానము
చందంబై యమృతపూర • సారససారా
స్పందంబై తుదిబ్రహ్మా
నందంబై చెలఁగె నహహా • నవరసఫణితిన్. 14

క. శ్రీరామసుతునకై నను
శ్రీరామునిసుతుల కైనఁ • జింతింపంగా
శ్రీరామసుతుల కైనను
నీరామసుగీతికలన • యేర్పడఁగలదే. 15

వ. కావున నీరాజవేషి మన్మనోహరుఁ డనకముండె నితనికు
లంబు బలంబు నెఱింగింపు మనిన నాశుచిముఖి యిట్లనియె. 16

సీ. ఎవ్వఁడు జగదీశ్వ • రేశ్వరుసర్వజ్ఞుఁ
బగబూని తెగఁగొట్టి • సగముఁ జేసె
నెవ్వఁడు జగముల • నేపార నిర్జించెఁ
గమ్మవింటను బుష్ప • టమ్ములగముల
నెవ్వఁడు బ్రహ్మత్వ • మెనసినధాతను
రమ్యరాజీవసం • గ్రస్తుఁజేసె
నెవ్వఁడు హంసమై • నిస్వాటిల్లెడువేల్పుఁ
బుష్పిణిఁ బద్మిని • బొందఁజేసె
నట్టినవమన్మథుఁడు కమ • లాంబకుండు
వనజనేత్రుండు మదకీర • వాహనుండు
హరితనూజుండు ప్రద్యుమ్నుఁ • డనెడువాఁడు
విను చిగురుఁబోఁడి యీరాజ • వేషిసుమ్మ. 17

వ. ఇతండు భవదర్థంబు నీవేషంబున నిచ్చటి కరుఁదెంచె. తది
తరులైతనియనుజన్ములనిన నితని నెప్పుడు మనమేడకుం దోడ్కొని

వచ్చెద వని దీనాలాపంబుల నడిగిన నది యిట్లనియె. రేపటిరాత్రి నిత
నిం దోడ్కొనివచ్చెదననిన నాప్రభావతి యాదినంబును గల్పకల్పంబుఁ
గా జరుపుచుండె నంతఁ దెల్లవాఱిన నాటకులు రాక్షసరాజువలనఁ గాను
కలంగొని బసకుఁజనిరి. అంత నాదినాంతంబున నాదైత్యరాజనందనా
ప్రేరితయై యాశుచిముఖి ప్రద్యుమ్నుంగాంచి యిట్లనియె. 18

ఉ. మారకుమార విక్రమకు ♦ మార మదాసురమారదైత్యరా
డ్వీరకుమారికామణియు ♦ వేయువిధంబుల నీదురాక యే
కోరుచునుండె నిత్తఱిని ♦ గొబ్బున బాల ననుగ్రహింపుమ
వ్వారిజనేత్రి కొక్కకళ ♦ వాసరమయ్యె నదేమిచిత్రమో. 19

వ. మఱియు నబ్బాలికాలలామంబు నీకర్పింపు మని పరిమళేంది
రాసమాగతేందిందిరసమావృతబృందారకార్పితమందారమాలిక
నాయఱుతం గట్టిపంచె. దీనిం జిత్తగింపు మన నాకందర్పుండు మంతనం
బున నాభృంగములలో నొక్కబృంగంబై యందుఁ బ్రవేశించిన నాకల
హంస కిలకిల నవ్వుచు నతనిం దోడ్కొనిచనిన నబ్బాలికామణి ప్రియుని
న్గానక చింతాక్రాంతయై యిట్లనియె. 20

క. అండజరాజా మత్సఖి
బెండుపడి మనంబు చెదరి ♦ బెదరం జొచ్చెన్
దండిగఁ దెల్పుము కాయో
పండో నీవేసినట్టి ♦ పని వేగముతోన్. 21

వ. అనిన నది యిట్లనియె. 22

ఉ. తెచ్చితి నీమనోహరుని ♦ దేవి భవత్తప మెల్లఁ బండె నీ
సచ్చరితంబు వన్నెఁ గనె ♦ శాశ్వతకీర్తి చెలంగె నీకు నా
పచ్చనివింటిజోదువోర ♦ భావజమూర్తి సతీమనోహరుం
డచ్చుగ భర్త యయ్యె నహా ♦ హా చెలి నీదగుభాగ్య మెట్టిదో 23

వ. అని జలజాక్షిని బుజ్జగించి పద్మిన్యమ్ముని బ్రార్థించిన నతండు నిజస్వరూపంబునఁ బొడసూప నప్పుడప్పడఁతుక మూర్ఛాక్రాంత యగుట మఱలఁ దెలివింగాంచి యాశుచిముఖితో నిట్లనియె. 24

సీ. కలహంస నీదయా ♦ గరిమ యన్నాకచే
మేటివియోగాబ్ధి ♦ దాఁటఁగంటి
నీడజనీమైత్రి ♦ నేత్రాంజనముచేత
నాప్రాణసఖునిధా ♦ నంబుఁగంటి
ఘనకవి నీదాత్య ♦ మనుసుధావృష్టిచే
విరహపరితాపంబు ♦ వీడఁగంటి
సితపక్ష నీబుద్ధి ♦ వితతచంద్రికచేతఁ
జింతాతమంబు వ ♦ ర్జింపఁగంటి
నహహ యేమని వర్ణింతు ♦ మహితమూర్తి
నీకుఁ బ్రత్యుపకృతిఁ జేయ ♦ నేను నేరఁ
గాన నంజలి గావింతు ♦ మాననీయ
రమ్యగుణసాంద్ర కలహంస ♦ రాజచంద్ర. 25

వ. అని యాకలహంసం గొనియాడి మదనదేవుని కెదురుగాఁజని 26

సీ. నైజారుణంబైన ♦ మైజారుఁబెరఁగుపై
పైజారఁబాలిండ్ల ♦ పైనెరపుచు
విరబారుముత్తెంపు ♦ సరిబారుహారాయులు గా
జరబాబురవికపై ♦ సర్దుకొనుచు
లసమానమణిమాల ♦ లసమానకంఠంబు
దెస మాటిమాటికి ♦ దిద్దుకొనుచు
నెఱిడాలు గలమారు ♦ గరిడీలబహువక్త్ర
మురిడీలజతఁ గేల ♦ జరుపుకొనుచు

ముద్దుగా నత్తు నొద్దిక ♦ దిద్దుకొనుచు
వాలుఁగన్నుల లీలతోఁ ♦ దేలఁజూచి
సొంపు మీఱంగఁ జేతులు ♦ జోడు చేసి
చెలఁగ నసమన్మథునితోడఁ ♦ బలికెఁ గలికి. 27

సీ. నేఁడుగదా మాకు ♦ నెమ్మి బ్రహ్మానంద
పదమిచ్చె నీదయ ♦ పరమపురుష
నేఁడుగదా మాకు ♦ నిఖిలవిభూతులు
వఱలె నీకృపను స ♦ ర్వజ్ఞమూర్తి
నేఁడుగదా మాకు ♦ నిఖిలభోగంబులు
నలరె నీకరుణను ♦ యాదవేంద్ర
నేఁడుగదా మాకు ♦ నీకటాక్షప్రాప్తి
శ్రీతిమంజులత గూర్చెఁ ♦ గృతిమహోజ
మాసదన మిప్పు డయ్యెను ♦ మాసదనము
మదనసామ్రాజ్య మిచ్చెనీ ♦ మహిమ కుంద
రదన సద్గుణసదన పూ ♦ ర్ణక్షపేశ
వదన రాజీవబాణదు ♦ ర్వారకదన. 28

వ. ఇట్లుపలికి. 29

క. అంజలిఁ జేయుచుఁ దనపద
కంజంబుల వ్రాలుసతిని ♦ గ్రక్కునఁ గేల్దా
మంజుగతి నెత్తి శంబర
భంజనుఁ డాలింగనంబు ♦ పటుగతిఁ జేసెన్. 30

వ. ఆలింగనంబుఁ జేసి మణిమయకుథాస్తరణంబున నవ్వనితామణి
తోడం గూర్చుండి యిట్లనియె. 31

గీ. దనుజజాతివి నీవు నే ♦ మనుజజాతి
నన్యజాతిప్రసక్తి న ♦ మర్త్యమగునె

కానసీకోర్కి యేలనో • కాంతయనినఁ
గామినీమణితద్రీతి • కాముఁతోడ 32

ఉ. తేవను బల్కెపప్పుడు హి • డింబను మారుతడింభకుండు స
ద్భావతఁ బెండ్లియాడఁడెసు • పర్వవిభుండుపులోమజాతనుం
దేవిఁగఁజేయఁడే మునుప • నేకులు గైకొనరే యిదే క్రియన్
భావజరూప నీహృదయ • పాళిద్రివింపదు కానిపేర్మితోన్. 33

వ. అనినఁ బ్రద్యుమ్నుం డిట్లనియె. 34

ఉ. దానవరాజపుత్త్రివిగ • దా రమణీమణి నీవు నేను న
ద్దానవవైరినందనుఁడఁ • దత్వమ వైరము వారి కెప్పుడున్
మానిని నీకు నాకుఁ దగు • మైత్రి యెటబ్బు నొకప్పుడబ్బినన్
హాని జనించునేమొసకి • యా యిటువంటివిహారమేటికిన్. 35

వ. మఱియును. 36

క. విను నీజనకుఁడు విన్న
న్మనమునఁ గోపించి వచ్చు • మఱియుద్ధంబ
ద్దనుజునితో నగు సిద్ధము
వనితా మన కట్టికార్య • వర్తన మేలా ? 37

వ. అనిన నక్కాంతామణి యిట్లనియె. 38

ఉ. వాగధినేత నెన్నొసట • వ్రాసినపద్ధతిఁ దప్పి పోదుగా
సాగరశాయిపుత్త్రమణి • సర్వజగంబులఁ జూడ నెందుత
ద్యోగముఁదప్పఁజేయుటకు • నుర్విని నీకును నాకు శక్యమే
కాఁగలకార్య మెప్పుడును • గాకయ తప్పునె ప్రాణవల్లభా.

క. వాణీపతి కైనను శ
ర్వాణీపతికైనఁగర్మ • వశమును గడువన్
క్షోణీస్థలి శక్యంబే
ప్రాణప్రియ దానికేఁటికి • పని వగవంగన్. 41

వ. అని విన్నవించిన సంతోషించె నక్కుమారుండప్పుడు. 42

ఆ. వె. ఇట్టులున్నతఱిని ♦ హేలావతీమణి
కన్నుసన్న నూఁడి ♦ గంపుఁజెలులు
సామి! మజ్జనంబు ♦ సమయ మంచును దెల్ప
శౌరి మందహాస ♦ సరణిఁదెలసి. 43

క. రవివనితాసీమంత
స్థితి గత మగుచెందిరం ♦ చేవలె నరుణా
కృతి మించునతసపదముల
సతి యొక్కతె పసిఁడిపావ ♦ జతఁ దొడిగె వడిన్. 44

క. సజ్జనపోషకసుతుఁడు న
మజ్జనవృతుఁడగుచు దివ్య ♦ మణిఖచితం బౌ
మజ్జనశాలకు నరిగెను
మజ్జాయని కేలు మోడ్చి ♦ మగువలు వొగడన్. 45

గీ. జలజబాణుండు మజ్జన ♦ శాల కరిగి
శాతమన్యవమణిమయా ♦ సనమునందు
హారకేయూరవరభూష ♦ ణాదికముల
మెల్లమెల్లన సగలించి ♦ మెలఁగు నంత, 46

మ. కరపద్మంబుల రత్నకంకణరణ ♦ త్కారంబు పర్వంగ నూ
పురముల్ మోయఁగఁ గేశపాశగ తమా ♦ పుష్పాళిజారంగఁ జం
దిరరేఖాంచితఫాలభాగముస న ♦ ర్తింపంగ నీలాలక
ల్మెఱయన్సంపఁగినూనె యంటె నొకనా ♦ ళీకాక్షి యక్కార్ష్ణికిన్.

సీ. మెలమెల్లనలకలఁ ♦ గలచిక్కు దీర్పవే
జాణ మాకీవృత్తి ♦ సహజ మరయ

వెలఁదిసుస్నేహంబు • వీనుల నించవే
యదిచిరాభ్యస్తమే • సదయహృదయ
యీనిశాసంసర్గ • మింపుతోఁ బెంపవే
యది నీకరుణరాఁగ • నలరు నయ్యె
కరతలామలకంబు • గాఁగఁజేసితి గదే
మాకాంతవరతపో • మహిమఁగాదె
పేర్మి వేమరుశరముల • వేఁడి కోర్వ
నాథ సెల విట్లో యట్లయె • నర్తుదేవ
యనుచు నర్మోక్తు లాడుచు • నతివసకియ
మజ్జనమొనర్చె నానవ • మన్మథునకు. 48

మ. జలజాంతస్సలనానటప్ఫ్రమరపుం • జశ్రేణు లోనాఁగఁ జే
తుల లోఁ జెన్నెరులన్దిమల్చి మిగులం • దోరంబుఁగాదువ్వుచున్
జెలఁగ న్గొజ్జఁగినీరు చల్లి కడుభా • సిల్లఁగ సున్నిగ్ధని
ర్మలగంధామలకంబు వెట్టె నొకరా • మారత్న మాకార్ష్ణికిన్.

మ. చెలు వారంగ సుగంధగంధయుత మై • చెన్నారుమందోష్ణమా
సలిలం బప్పుడు పైఁడికుంభముల యో • షారత్న మందీయఁగా
జెలుచన్ క్రోడము మేనఁ బూయుచు నిశా • పిణ్యాకము న్నల్పుచున్.
జలకంబార్చె లతాంగియోర్తు యదువం • శశ్యామితోల్పట్టికిన్. 49

క. గడితంపుఁజేఁముఁ గొని
జడగతితో బీదకవును • జవజవ లాడన్
బడఁతుక యొక్కతె నేగమె
తడియొత్తెను గురుల శౌరి • తనయాగ్రణికిన్.

గీ. పునుఁగు జవ్వాదిచేనందు ♦ కొనుచుకొక్క
చెలులతలమిన్న నెఱికురు ♦ ల్చిక్కుఁ దీర్చి
యగరుధూపంబు వైచినీ ♦ రార్చె నపుడు
బాలశశిఫాల గోపాల ♦ బాలమణికి.

సీ. మకరకుండలహార ♦ మకుటాదిభూషణ
వారంబు లిడె నొక్క ♦ కీరవాణి
కమనీయ కౌశేయ కాంచనచేలంబు
గట్టఁగా నిడె నొక్క ♦ కంబుకంఠి
సాంకవమృగమద ♦ చందనక్షోదంబుఁ
బూసెను మెయి నొక్క ♦ పూవుఁబోఁడి
మల్లికాసుమజాతి ♦ మందారదామంబు
లఱుతనిడియె నొక్క ♦ మెఱుఁగుఁబోఁడి
వలపుఁగస్తురితిలకంబు ♦ వన్నెగులుక
ఫాలమం దిడెనొక్కశం ♦ పాల తాంగి
పెంపు దీపింపఁ గాటుకఁ ♦ బెట్టె నొక్క
మగువ మెఱుఁగారశంబర ♦ మర్దనునకు. 52

వ. మఱియును.

సీ. వెలలేనిరతనాల ♦ వెండిపళ్లెరముంచి
జిలుగుగిండియలతో ♦ జలములుఁచి
సరిలేనిముత్తెంపు ♦ సరిసన్న బియ్యంపు
టన్నంబుఁ దగువడి ♦ యంబులూరుఁ
గాయలు పొడిగూర ♦ గమి మొల్కపప్పులు
కలవంటకంబులు ♦ చెలఁగుచున్న
సద్యోఘృతంబును ♦ చంద్రికాధౌతమౌ
దధిపాయసంబును ♦ మధురమధువు

నానవాలును ముఖ్యర ♦ సాయనములు
భక్ష్యములు భోజ్యములు లేహ్య ♦ పానకములు
పొలుపుగా గిన్నియల నుంచి ♦ భోజనంబు
వనిత చేయించెదనమనో ♦ వల్లభునకు. 53

క. శ్రీలాలితమణికంకణ
జాలఝణత్కార మెసఁగ ♦ సఖి యొకసురటిన్
లీలాగతి విసరఁగ గో
పాలాసుతాగ్రిణి భుజించెఁ ♦ బ్రియుఁడం బలరన్. 54

వ. అప్పు డాచేడె లిట్లనిరి. 55

చ. వనితల మైనమాయెడల ♦ వాంఛలు దాఁపకుమయ్యపాయసం
బునుఘృతమింపుగాఁగొనుము ♦ బూరెలుకర్జరముల్ రచింపఁగాఁ
దినుము మనంబు సిగ్గునటు ♦ దీసిభవత్సఖిఁజూచిహాస్యమిం
దొనరుపుమయ్యభావమున ♦ నొక్కటిపైకి మఱొక్కటాటచే.

వ. అని పల్కు చెలులచమత్కార వాక్యంబులకు సంతసించుచు
భుజించి. 57

క. రంగారెడుబంగారపు
భృంగారుజలంబు వంపఁ ♦ బ్రియ మారంగా
సింగార మొలయ మురళీ
సంగీతప్రియుని సుతుఁడు ♦ శయముల వార్చెన్. 58

వ. అనంతరంబ. 59

గీ. రాజదేలాలవంగము ♦ లాజికాయ
పచ్చికొబ్బరి దాక్షిణు ♦ లచ్చమైన
పూగమకాక్తకసుధలు క ♦ ర్పూరము లొఁలయు
వీడెమొసఁగగంగ గొనిరతీ ♦ విభుఁడుప్రీతి. 60

వ. తదనంతరంబ దానిం దోడ్కొనిచని. 61

సీ. మకరాంకవిజయాంక • నికరంబువర్తించు
చిత్రచిత్రస్ఫూర్తి • చెన్నుఁ బెంచుఁ
గర్ణసుధాపూర • కలిత మైవర్తించు
శుకశారికాస్ఫూర్తి • సొంపు గాంచు
ఘనసారకస్తూరి • కాంతతుల్ జనియించు
గంధబంధురరీతి • గములఁ గూర్చు
వాచామగోచర • రోచుల ఘటియించు
దివ్యమణిశ్రేణి • దెలివి నించు
బహుళతరచారుశయ్యల • ప్రభవహించు
తూఁగుటుయ్యేల లందంద • బాగు నించుఁ
జేడె శయనస్థలం బిదె • చిత్తగింపు
మంగసంభవ యీశయ్య • నధివసించు. 62

— • ప్రభావతి గర్భవతియగుట • —

సీ. శ్రీపతిపౌత్త్రుండు • చెలఁగఁగాఁదనయందుఁ
గానుముష్టిశనంబు • కడకుఁబాసె
ముమ్మాలమగు వేల్పు • మూర్తియుండుటఁజేసి
మేనికినొకవింత • మెఱుఁగుదోఁచె
వరదుఁడై తగుపరా • త్పరుఁడులోపలనుంటఁ
గాంచినసంపూర్తిని • గాంచి వెలఁగె
గర్భస్థనీలాంగ • కాంతిరేఖాకృతి
ప్రతిబింబ మనరోమ • రాజి వెలసె
వళులు విడఁబాఱె భూషణా • వళులు బిగిసె
శ్రమజలంబులు జనియించె • శ్రమము మించె

మన్ను చొరవయ్యె నడకలుఁ ♦ మందమయ్యెఁ
జూలు నిలచుట దనుజేంద్ర ♦ సూతికంత. 63

ఉ. అంతట నొక్కనాఁడు దను ♦ జాధిపనందనఁజూడవచ్చితత్
కాంతపితృవ్యనందనలు ♦ గౌరవ మారఁగఁ బల్కరక్కనీ
వింతగుకొత్తచిన్నెలను ♦ వేషము నెమ్మదిజూడఁజూడస
త్కాంతునితోడఁగూడినవి ♦ కానవిలాసముదోఁచుచుండెడిన్.

క. సరసోత్తరచతురుండగు
పురుషునిసంభోగ మెఱమిఁ ♦ బొందుచు నెంతే
పరమానందముఁ జెందిన
సరణిఁగనంబడెడు వికచ ♦ సారసవదనా. 64

వ. కావున. 65

ఉ. సారసబాణబాణముల ♦ స్సైరణ చేయఁగరాదుగా; మహో
దారనవీనయౌవనము ♦ ధైర్యము నిల్వఁగ నీదుగా; మది
న్నారితరంపులజ్జ మిము ♦ బోట్లకుఁ దెల్పఁగ నీదుగా; సఖి
కోరిక యెట్లు దీఱునృప ♦ కుంజరులిండ్లను బుట్టవచ్చునే. 66

క. కావున నీవొనరించెడి
యీవిధ మేయుక్తమగుచు ♦ నేపాటెఁగదున్
వేవేగ మాకు నిట్టులఁ
గావింపుము నిన్నె తల్లిఁ ♦ గాఁజూతుమిఁకన్. 67

వ. అని పల్కు వారలు జని రంత నాప్రభావతి మారునిఁజూచి యిట్లనియె. 68

క. మదనా నీమేళములోఁ
బొదలెడువా రెవ్వ రెందుఁ ♦ బోయి రనంగన్
మదనుజులు వార లిప్పుడు
సదనంబున నున్నవారు ♦ సారసనేత్రా. 69

క. కోరిరి నాచెల్లెండ్రా
వారిజదళనేత్రలైన • వారల నిటకున్
వేరావించిన మనకు
న్వారలు దోడగుదు రెట్టి • వర కార్యములన్. 70

— ప్రభావతి తన పితృవ్యపుత్త్రికలకు సాత్యకిప్రభృతుల నరులంగావించుట —

గీ. అనిన వారలరావించె • నాత్మభవుఁడు
వార లందఱ కందఱ • వరులఁజేసెఁ
జెలఁగఁ దత్ప్రోధముల వారు • మెలఁగి రంతఁ
గామరూపాదిమాయలు • గ్రాలు చుండ. 71

సీ. చిలుకలై యొకవేళఁ • గిలకిలనవ్వుచు
వడిఁబోదు రుద్యాన • వాటికలకు
నంచలై యొకవేళఁ • సంచరింతురు పోయి
సారససారకా • సారములకు
పారావతంబులై • పారుదు రొకవేళ
సుందరకృతకాద్రి • బృందములకు
వెన్నెలపులుఁగులై • విహరింతు రొకవేళ
సచ్ఛంద్రచంద్రికా • సైకతముల
నెమ్మిలై వారు నటియింతు • రిమ్ము మీఱ
సరసమణిగణకుట్టిమ • స్థలములందు
నవ్విధై తేయకన్యాన • నాథులగుచు
నలజగన్మోహనాదిమా • యాపరీక్షస్థి. 72

వ. మఱియును. 73

మ. సురలై నాకముఁజేరఁబోయివిబుధ • స్త్రీశోభాభిరామంబు భా
సురరంభాదివిలాసినీనటనసం • శోభాఢ్య మాదృశ్యసనో

హారగాంధర్వము కల్పకప్రసవగం ♦ ధామోదసంలగ్నబం
భరగానంబు సుధర్మఁజూతు రొగిశం ♦ భల్లోలలీలారతిన్. 74

ఉ. భాసురవృత్తిఁ ద్రోఁబ్రమథ ♦ పాలసుఖైచని కాంతురల్లకై
లాసము రత్నకుట్టిమవి ♦ లాసము కల్పకపుష్పమాలికో
ల్లాసము పార్వతీపతిస ♦ లక్షణమంజులగానతాండవా
వాసము నారదాదిఘన ♦ వైణికతానవితానభాసమున్. 75

క. అలకం జూతురు సన్నిధి
కులక న్బాతాళమర్త్య ♦ గోస్థలనగరీ
తిలకన్ బృందారకతరు
కలికన్వరపుష్పకాంశు ♦ ఘటితోత్కలికన్. 76

వ. మఱియు నందనోద్యానసుందర మందార నిర్మలచ్ఛాయ విహరించుచుఁ గుబేరచైత్రరథోద్యానవాటికా సారపేటివా శృంగార బంభరసంగీతరవంబుల కానందంబు నొందుచు సకలమనోభీష్టోప భోగంబులం గ్రీడించు చుండ నక్కాంతాజనంబుల కొక్కొకకుమారుండు గలిగెనంత నంతఃపురకాంతావళి వారలవృత్తాంతంబు మెల్లన రాక్షసేశ్వరున కెఱింగించిన నతండు కటంబు లదర బొమలు ముడివెట్టుచుఁగన్యాంతఃపురంబునకు వచ్చి 77

{ వజ్రనాభుఁడంతఃపురంబులఁ బ్రభావతిప్రభృతుల పుత్రులం గాంచి
కోపంబునఁ బ్రద్యుమ్నాదులఁబట్టిశిక్షింపఁబోవుట. }

ఉ. హారకిరీటహీరకట ♦ కాంగదనూపురదివ్యభూషణో
దారులఁ గన్యకాదివని ♦ తాజనతావినుతాంతరాంతరా
స్వారుల నక్షకేళిఘల ♦ భవ్య విహారుల శూరులంగళా
మారుల యాదవాన్వయకు ♦ మారుల వీరులఁ గాంచెనత్తఱిన్

ఉ. కాంచుచు నీనరాధములఁ ♦ గట్టుఁడుపట్టుఁడుకొట్టుఁడంచు వీ
ర్యాంచితరాక్షసావళి మ ♦ హాగ్రహవృత్తిని బంప వారలున్

బ్రాఁచిత్రబాహాసారములఁ ♦ బైకొనఁ గన్గొని కన్యలంతలో
గాంచనరత్నసంఘటిత ♦ ఖడ్గముఖాయుధకోటి నీయఁగన్. 78

ఉ. సాత్యకిసాంబులు న్గడఁగి ♦ చయ్యనఁ జర్మకృపాణపాణులై
దైత్యుల దాఁకి వారల వి ♦ దారితకంఠులఁజేయఁగావడిన్
దైత్యవరుండు గాంచిమఱి ♦ దానవనాథుల మంత్రివర్గమున్
భృత్యులఁబంపఁదాఁకిరతి ♦ భీషణరోషకషాయితాక్షులై. 79

ఉ. వారలఁద్రుంచిరంత భుజ ♦ వైభవమొప్పఁగ వారిఁజూచివే
ఘోరుఁడు వజ్రవక్షుఁడగు ♦ కుంభుఁడువజ్రనఖుండుదాఁకినన్
వీరుఁడు రుక్మనేత్రుఁడును ♦ వేగదుఁడున్మఱి రుక్మబాహుఁడున్
వారలఁద్రుంచి రంతనని ♦ వారణబాహువిలాస మొప్పగన్. 80

క. రథికులు గొందఱు మఱిసా
రథులై గొండఱును ♦ వేగ రాజితగతితో
బృథుశాలలలో నునుచిన
నధికాశ్వచయంబుఁబూన్చి ♦ రాహవమత్తులై. 81

వ. ఇట్లుండ వజ్రనాభుండు గాంచి యితండు సామాన్యుండు గాఁ
డని తనమనంబున నూహించె నప్పుడు. 82

సీ. శాలాంతరమునందుఁ ♦ గ్రొలునేత్రముడాఁచి
వచ్చియున్నట్టిస ♦ ర్వజ్ఞవిభుఁడో
శంఖచక్రములొక్క ♦ చక్కినొక్కినరేశ
వృత్తిఁబూనినపురు ♦ షోత్తముండో
ఖరకరంబుల మాటి ♦ ధరణీస్థలంబుపై
నొప్పారు చున్నదే ♦ వోత్తముండో
చెఱకువిల్లునుబూవుఁ ♦ గఱకుటమ్మును మాని
యవనివర్తించుమ ♦ ద్మాంబకుండో

యనఁగఁ జెలువారు చుండుశి ♦ వాన్వితుండు
చక్రరేఖాకరుండును ♦ జారుదీప్తి
మూలకందంబు మఱి జగ ♦ న్మోహనుండు
గాని యితరుల కీరూప ♦ గరిమ గలదె. 83

క. కానిమ్మయిన నిఁకేమగు
గానున్నది కాకపోదు ♦ కమలజునకునుఁ
వీనిని జయింతు ననుచును
మానితబలగర్వమున స ♦ మాహితమతితోఁ. 84

సీ. కాలాంతసంభూత ♦ కాదంబినీజాత
నిర్ఘాతశతకోటి ♦ నినద మనఁగ
ఘనసురాసురసమా ♦ కర్షితమంథాన
ధరమదితాంబుధి ♦ ధ్వాన మనఁగ
సంవర్తవర్తిత ♦ సప్తమహావాత
చటులజర్ఝామరు ♦ త్స్వాన మనంగఁ
గల్పకాలానల్ప ♦ కాలభైరవభుజా
దళితఢక్కావర ♦ ధ్వనియనంగ
డంబుగతి మించ గగనభా ♦ గంబునందు
కుధరకంధరములు ప్రతి ♦ ఘోష లిడఁగ
నొక్కపెట్టున దిక్కులు ♦ పిక్కటిల్ల
ఘోరతరముగ సంగర ♦ భేరి మ్రోసె. 85

— వజ్రనాభుఁడు ప్రద్యుమ్నాదులపై యుద్ధమునకు వచ్చుట —

గీ. అష్టచక్రసనాథమై ♦ పుష్టిమీఱు
వేయుగుఱ్ఱంబులను బూన్చి ♦ విపులరథము
సారథియుఁ దేరు వేగంబ ♦ సకలలోక
వైభవంబైనయావజ్ర ♦ నాభుఁ డెక్కె. 86

ఉ. ఏలుగ శుంభకుంభులును ♦ వృద్ధియు నుగ్రుఁడు మేఘవర్ణుఁడా
భీలుఁడు ఖడ్గగాత్రుఁడును ♦ భీషణవృత్తియు సర్వసేనతో
మూలబలంబుఁగొల్వఁగను ♦ ముందుగ వారణవాజిరాజి రాఁ
గాలకఠోరకింకరులు ♦ గ్రాలఁగ వచ్చిరి దుర్నివారులై 87

వ. ఇట్లువచ్చినవారలను సాత్యకి సాంబరుక్మ బాహురుక్మ చిత్రరుక్మ ధరాదులు దాఁకి జయించి రంతఁ బ్రద్యుమ్నుని వజ్రనాభుండు దాఁకినం బోరు ఘోరంబయ్యె నందు వజ్రనాభుండు ముసలముద్గరశూలభిండివాలతో మరప్రముఖాయుధంబులు ప్రయోగించి దానవుఁడై తేయతామసాంధాసులగు మయమాయానిర్మిత మహాస్త్రంబులఁబ్రయోగించినఁబ్రద్యుమ్నుండు ధనుర్ధపాండిత్యంబుఁజూపి వాని నన్నింటిని దునియలు గావించి యస్త్రవిద్యావిశేషంబున సమ్మోహనాస్త్రంబుల నూపుమాపి యసంఖ్యాకంబు లగుశస్త్రంబులం బఱపిన నవి.

సీ. అధిగతచక్రవా ♦ లావృత్తపోషిత
హంసావళీపున ♦ రాగమములు
దారితసముదగ్ర ♦ దైత్యాంగనిష్క్రాంత
పాటితాఖిలకుల ♦ పర్వతములు
ఖచితామరద్విప ♦ త్కాండఖండోదగ్ర
గమనధావితదేవ ♦ సముదయములు
ప్రచ్ఛిన్నరాక్షసో ♦ భయభంగకలుషిత
చరమపూర్వదిగంత ♦ సాగరములు
చటులసంవర్తసంఘాత ♦ సప్తవాత
ఘాతజీమూత సంచయ ♦ జాతవిషమ
ఘాతనిర్ఘాతతులితంబు ♦ లాతతములు
ఘోరప్రద్యుమ్నఘనబాణ ♦ కోటులలరె. 89

వ. అట్టి సమయంబున, 90

సీ. ఒకతేవ లయచక • చ్చకితత్రివిక్రమ
చక్రవిక్రమకళా • వక్ర మగుచు
నొకచెంతఁగల్పాంత • వికటఘోరకృతాంత
దండశౌండప్రభా • ఖండమగుచు
కొకచాయ లయపురాం • తకఫాలపావక
జ్వాలికామాలికా • భీల మగుచు
నొకదండ కల్పదీ • పకచంటమార్తాండ
మండలాంచద్దీప్తి • భాండమగుచు
వఱలెఁ బురుషోత్తముఁడు దండ • ధరుఁడు చటుల
బలుఁడు రవితేజుఁ డగుశూర • కులుని బాహు
దండమండితదివ్యకో • దండముక్త
రూక్షదంభోళిగంభీర • రోపవితతి. 91

వ. అప్పుడు పావకనారాయణబ్రాహ్మపాశుపతాస్త్రములం
బ్రయోగించి సర్వబలంబులఁ గూల్చి యనంతరంబ. 92

ఉ. పాయక పృష్ఠభాగమునఁ • బాశుపతంబుఁ దదగ్రమందు నా
రాయణబాణరాజమును • దంచితపార్శ్వములందు మారుతా
గ్నేయశరంబుల న్యములు • క్రిందను మీఁదను గూర్చి సంపుటిం
జేయుచు బ్రాహ్మమస్త్రము వి • శిష్టసమంత్రకశక్తి నేసినన్ 93

వ. అప్పుడు 94

సీ. సప్తసాగరములు • సరగునఁ గబళించు
ప్రళయబాడబశిఖా • పటలికంటె
జగములొక్కుమ్మడి • సమయంగఁజేయుక
ల్పాంతరుద్రోగ్రఫా • లాగ్నికంటెఁ

బర్వతాదుల నెల్ల ♦ బస్మంబుఁ జేసెడు
క్షయకాలచండభా ♦ స్కరులకంటె
నిఖిలలోకంబులు ♦ నిరసించి మించిన
లయకాలదండసం ♦ చయముకంటెఁ
దోరమై ఘోరమై దుర్ని ♦ వార మగుచుఁ
దాఁటి యావజ్రనాభుని ♦ వరగళంబు
దునుమ రాక్షసుఁ డిలఁగూలె ♦ గనఁగ భిదుర
దళిత మైకూలుకులపర్వ ♦ తంబుపగిది. 95

వ. ఇట్లాదుష్టరాక్షసుండు గూలిన, 96

క. సుర లెల్ల విరులవానలుఁ
గురిసిరి వరదేవసతులు ♦ గురునృత్యంబుల్
పరువడిఁ జేసిరి దుందుభు
లురుగతితో మ్రోసె రాక్ష ♦ సోగ్రుఁడు గూలన్. 97

వ. ఇట్లాప్రద్యుమ్నాదులు సకలరాక్షసులం గూల్చి తత్పురంబున గృహంబులకు వచ్చి శ్రీకృష్ణదేవేంద్రులకుఁ దద్వృత్తాంతంబులు దెలిపిన శ్రీకృష్ణబలరామ యుద్ధవాక్రూరాదులు రుక్మిణీసత్యభామాది సర్వస్త్రీసమేతంబుగా వజ్రనాభ నగరంబునకు వచ్చి రంత దేవేంద్రుం సమస్త దేవతాసమేతంబుగా వచెఁ బిమ్మటఁ బ్రభావతి తద్వృత్తాంతంబు పార్వతీ పరమేశ్వరుల కెఱింగించిన వారలు నందీశ్వర భృంగీశ్వర కుమారాది సమేతంబుగా వచ్చి రంత మునుమని వృత్తాంతంబు విన బ్రహ్మయు సావిత్రిగాయత్రి సరస్వతీ సమేతంబుగా నరుదెంచె దేవేంద్రుండు తన తమ్మునికొమార్తెలుగానఁదన్మందిరంబున దిగి శ్రీకృష్ణాదులకు విడుదులు యథోచితంబుగాఁజూపించె వారికి బ్రహ్మయును నాయింద్రుడును దోడ్పడి శ్రీకృష్ణ మహేశ్వరాదులకు మజ్జనభోజనాది

రత్కారంబులు యథావిధి నపిడి రంత సాయంతనం బగుటయుఁ బెండ్లికి
శ్రీకృష్ణుండు దరలివచ్చె. 98

సీ. శారదోచ్ఛ్రితనవ ♦ నీరదాకృతిభంగిఁ
బటువితానవితాన ♦ పటిమ నెఱపఁ
గలితసంధ్యాకాల ♦ కర్బురాంబరమట్లు
చారుసుధాస్తీర్ణ ♦ సభ చెలంగ
భువిపైకి వచ్చిన ♦ దివిజకాంతల నంగ
వారవిలాసినీ ♦ వార మొప్ప
ధరణిఁ జూడఁగఁ నచ్చు ♦ తారకావళిలీలఁ
గరదీపికాసము ♦ త్కరము మెఱయ
మఱి సురాసురమథితభా ♦ సురపయోధి
రావమనఁగను సద్వాద్య ♦ రవము లొలయఁ
బుడమిఱేఁడు మహావిధి ♦ పూర్వకముగ
వెలయఁ గల్యాణవిధులు గా ♦ వించె నంత. 99

సీ. బలిమిచే ఱెక్కలు ♦ గలనాఁటికొండల
తండములోఁ బోలువే. ♦ దండచయము
రమ్యపయోరాశి ♦ రంగదుత్తుంగత
రంగంబుఁబోలుతు ♦ రంగచయము
శారదసముదగ్ర ♦ సారదనీరద
బృందము నోఁబోలిన ♦ స్యందనములు
వెలివెల్లి విరిసిన ♦ బలుపాలవెల్లినాఁ
బొండుపట్టాంబర ♦ భటగణంబు
నడువ జ్యోతులుభూమిపైఁ ♦ గడలుకొనిన
భంగిఁ గరదీపికాకదం ♦ బంబు చెలఁగ

మేటివారవిలాసినీ ♦ కోటు లలర
మురహరుఁడు పెండ్లికవ్వేళఁ ♦ దరలి వచ్చె. 100

శా. తారాజువ్వ లవాయిగొట్టము లగా ♦ దల్చిచ్చుబుడ్డుల్గడున్
దారామార్గము వెంటనంటఁగ శత ♦ ఘ్నుల్బల్తుపాకుల్మహో
దారారావముల న్జెలంగఁగను వి స్తారంబులై చక్రముల్
బారంబార నపారబాణములతో ♦ భల్మీఱ నింపారఁగన్. 101

సీ. ఢక్కలు మురజలు ♦ ఢంకాలు కాహళు
లుబ్బారాలు వీరణా ♦ లొబ్బరుకొనఁగఁ
దుడుములు డప్పులు ♦ తోరంపుఢుంజలు
బాజుల్సనాయీల ♦ బారు లొలయ
దాపాలు మరఫలు ♦ దగినరమ్డోళ్లును
డోళ్లును ముందటఁ ♦ గ్రేళ్లుదాఁట
భేరులగము లర ♦ బ్బీబాజులును మఱి
డిండిమంబులచాలు ♦ గండుమిగులఁ
గంచుమద్దెలలును వీర ♦ కాహళలును
మెఱయ మందరమధితభా ♦ సురపయోధి
రావమును మించి మిక్కిలి ♦ రేవ మెఱయఁ
దరలి వచ్చెను బెండ్లికా ♦ మురహరుండు. 102

వ. ఇట్లువచ్చి వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య సోపాన విచిత్రంబును గాచఘటపటల పటుముకురచటుల దీప మణి దీపికా శాతకుంభస్తంభ విభ్రాజమానంబును వసిష్టవామదేవ విశ్వామిత్ర శతానందగౌతమాత్రి భరద్వాజ కణ్వ కశ్యపవాల ఖిల్య సనక సనందన నారదప్రముఖ మహాముని మండలమండితంబును బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాది సర్వజనవిరాజితంబును సకలదేశాధీశ్వర

రాజకుమార శోభితంబును జతుస్తంభవిరాజమానంబును నగు కళ్యాణ మండపంబునం బ్రద్యుమ్న సాంబరుక్మ బాహ్వాదులం గృతమంగళ స్నానాలంకృత ధౌతపట్టాంబర శోభితుల మంగళపీఠికోపవిష్టులం జేసి వసిష్ఠ వాచస్పతిశుక్రాది పురోహితులు యథావిధిం గళ్యాణకృత్యం బులు సలుపుచున్న సమయంబున. 103

సం. గీ. మహితకాంచనకళ్యాణ ♦ మంటపమునం
గలితప్రద్యుమ్నముఖపాద ♦ కమలములను
గడిగె నిందుగ్రేడు శచిభూరి ♦ ఘటముతోడ
జలములను వంపం గడగి యా ♦ జలము లంత
శిరములను దాల్చెగంగను ♦ శివుడుంబోలె. 104

వ. మఱియును.

శా. శ్రీరాజీవమహాయుధాయ భవతే ♦ శ్రీకామినీసూనవే
వీరాయ ప్రకటప్రతాయవశినే ♦ విష్ణుస్వరూపాయతే
తారుణ్యాకరమామకానుజసుతాం ♦ దాస్యామియంచున్న యో
ధారాపూర్వముగాంగనిచ్చె నపుడా ♦ ధాత్రీధరారాతియుక్.

వ. ఇట్లు క్రమంబున మిగిలినవారలం గూడ ధారవోసెనంత. 107

క. మంగళసూత్రముం గట్టెను
భంగురచికురాళి యాప్ర ♦ భావతికంఠక్
శృంగారమూర్తి యప్పుడు
గంగాధరముఖ్యు లెల్లం ♦ గనిదీవింపక్. 108

వ. తదనంతరంబ తదనుజులకెల్ల నిట్లు జరిగించిన పిమ్మట నిందోప్రేంద్రులు పరమానందంబు నొంది రనంతరంబ రుక్మిణీసత్యభామాశచీ వాణీశర్వాణీముఖాదులు వసంతోత్సవ తాంబూలచర్వణోత్సవాదుల జరిపిరందు శచీవిభుండు శ్రీకృష్ణాదులకును శంకరాదులకును బ్రహ్మ వసిష్ఠకశ్యపాదులకును దివ్యాంబరాభరణాదు లొసంగె నంత బ్రహ్మ

శంకరాదులు నిజనివాసంబులకుం జనిరి శ్రీకృష్ణుండును ద్వారకానగరంబున కాదంపతులతోడఁ జనె నని శ్రీశుకుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పె.

శా. పారావారగభీరసాంధ్యసమయ ♦ ప్రారబ్ధజంపాక్రియా
స్ఫారస్నానటదిందుమౌళినివస ♦ త్ప్రోంచజ్జటాజూటకా
సారాంతస్థలతీవ్రవేగవిలుఠ ♦ త్స్వర్గాపగాజాతడిం
డీరాకారయశోవిహారరిపుశౌం ♦ డీరాపనోదప్రభా. 110

భుజంగప్రయాతము. రమాభామినీపాద ♦ రాజీవపూజా
సమాధిక్రియాచార ♦ సంగాతభీజా
సమాంబ్ధవిద్యోరు ♦ సాహిత్యభోజా
క్షమాదైవతాఖ్యాత ♦ సత్కల్పభూజా 111

ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసరసకవితాసామ్రాజ్య ద్రావిడ
శాఖాపస్తంబ సూత్ర కౌండిన్యగోత్ర శ్రీమదోరుగంటికులపవి
త్ర జోగిశాస్త్రి నరసమాంబాతనూభవ శ్రీరామకృష్ణార్జు
ననారాయణీయత్రివృద్ధి ప్రబంధాధిబంధుర ప్రబంధరచ
నావైభవ సోమశేఖర కవిప్రణీతంబైన శ్రీప్రభా
వతీపరిణయంబను మహా ప్రబంధంబున
జతుర్థాశ్వాసము.



# శ్రీ ప్రభావతీపరిణయము.

## టిప్పణము.

1. శ్రీ=శోభాయుక్తమైన. లక్ష్మీసతి=లక్ష్మీదేవి. నాథ...వ్యక్తిన్. పెనిమిటియొక్క కౌస్తుభమనెడు మణియందుఁబ్రతిఫలించిన తనయొక్క ప్రతిబింబమును, పరాబ్జనేత్రియని=ఇతర=స్త్రీయని. భావింపఁగన్=యోజింపఁగా. తద్బాలాశ్లేషతన్=ఆలక్ష్మీదేవియొక్క యాలింగనముచేత. సందేహమునుమాన్చి. నవ్య కమలాప్రాణేశుఁడు=నవ్యనట్టి లక్ష్మీదేవికి భర్తయైన. శ్రీవేణుగోపాలగ్రామణి=శ్రీవేణుగోపాలప్రభువు. ని. గ్రామణీః పతిముఖ్యయోః అని నానార్థరత్నమాల. వేంకటాచలపతిని. భద్ర + ఉన్నతున్ + జేయుతన్=మంగళములచే మున్నతుని జేయుఁగాత.

2. పద్మ=లక్ష్మీదేవి. పద్మాలయ=పద్మము స్థానముగాఁగలది. పద్మారిసోదరి=పద్మములకు విరోధియైన చంద్రునితోఁబుట్టువు. పద్మాక్షసతి=విష్ణునిభార్య. సితపద్మపాద=తెల్లని తామరలవంటి పాదములుగలది. కమల=లక్ష్మీదేవి. కమలపీఠ=కమలముపీఠముగాఁగలది. కమలసదృఙ్నేత్ర=కమలములతో సమానమైన నేత్రములుగలది. కలంబము=బాణము. కమలకలంబుఁడు=కమలమే బాణముగాగలవాఁడు; మన్మథుఁడు. అబ్జ=లక్ష్మీదేవి. పాలసముద్రమునఁబుట్టినది. అబ్జశిరోధి=శంఖమువంటి కంఠముగలది. అబ్జశోభితపాణి=పద్మహస్త. అబ్జసంభవుమాత=బ్రహ్మకుఁదల్లి. అబ్జవదన=పద్మమువంటి ముఖముగలది. హీర=లక్ష్మీదేవి. హీరకలాప=వజ్రములు స్థాపించిన యాభరణములుగలది. హీరాళిరోమాళి=నల్లచీమలబారువంటి రోమరాజిగలది. హీరలసన్మధ్య=సింహమువంటి ప్రకాశమైన నడుముగలది. హీరవేణి=త్రాఁచుఁబామువంటి జడగలది. తల్లితల్లి=విష్ణుని కూఁతురు గంగ; ఆగంగను సముద్రుఁడు పెండ్లియాడెను. సముద్రునికూఁతురు లక్ష్మి; ఆలక్ష్మిని విష్ణువు వివాహమాయెను. జగంబులతల్లి=ప్రపంచములకుఁదల్లి. సద్రువల్లి=కల్పలత. కోరిన కోరికల నిచ్చునది. వనితామతల్లి=స్త్రీలలో శ్రేష్ఠురాలు. సన్మల్లికాళిసల్లలితహాస=మల్లికాపుష్పముల సముదాయమువంటి చిఱునవ్వుగలది. అలపాలవెల్లిబోద=అట్టి పాలసముద్రము యొక్క బొట్టె. వెంకటాచలపతియింటియందు. వెలయుఁగాత=ప్రకాశించుఁగాకని. హీరస్సింహాహివజ్రేషు హీరా లక్ష్మీః పిపీలికా; యని నానార్థరత్నమాల.

3. సామాథర్వణ ఋగ్యజుస్సులు=సామము అథర్వణము, ఋగ్వేదము, యజుర్వేదము, ఏకకాలమునన్=ఒక్కసమయమున. సుమనోముఖ్యుండు=సురజ్యేష్ఠుఁడు=బ్రహ్మ.

4. అంబుసంభవసంభవుఁడు=పద్మభవుఁడు=బ్రహ్మ. కాంచికా+అంచిత=మొలనూలిచేనొప్పెడు. అధర+అనకీకృతము=శీఘ్రముచేఁగ్రిందు సేయఁబడినది. తాతరాణి=ధాతృరాజ్ఞి=సరస్వతి.

5. అభ్రోల్లసత్కేశులు=1 ఆకాశము కేశములుగాఁగలవాఁడు. అభ్రకేశుఁడు=(శివుఁడు) 2. నీలమేఘములువంటిశిరోజములుగలది (పార్వతి) అతులహీరకలాపులైనవారు (1) నాగాభరణుఁడు. (శివుఁడు) (2) వజ్రస్థాపితములైన యాభరణములు గలది. (పార్వతి) కమలలసత్పాణికాంతులుగలవారు=1. లేడిని హస్తమునందు గలవాఁడు, సారంగపాణి=(శివుఁడు) 2. కమలములవంటి హస్తముగలది. (పార్వతి) శిరమున శశికళ జెరువువారు=శిరస్సునందు చంద్రునిగలవాఁడు; బాలేందుశేఖరుఁడు (శివుఁడు) 2. శిరమున జంద్రరేఖను ధరించినది (పార్వతి) ఘనసర్వమంగళాఖ్యను గాంచి తగువారు=1. సర్వమంగళుఁడు=షడ్గుణైశ్వర్యయుతుఁడు; (శివుఁడు.) 2. సర్వమంగళ యను పేరుగలది. (పార్వతి) వాగర్థములరీతి నలరువారు=1. వాక్కును అర్థము. ఒకటిలేనిది మఱియొకటి యుండదు, నిత్యానపాయులు—శ్లో. వాగర్థావివసంపృక్తౌ: అనిరఘువంశము. రామాభిరామతరమణకెక్కినవారు, 2. రామా=పార్వతీదేవిచేనొప్పెడివాఁడు; (శివుఁడు) 2. స్త్రీలలోమనోహరమైనది; (పార్వతి) కదంబావాపిఁబరఁగువారు=కదంబవనము నందుండువారిరువురును. ఈపద్యమున శబ్దాలంకారమును, నర్థాలంకారమును గలవు.

6. నాగముఖుఁడు=గజాననుఁడు. నాభిజుండు=బ్రహ్మ. కపిత్థప్రియుఁడు=వెలగపండ్లయందిష్టముగలవాఁడు. నాకనల్లభుఁడు=ఇంద్రుఁడు. మహేశ్వరసూతి=శివుని కుమారుఁడు. సనాథుఁడు=కూడుకొన్నవాఁడు.

7. సర్వమంగళా+అవాప్తి=1. సర్వమంగళములను గూర్చుటచేత. 2. సర్వమంగళ యను పేరుగలది. మహితవాణి=ఒప్పుచున్న వాక్యములుగలది, 2. వాణి యనుపేరుగలది. బుధగురుప్రీతి=విద్వచ్ఛిరోమణులయందుఁ బ్రీతి. 2. చంద్రునియందుఁబ్రీతి. దక్షకన్యక. 1. సమర్థుఁడైనవాని కుమార్తె. 2. రోహిణి. ధరిత్రీకన్యకాంబ=సీతాదేవి.

8. 1. కవితా కల్పకము నాటినవాఁడు. వాల్మీకి 2. శాఖిశాఖోన్నతిజరపినవాఁడు=వ్యాసముని. 3. సత్ ఉపమానము. 4. అర్థగురువృత్తి చూపినవాఁడు=భారవి. 5. ఖగవరాంతస్స్థితి=పక్షులు గలిగియుండుట-ఖగవర=సూర్యునియొక్క అంతఃస్థితి-మయూరకవి=సూర్యోపాసకుఁడు. 6. తులఁదూఁగ రసపుష్టిఁ జూపినవాఁడు, భవభూతి-సగస్వాతి శనకస్థాపతంసము నందిన మకరందమును భవభూతి

పద్యమున నుంచెనని వాడుక. 7. పదలాలిత్యము—దండి. 8. నిఖిలగుణంబులు నిలిపినవాఁడు=మాఘుఁడు. శ్లో. ఉపమా కాళిదాసస్య, భారవేరర్థగౌరవమ్-దండినః పదలాలిత్యం, మాఘేసంతిత్రయోగుణాః-అని వాచస్పత్యము-నైషధేపదలాలిత్య మని పాఠాంతరము. శ్లో. అహో మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ భణితిం, ఘటాయామారోప్య ప్రతిఫలతి తస్యాంలఘిమని గిరాం దేవీ సద్యశ్శ్రుతికలితకల్హార కలికా మధూలీమాధుర్యంక్షిపతిపరిపూర్త్యైభగవతీ. అని భోజచరిత్రము.

9. వాగనుశాసనుఁడు=బ్రహ్మ, నన్నయభట్టారకుఁడు. శ్రీనాథుఁడు=విష్ణువు, శ్రీనాథకవి-సోముఁడు (స+ఉమా) శివుఁడు, నాచనసోమకవి—కుండలి తావు. పాతాళలోకము—కుండలి=కుండలములు కలవాఁడు. తిక్కనసోమయాజి-

10. వరనిష్ఠశక్తిగురుని=శ్రేష్ఠమయిననిష్ఠచేత శక్తియొక్క తండ్రిని; వశిష్ఠునిమనీషాగురుఁ=బుద్ధిచేత బృహస్పతిని. విద్వాంసులలో శ్రేష్ఠుని. నవగుహాగురునిఁ=కుమారస్వామికిఁ దండ్రి; ఈశ్వరుఁడు.

11. పాడి వేంకటస్వామి (వేంకట నారాయణపాఠి) ఔత్కళ్య=ఉత్కళదేశజ బ్రాహ్మణుఁడు-శ్లో. సారస్వతాః కాన్యకుబ్జా, గౌడమైథిలికోత్కళాః। గౌడాఃపంచవిధాఃఖ్యాతా, వింధ్యస్యోత్తరవాసినః। ఆంధ్రద్రావిడకర్ణాటా మహారాష్ట్రాశ్చగూర్జరాః। పంచైతే ద్రావిడాః ప్రోక్తావింధ్య దక్షిణవాసినః-స్కాందము. వాచస్పత్యము. పాఠి=చతుర్వేద సంహితాపాఠముగలవాఁడు. తద్వికృతి=పాడి. పాడియను శాఖానామమిచట నింటిపేరుగా వాడంబడుచుండె. సీ. తడఁబాటుగలదు వేదముల నాతనికంచుఁబరమేష్టి మెచ్చరుధరణిసురులు-* * పాడిదప్పక ధర్మంబుపట్టువిడక-లక్షలకునమ్మజాలినల్లడలభూమి; వరులు మేలనఁదగి యిట్లుపుడిఁబొలుతురు-చదువుసాముల ధనధాన్యసంపదలను, అని విజయవిలాసము. ఈకవి రచియించినగ్రంథములు-1. విచిత్రనైషధము తెలుఁగునాటకము—2. ప్రియదర్శన-3. మాలతీమాధవము-ఈరెండును సంస్కృతమునుండి తెనిఁగింపఁబడినవి. 4. ఆంధ్రకావ్య ప్రయోనిధి-కావ్యప్రకాశ, కావ్యదర్పణములోని లక్షణములఁ దెనిఁగించుచు. సవార్తికముగా నాంధ్రగ్రంథములలోని యుదాహరణములు చూపఁబడియె. 5. ఆంధ్రకౌముది. హరికారికావళికి విపులవ్యాఖ్యానము. 6. ఆంధ్రీకృతకౌముది భట్టోజీదీక్షిత కృతపాణినీయసూత్రకౌముదికిఁ దెలుఁగు. 7. ఆంధ్రాక్షరతత్త్వము. 8. ఆంధ్రశబ్దానుశాసనము, ఆంధ్రధాతుపాఠ, గణపాఠ, సూత్రపాఠసహితము.

12. శస్త్రసమూహము-శాస్త్రము-విభా+అసి+విద్య=కత్తిసాము. అమర+కాండ=దేవబాణము-అమరనిఘంటుకాండము. ని. కాండోస్త్రీదండ బాణార్వవర్గావసర వారిషు. అనియమరము.

14. రాజరాజ=కుబేరుఁడు. ని. రాజరాజో ధనాధిప, యనియమరము, ప్రభువులకెల్లప్రభువు. సర్వజ్ఞమైత్రి=ఈశ్వరునితో స్నేహము. విద్వాంసులతో స్నేహము. ధనదుఁడు=ధనదుఁడను పేరుగలవాఁడు. ధనమునిచ్చువాఁడు. 'ధన= ధాన్యే' యనిధాతువు. నిధినాయకుఁడు=నవనిధులకుఁ బ్రభువు. నిధినిక్షేపము లుగలవాఁడు. (సప్తసంతానములలో నొకటి.) మనుజధర్మాఖ్య=మనుజులధర్మ ములుగలవాఁడు. మనుజ+ధర్మ=మనుస్మృతిధర్మములతో నతిశయించువాఁడు. సో మాఖ్య=సోముఁడను పేరు, ని. సోమఃకుబేరేకర్పూరే లతా భేదేసుధాకరే. యని నానార్థరత్నమాల. చంద్రునివంటికీర్తిగలవాఁడు. శ్రీదుఁడు=లక్ష్మి నిచ్చువాఁడు. సంపత్తులనిచ్చువాఁడు. వైశ్రవణుఁడు=విశ్రవసునికుమారుఁడు. విశేష మగు వినికిఁగలవాఁడు. యక్షశిక్షకుఁడు=యక్షులనుపాలించువాఁడు. అక్షములు= ఇంద్రియములను జయించువాఁడు.

17. ఉత్తమణుఁడు=అప్పు నిచ్చువాఁడు. కాండాయమాన=సమూహ ముగాఁ జేయఁబడిన. వేదండపుట=ఏనుఁగులసమూహము. గృహాంగనము=ముందరి వాకిలి. దుర్దమకర్దమము=హెచ్చగుబురద, జంభాసురారి కుంభీంద్రము=దేవేంద్రు నియేనుఁగు=ఐరావతము. అంభోజవైరి డింభావతంస=బాలచంద్రుఁడే శిరోభూష ణముగఁగలవాఁడు. అఖండలుఁడు=ఇంద్రుఁడు. వ్యు. వజ్రాయుధముచే సమ స్తము గొట్టువాఁడు. శంభుక్ష్మాభృత్=కైలాసము. శేముషి=బుద్ధిని. మహా జనులు=వైశ్యులు అంబోదవాజి=దేవేంద్రునియొక్క జృంభత్సువాజి=విజృంభించిన గుఱ్ఱము=(ఉచ్చైశ్శ్రవము) కుంభినసేశ=సర్పరాజు. సురకుంభినీశాంభోధి సంభూత మణి=సురరాజుయొక్క చింతామణి. కుంభిద్విషత్=సింహము. అంభోరుహసం భవ కుంభిగమన=సరస్వతి. అంభోజనేత్రపర=కృష్ణునియన్న. బలరాముఁడు. గాంగేయభూధరము=మేరువు. అంతరీపము=ద్వీపము.

18. హరిపన్నాళీక=హరి+పత్+నాళీకములు=నారాయణమూర్తియొక్కపాదపద్మములు.

20. లఘుకాలలయములు=త్వరలో నశించునవి. నిక్షేపములు=భూమిలో పాతినవి. విక్షేపములు=పట్టుకొనిపోవునవి. అగ్రహారములు. అగ్రాణాం=బ్రాహ్మ ణానాం, హారః. అగ్రహారఃఅనువ్యుత్పత్తిననుసరించి. ఉగ్రాణాం=దుష్టానాం, హారః=ఉగ్రహారః. సరసులు=కోనేర్లు. విరసగతులు=నీరులేకపోవునవి.

23. తరువులు=వనము. దైవతసద్మము=దేవాలయము. భవ్యత=మంగ ళస్వరూపము. ని. భావుకం భవుకం భవ్యం కుశలం క్షేమ మస్త్రియా. మని యమరము.

24. జాంబూనదాంబరములు=జలతారుబట్టలు.

25. ఇందిరా...స్థలము=లక్ష్మీదేవికి మందిరముగాఁ జేయఁబడిన. పీన=బలసిన. వక్రనక్రచ్ఛేద=కుటిలమైన మొసలిని భేదించెడు. విక్రమోద్భాసిత=విక్రమముచేతఁ బ్రకాశించు. చక్రాయుధావాప్తి=చక్రాయుధముయొక్క పొందుటను జరుపుచున్నవాఁడు. అనఁగాఁబొందినవాఁడు. గజేంద్రమోక్షము. వేదాంగములు=(శాస్త్రాదులు). 1. శిక్షా. 2. వ్యాకరణము 3. ఛందస్సు. 4. నిరుక్తము 5. జ్యోతిషము 6 కల్పము, సంవేది=తెలిసినవాఁడు. వేది=వేదములుగలవాఁడు=బ్రహ్మ. గోధవృందు=స్వర్గాధిపతి-బ్రహ్మ మొదలైనవారు. నాభిపద్మము-నాభియనుపద్మము, పద్మనాభుఁడు. నాక + లోకాలోక + లోక=స్వర్గ చక్రవాళస్థ జనములు.

28. అతఁడష్టాదశ పీఠసంచయమునందు—అష్టాదశపీఠములు వివరము. శ్లో.-1. లంకాయాంశాంకరీదేవి. 2. కామాక్షీకాంచికాపురే. 3. ప్రద్యుమ్నే శృంఖలాదేవీ. 4. చాముండా క్రౌంచపట్టణే. 5. అలంపుర్యాం(హో)జోగులాంబా. 6.శ్రీశైలె భ్రమరాంబికా 7.కొల్లాపురేమహాలక్ష్మీ.8.మాయాయామేకవీరికా.9. ఉజ్జయిన్యాంమహాకాళీ.10.పీఠాయాంపురుహూతికా,11.ఓఢ్యాణేగిరిజాదేవి. 2. మాణిక్యాదక్షవాటికా.13:కురుక్షేత్రేకామరూపే.14 .ప్రయాగేమాధవేశ్వరి. 15. జ్వాలాయాంవైష్ణవీదేవీ. 16, గయామాంగళ్యగౌరికా. 16. వారణస్యాం విశాలాక్షీ. 18. కాశ్మీరేచ సరస్వతీ అష్టాదశచపీఠాని యోగినీదేవినిర్మితా.

31. అర్జునీభూతాఖిలాంగ=తెల్లఁబడిపోయిన యఖిలాంగమును. హరసూతి=విఘ్నేశ్వరుఁడు. ధవళీకృతోరుకంధరుఁ=తెల్లనైన పెద్దకంఠంబుగల సాంబమూర్తిని.

33. చిత్తసముద్భవతుల్యరూపులఁ=మన్మథునితో సమానమైన రూపులు. సారసనేత్రమిత్రుఁడు=నారాయణునిమిత్రుఁడు=ఈశ్వరుఁడు. హార=ముత్యాలహారము. పటీరము=చందనము. కుంద+ఇందు=మల్లెమొగ్గలు, చంద్రుఁడు. శారద + కంద=శరత్కాల మేఘము.

37. మృష్టాన్నంబు=చక్కఁగాఁబాకముచేయఁబడిన యన్నము. వైఁడాన్వయాంభోధి రాజ+రాజునకుఁ=క్షీరసాగరమునకు, జంద్రుఁడు. శ్రీలక్ష్మికిఁ + అన్న=శ్రీలక్ష్మికి నగ్రజుఁడు=చంద్రుఁడు.

38. రాముఁడు—జగదభిరాముఁడు=జనులకు సంతోషము చేయువాఁడు. సుగుణశోభిష్ణుఁడు=సుగుణములచే సంపదకి నిష్ణుఁడు. సుగుణములు=సత్వరజస్తము

ములు. సృష్టిస్థితిలయములు. వేంకటనగర్త = వేంకటేశ్వరుఁడను పేరుగలవాఁడు. శేషాద్రి=తిరుపతి కొండ, శ్రేష్ఠమైనగిరి. నీలాద్రి=జగన్నాథస్వామి నెలకొన్న పర్వతము. గంజాముమండలమున నున్నది. ఇంద్రనీలఖచిత క్రీడాపర్వతము ద్వారక=యను పేరుగలది. అనేకద్వారములుగలది. విబుధులు=దేవతలు; పండితులు.

33. ధామము=స్థానము, శీలము=సద్వర్తనము. రుచి=కాంతి. వర్ణనసీమ=వర్ణించుటకుహద్దు. వధూలలామ=స్త్రీలలో శ్రేష్ఠురాలు (లలామ=పాపిడిబిందీలు ఇవి యలంకారములలో నెంతయందమైనవో యంత శ్రేష్ఠురాలు.) స్వీకృ... ధామ=స్వాధీనము చేసికొనఁబడిన గురువులు, బంధువులు, స్నేహితులు, పండితులు, వీరితోఁగూడిన గృహముగలది. బుధదాన=పండితులకునిచ్చుటచేత.

40. వీరమ్మ—విబుధాధారమ్మ=విబుధ ధారమ్మ+అ.

42. అమృతంబు + చెలమ + అ + ఐ + మించున్; కాంచనాచలము + అయ్య + ఐ + క్రాలున్. ఇట షష్ఠీసమాసమున నుగాగమంబులేమి ప్రయోగవైచిత్ర్యంబు. నలువురు నాల్గుదెసలకు వలయువారు. 1. విభవము=ఐశ్వర్యము. తూర్పు. ఇంద్రుఁడు. 2. వర్తనము=ధర్మవర్తనము, దక్షిణము, యముఁడు, 3. విత్తాన్వితి=ధనసమృద్ధి, ఉత్తరము, కుబేరుఁడు. 4. విశదగతి—నిర్మలగతి, పడమర. వరుణుఁడు.

43. భానుమత్ + సారథి=సూర్యసారథి=అనూరుఁడు; సత్క్రియా సార + థి. చంద్రిర=చంద్రుఁడు.

44. ధరస్వామి=పర్వతశ్రేష్ఠుఁడు, మేరువు; బాడబజీవనము=బ్రాహ్మణ జీవనము. స్పర్శనము=దానము.

47. 1 బిచ్చమెత్తుచునున్న ప్రియుఁడు; ఆదిభిక్షువు=శివుఁడు. అభిజాత్య=సత్కులప్రసూత. 2 దంపదూఁడులు మెక్కుదొర=వరాహావతారమూర్తియైన విష్ణువు. వసుమతి=భూదేవి. 3 ధరణిదానముఁబట్టు ధన్యుఁడు=వామనమూర్తి. 4 కళ్యాణి=భూమి. ని. కళ్యానిమంగళే సర్వే కళ్యాణీ పార్వతీభువోః అని నానా. పూర్ణతే + అపంశతా + భవ్య; భవ్యము=సంపద. ని. భావుకం భవుకం భవ్యం, అని అమరము.

49. 1 కవి=వాల్మీకి; రాజు=చంద్రుఁడు; కవిరాజులు=కవిశ్రేష్ఠులు. 2 నరుఁడు=అర్జునుఁడు, సింహము=మృగేంద్రము, వరసింహములు=నరశ్రేష్ఠులు. ని. సింహశార్దూలనాగాద్యాః పుంసిశ్రేష్ఠార్థగోచరాః । ముదుజ్వంతా మహాత్మ్యార్థే క్వచిత్స్వార్థే రుచిర్యది । శ్రేష్ఠతాయామహతః క్వచిద్ధుజపిసమ్మతః. అని అథర్వ

డుండు 3 ధీర + ఇందర్గ్రి=సముద్రుండు ; ధీరేంద్రులు=పండితేంద్రులు. ని. ధీరస్తు నాబుధ్ధే, అంబుధౌచ త్రిషుత్వేష మందరే ధైర్యవత్యపి అని, నానా ; 4 నర + వీర =బ్రహ్మ + వీరభద్రులు. నవీరులు=నరశ్రేష్ఠులు గోపాలన=సరస్వతీపాలనము విక్రమము=పరాక్రమము. 5 గురు + మహాబలులు=బృహస్పతి, వాయువు.

54. శశిచారుమతి=రోహిణి. నలవిభావతి=దమయంతి. శక్రోభిగతి = శచీదేవి.

64. లక్ష్మీనాయకస్య + స్యాదిగతః. ఉభయత్ర.

67. ౧ రామ + కృష్ణ-గోపాలనము=భూపాలనము + గోపాలనము. ౨ రామ + కృష్ణ=బ్రహ్మ + వ్యాసులు ; వేదభేద + శాఖాభేదములు. 3 రామ + కృష్ణ= నారాయణ + అర్జునులు, లక్ష్మీ + విజయశక్తి రాంఛనములు=లక్ష్మీలాంఛనము ; విజయ లాంఛనము. ర రామ + కృష్ణ=ఈశ్వర + అగ్ని ; భూతి + పావనము=ఐశ్వర్య + శుచిత్వము. ని. రామః పశౌ జామదగ్న్యే హరౌ రాఘవయోశ్చన। శితాశితమనో జ్ఞేషు త్రిషు. అని, నానార్థ. ని. వ్యాసార్జునాగ్ని హరి కోకిల కాక శూద్ర తామిస్ర పక్షకరినీలగుణేషు కృష్ణః. అనియు నానా.

70. మందిరమునకును క్షీరాబ్ధికి నభేదాధ్యవసాయము. ౧ దాంతశోభ= దంతసంబంధమైన శోభగలది, మందిరము ; తెల్లనయిన శేషశయ్యగలది సముద్రము. అనంతతల్ప=అనేకములైన తల్పములు. భూరిసత్పాత్రము=సువర్ణపాత్రముగలది. మందిరము. విశాలమైన మధ్యభాగముగలది సముద్రము. ని. పాత్రంతు భోజనే తీర ద్వయాంతరే యోగ్యే. నానార్థము. ౨ నవవిధరత్నములకు నాకరమను ఖ్యాతిగలది. రెంటికి సమానము. జనితసౌధపర్రిభ=సుధాపర్రిభ గలది మందిరము. అమృతము పుట్టి నది, సముద్రము. 3 సింధుసంకీర్ణము=ఏనుఁగులుగలది యిల్లు. నదులతోఁగూడినది సముద్రము. ని. అస్త్రీనద్యాంనదే సింధు దేశభేదేంబుధౌగజే. అని విశ్వ. నీలకంఠ ప్రియనిలయమగుచు=నెమళ్ళకు నెలవైనది మందిరము. నీలకంఠప్రియుఁడు=విష్ణువు, వానినివాసము సముద్రము. ర సర్వజ్ఞశేఖరులు=పండితులు ; మందిరము. చంద్రుని పుట్టువునకు స్థానమయినది సముద్రము. మహాదేవ సేవ్యము:—మహాదేవుఁడు=శివుఁ డు. మందిరము ; అనేకదేవతలకు సేవ్యమయినది సముద్రము. ౫ బుధతరులె=పండిత శ్రేష్ఠులు; మందిరము. బుధ + తరులు=గల్పవృక్షములు, సముద్రము దేవవృక్షము లైదు. ని. పంచైతే దేవతరవో మందారః పారిజాతకః। సంతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచందనమ్. అమ. ౬ మహాలక్ష్మీజననవాసభూమి=లక్ష్మికి నెలవైనది మందిరము. లక్ష్మీపుట్టినట్టినివసించునట్టి ప్రదేశము; సముద్రము.

71. ౧ శ్రీ=లక్ష్మి=సరస్వతి. శ్రీవిలాసుఁడు=బ్రహ్మ. లక్ష్మీవిలాసుఁడు=అచ్యుతుఁడు. ౨ ప్రత్యర్థి=యాచకులకిచ్చుటయందుఁగర్ణుఁడు. శత్రువు లను జీల్చుటయందర్జునుఁడు. ౩ (గో=అచక్షుండనే ధాతువు) గుణవర్మచతురత=గుణములయందును యజ్ఞాదులయొక్క నేర్పునందును. పాండుతనయుఁడు=ధర్మరాజు. నారియొక్కయు ధనుస్సుయొక్కయు నేర్పునందు శ్రీరాముఁడు. ౪ సత్య + అద్రియ + భూతి = హరిశ్చంద్రుఁడు ; సతీ + అద్రియ + భూతి, సతీ=పార్వతియొక్క + అద్రియభూతియందు. చంద్రజూటుఁడు=శివుఁడు.

73. ౧ సాధు + బృంద + అవన=సత్పురుష సమూహమును రక్షించువాఁడు. రాముఁడు. బృందావన. సరణిని బ్రోచినవాఁడు, కృష్ణుఁడు. గో=భూమి. దానిని పాలించువాఁడు రాముఁడు. గోపాలనము=పసుపాలనము. అది చేయు వాఁడు. కృష్ణుఁడు. ౨ గోత్ర + ఉద్వహనస్ఫూర్తి=కొండనెత్తుట=గోవర్ధనపర్వతమెత్తి నవాఁడు కృష్ణుఁడు. వంశగానము=సలకీర్తనఖ్యాతిఁగలవాఁడు రాముఁడు. వంశ=వేణువు. దానిని గానముచేయువాఁడు కృష్ణుఁడు. ౩ నర + శత + అంగ + ఆకల్పగరిమ=నూఱులకొలఁది జనులయొక్క యనయము యలంకారశోభను గల్గించినవాఁడు=అనేకపండితులు మొదలగువారికి నలంకారములు బహుమానముగా నిచ్చినవాఁడు రాముఁడు. నర + శతాంగ=అర్జునియొక్క రథమునకలంకారలక్ష్మిని గలిగించినవాఁడు కృష్ణుఁడు. సత్య + భా + మా + ప్రీతి సత్యమునందును, తేజము నందును లక్ష్మియందును ప్రీతిచేయువాఁడు రాముఁడు. సత్యభామా, ప్రీతిఁగలవాఁడువిష్ణువు. ౪ నవ + యశః + ద + ఆనందనందనుఁడు=నూతనయశస్సును గలిగించెడు ప్రేమపుత్రుఁడు రాముఁడు. నవ + యశోదా + ఆనందనందనుఁడు=యశోదాదేవికి నూతనప్రీతిని గల్గించువాఁడు కృష్ణుఁడు. ఘోర + అఘసంహార=ఘోర పాతకనాశంకరుఁడు రాముఁడు. క్రూరుఁడైన యఘాసురుని సంహరించుటవలన గీర్తిని గాంచువాఁడు కృష్ణుఁడు. ౫ రామ + కృష్ణ + ఆఖ్య=రామునియొక్క, కృష్ణునియొక్కఖ్యాతి.

74. సహస్ర + అగార + నలాక్షులు=ఇంద్రుని గృహమందుండెడి స్త్రీలు నలాక్షులు=పద్మమువంటి నేత్రములుగలవారు.

75. సప్తసంతానములు. శ్లో. తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాపనం శివాలయం। ఆరామకృతికూపానిసప్తసంతానః ప్రకీర్తితాః.

76. రాజీవకరుఁడు=శివుఁడు. ని. రాజీవ మజ్జేరాజీవోమృగమత్స్యయః నానార్థరత్నమాల. సత్ + వరులు=సత్తరులు=పూజ్యులు, శ్రేష్ఠులు.

77. తౌర్యత్రికములు=నృత్యగీతవాద్యములు. ని. తౌర్యత్రికం నృత్యగీతవాద్య మని యమరము.

81. సనాథుఁడు=కూడుకొనినవాఁడు. నుతశశాధర్త=కొనియాడఁదగిన శస్త్రములను ధరించినవాఁడు. వరసతీపుత్త్రుఁడు=పార్వతికుమారుఁడు.

82. కుంభిత=కుట్టినచేయఁబడిన. తమః=రాహువు. రాజు=చంద్రుఁడు; దేవగృహసీమలు=దేవాలయప్రదేశములు.

83. ౧ శర=రెల్లు. హంస=మరాళము: హంస=విష్ణువు. అతఁడు శరము గాఁగలవాఁడు, హంసశరుఁడు=శివుఁడు; వరహీరములు=వజ్రములు. హీరవరము=వజ్రాయుధము. ౨ ధరమహేశ=పర్వతాధీశుఁడు. హేశధరము=కైలాసము. చంద్రతారలు=శశి. నక్షత్రములు. తారచంద్రము=శుద్ధరజితము. హరిరాజము=సర్పరాజు=శేషుఁడు. రాజహరి=ఉచ్చైశ్శ్రవము. ఐరావతము. రసక్=భూమియందు. సుధారసధార=అమృతధార, రసము=పాదరసము. ౩ కల్పకంబుల=కల్పవృక్షముల; కంబుకల్పకంబు=శంఖమువంటి యుదకము; సకుందములు=శ్రేష్ఠమైనమల్లెమొగ్గలు; కుంద=శ్రీకృష్ణునికంటె, సకుఁడు=శ్రేష్ఠుడు, బలరామమూర్తి. ని. కుందం మాఖ్యేచ కుందోనా నిధిభిదే మురద్విషః. శ్రేష్ఠేన్యదూర జ్యేష్ఠేషు సరస్యా ద్వాచ్యలింగకః అని నానార్థము.

86. చ్యవనాళివేణి=సుకన్య, నీలసంభూత=స్వాహాదేవి, నలహేరు కాయ=దమయంతి, హరిశుకవాణి=లక్ష్మి, దేవేంద్రమాత=అదితి, కోసలజాత=కౌసల్య. అనంత=భూదేవి, కుంభజకాంత=లోపాముద్ర, శశికుందదంశ=రోహిణి.

88. మఃబ్భక్ వార్వపుజోదు=మేఘము వాహనముగాఁగల ప్రభువు. ఇంద్రుడు. కా. సోఽయంక్వచిత్ స్థిశేపిస్యాత్. అని హరి. సుమనోమాన్యైక సద్భోగులు=పండితులకు గొనియాడఁదగిన భోగములు కలవారు.

89 నందునినందనుఁడు=కృష్ణుఁడు. కమలానందనుఁడు=మన్మథుఁడు. భాస్కరనందనుఁడు=కర్ణుఁడు.

90. కానీనుఁడు=కన్యాపుత్త్రుడు=కర్ణుఁడు. సూ. కన్యాయాఃకనీనచ. 4-1-116 పాణిని.

93. హైమకరోచి=చంద్రుఁడు, వీచి=తరంగము.

94. రామునకును గృతిపతికి నభేదాధ్యవసాయము. ౧ విబుధ=దేవతలు, పండితులు. విశ్వామిత్రయాచకుఁడు=విశ్వామిత్రుడను ఋషి యాచకుఁడుగాఁగల

వాఁడు రాముఁడు. సూ. మిత్రేచర్షౌ. 6-3-130 పాణిని. విశ్వ + అమిత్ర = జగద్విరోధులు, యాచకుఁడు = యాచకులుఁ గలవాఁడు కృతిపతి. ౨ అఘ + తాటకా + గ్రాహహరణప్రభావుండు = దుర్మార్గురాలగు తాటక యనెడు గ్రాహమును హరించుటయందు సామర్థ్యము గలవాఁడు రాముఁడు; అఘతా + అటక + అగ్రహ. అఘతా = అఘత్వము. అటక = పొందినవారియందు. అగ్రహము గలవాఁడు కృతిపతి; శివ = శివుని యొక్క. ధర్మ = ధనుస్సుయొక్క. దాన = ఖండనముచేత. సంశ్లిష్ట = కూడుకొనఁబడిన. లక్ష్మీ = లక్ష్మియైన సీత గలవాఁడు రాముఁడు. శివ = శోభాయుక్తమైన. ధర్మ = ధర్మము దాన = దానములచేత. సంశ్లిష్ట = పొందఁబడిన. లక్ష్మీ = ఐశ్వర్యముగలవాఁడు, కృతిపతి. ౩. స్వగురు = తనగురువుచేత. ఉపదిష్ట = ఉపదేశింపఁబడిన. సవన = యజ్ఞసంబంధమైన. సన్మార్గుఁడు = మంచిమార్గములు గలవాఁడు రాముఁడు, లేక తనతండ్రిచేత నుపదేశింపఁబడిన వవసంబంధమగు మార్గముతోఁ గూడినవాఁడు రాముఁడు. తనగురువుచే నుపదేశింపఁబడిన, ఉరుసవన = గంగాది మహానదీస్నానములు గలవాఁడు కృతిపతి. ని. సవనంసోమనిష్పేషజన నస్నానయోరపి. అని నానార్థము. ౪ ఖరదూషణక్షపాచరవిరోధి = ఖరుఁడు, దూషణుఁడు మొదలగు రాక్షసులకు విరోధి రాముఁడు: ఖలదూషణులు రలలకభేదము. దుర్మార్గులకు, చోరులకువిరోధి, కృతిపతి. ౫. భూ + సుగోత్తమజాత + భూరిసంపద్దాత. సుగోత్తమ జాతుఁడు = సుగ్రీవుఁడు, అతనికైశ్వర్యమిచ్చినవాఁడు రాముఁడు. భూసుగోత్తమజాతము = బ్రాహ్మణసమూహము, దానికైశ్వర్యమునిచ్చినవాఁడు కృతిపతి. ఆతత = విస్తారమైన. నయ = సేతువును వారిధియందు గట్టినవాఁడు రాముఁడు. నీతియనెడుసముద్రమును గట్టినవాఁడు కృతిపతి. ౬ పంక్తిముఖవిదారి = రావణుని సంహరించినవాఁడు రాముఁడు, ఖలపంక్తి = దుష్టసమూహము యొక్క చీల్చువాఁడు కృతిపతి.

99. పాథేయము = త్రోవతిండి.

104. సారసబాణుఁడు = మన్మథుఁడు, సారసవైరి = చంద్రుఁడు. కళలు = షోడశకళలు = విద్యలు. సారసమిత్రుఁడు = సూర్యుఁడు, సారసనేత్రుఁడు = నారాయణుఁడు. సారససారవాక్ = మధురవాక్కులుగలవారు బుధులు. లేక, అమృతవాక్కులచేఁ గొనియాడఁదగినవాఁడు; సారససూతి = బ్రహ్మ. సారససారము = మకరందము. ప్రతిభాన్వితుఁడు = నవనవోన్మేషమగుబుద్ధివిశేషముగలవాఁడు. ప్రతిభ, స్మృతి, మతి, బుద్ధి, అని నాలుగువిధములు. స్మృతి = వెనుకసంగతులను జ్ఞాపకము తెచ్చునది. మతి = ముందుసంగతులు యోజించునది. బుద్ధి = త్రికాలమందే యోజించునది.

105. ఏచిన్నవాఁడు — రామకృష్ణశ్రేష్ఠుని లక్ష్మియనెడిగొప్పదైన పాలసముద్రముయొక్క ఉల్బణమునకుఁ గారణభూతుఁడు. కృతిపతిగర్భమందుండఁగానే

విశేషవనముకలిగినది. ఏసత్పురుషుఁడు—పైఁడావంశమనెడు కల్పవృక్షమునకుఁ గల్పవృక్షము మిగుల సంతానసంతుఁడు. ఏమేఁటి—ఆసతండ్రిగారిలక్ష్మినిమరలఁ గలుగునట్లుచేసెను (దాయాదవాక్యమునఁబోయినదానిని దిరుగసంపాదించెను) ఏఘనుఁడు—కాకినాడకంతయు గౌతమునిచెలె గోదావరిజలమును గొట్టములగుండఁ దెప్పించెను. (ఏఁబదివేలరూపాయలు గవర్నమెంటువారికిచ్చి కాకినాడలోని ప్రతివీథిని గొట్టములను, జలధారలును (Pipes and fountains) పెట్టించెను. అధర్మమున సంచరించిన మహోద్యోగిని శిక్షింపఁజేసినవాఁడు.

106. ౧ సుదర్శనము=సుదర్శనచక్రము=యోగ్యదర్శనము. తమఃపాటవము=రాహువునుగొట్టునది ; అజ్ఞానమును పోఁగొట్టునది. ౨ సద్గుణధర్మము=యోగ్యమైన వారియొక్క—పటిమ ; ధర్మకార్యము. పుణ్యాజనులు=రాక్షసులు, పుణ్యాత్ములు, వర్ధనము=ఛేదించుట ; వృద్ధిపరచుట. ౩ దరము=శంఖము ; ఆదరము=అపిణము. ప్రత్యర్థులు=విరోధులు ; యాచకులు. స్వస్థితి=స్వస్థితి, స్వ=ధనము యొక్క—స్థితి. భూములు మొదలగునవి, ప్రదుఁడు=ఇచ్చువాఁడు. ౪ మహానందకము=నందకమనెడి యాయుధము; మహాసంతోషము. నిరు..గరిమంబు—నిరుపమ + మదధర + అసుర + దాన + గరిమంబు=మదించిన రాక్షసులను ఖండించుట. ధరాసుర=బ్రాహ్మణులసనానుగ్రవైభవము. గదా=కౌమోగకీగదయనెడి యాయుధము ; ఖల్వర్థకమైన యవ్యయము. విబుధులు=దేవతలు=పండితులు.

107. సౌరభేయి=కామధేనువు. తరణిజుఁడు=కర్ణుఁడు, కౌరవదాసుఁడు=కౌరవులసన్నిహ్యుఁడు. శ్రీదుఁడు=కుబేరుఁడు. పింగాక్షుఁడు=పింగళనేత్రుఁడు, పిల్లికన్నులవంటి కన్నులుగలవాఁడు.

113. దుగ్ధవార్ధిరాట్కన్య=లక్ష్మి; శీతనగకన్య=పార్వతి, భీమరాట్కన్య=దమయంతి. భీష్మరాట్కన్య=రుక్మిణి.

114. భూసతి=భూదేవి, శ్రీసతి=లక్ష్మీదేవి.

127. అంతర్ముఖులు=మనస్సుచేత చూచువారు, విద్వాంసులు, పునీతుఁడు=పవిత్రుఁడు.

132. సాలము=ప్రాకారము=సాలవృక్షము, అనంతరత్నపదము=సూర్యునిపదము=ఆకాశము. శేయము=కందకము, అనంతరత్నపదము=అనంతునియొక్క—రత్నములకు స్థానము=పాతాళలోకము. శాలలు=గృహములు, అనంతరత్నపదము=అస్తారరత్నసముదాయముగలది.

133 సుపర్వులు=పుణ్యాతిథిగలవారు, సంతోషముగలవారు. సుజ్ఞానగీర్వాణులు=దేవతలు, గోవరలు=రాజులు. తతమఖులు=విస్తారమైన యజ్ఞములు చేసినవారు.

134. రాజకుమారులు=రాచకొమరులు. విగనరాజకుమారుడు=ఇంద్రకుమారుడు, నలకూబరుడు, రాజ=చంద్రుడు. నిధిరాజు=కుబేరుడు. పార్వతీరాజకుమారుడు=కుమారస్వామి. రుచిరాజు=సూర్యుడు. భార్గవీరాజకుమారులు=మన్మథులు. జలరాజకుమారులు=సూర్యునికుమారుడు. కర్ణుడు.

135 గోధినాథులు=పశుపాలకులు.

137. ౧ ఆపురమందలి గుణ్ణాములు, ధర్మగుణాక్షేపతను=ధనుస్సుయొక్క నారిని లాగుట చేత, జిమ్ముట, ధర్మగుణమును నాక్షేపించుట. శరవేగము=బాణవేగము. ౨ పక్షపాతము=ఒకపాటు, కొందఱియందు మంచిని కొందఱియందు కీడును జెప్పుట. పైపైతిరిగెడు=పైపైని దిరుగువాడు! అకాశమునందు దిరుగువాడు. 3 శాఖిశాఖాభంగసంచారము=వృక్షముల శాఖలను భంగముచేయుటచే వేదముల శాఖలను భంగము చేయుటచే, శ్వసనుడు=వాయువు. సప్తి=సూర్యాశ్వము.

138. ౧ ఆపట్టణమునందలి యేనుగులు. దానధార=మదధార, దానముయొక్క ప్రవాహము. విపులకర్ణఖ్యాతి=పెద్దచెవులుగల ఖ్యాతి, కర్ణునియొక్క ఖ్యాతి. ౨ పద్మవిలాసకలన=లక్ష్మీవిలాసముతోగూడుకొనుట, ఏనుగులకుండు బొల్లులకు బద్మకములని పేరు. కమలాకరస్ఫూర్తి=లక్ష్మీస్థానము, కొలనుకాంతి. 3 నారద=నారదుడు, తెల్లని మేఘము. పర్వత=భూధరము. పర్వతుడనెడు ఋషి. ౪. కుంభసంభవ=ఏనుగు, ద్రోణాచార్యుడు. ద్రుపదవిచ్ఛేదము, ద్రు=వృక్షములయొక్క, పద=వేళ్ళను, విచ్ఛేదము=కొట్టుట. ద్రుపదరాజునుకొట్టుట.

140. ౧. నారికేళులు=కొబ్బరిచెట్లు, స్త్రీవిలాసము. సరసఫలములు=రసముతోగూడిన ఫలములు సరసులఫలములు. ౨. కమలాకరము=సగస్సు; లక్ష్మీదేవిహస్తము. సారసము=పద్మము; పద్మశోభ. 3. రాజమార్గంబు=రాజవీధులు; భద్రమార్గంబులు సత్పాత్రసంపద=యోగ్యరత్నముల సంపద; సత్=నక్షత్రములచే బ్రకాశించునది. వాహినీవరములు=శ్రేష్ఠమైన సేనలు, నదీశ్రేష్ఠములు.

142. ౧. వటులక్ + గన్నెరులకుక్=గన్నేరుబుష్పములకు. వటులక్ + కక్ + నెలరుకక్=ఇప్పనట్టి కురులకు. బార=పందొంము, బారకుక్=రెండుగజముల పొడవు. ౨. గోరంట=గోరంట, గోరు + అంటక్=నఖక్షతములు సేయు

రాగ=రాగము; శ్రీరాగ భైరవాది రాగములు ముప్పదిరెండు; రాగానుగతము=అను రాగముతోఁ గూడుకొనునది. 3. దండలవరి=భుజముల సమీపమునవున్న. చనుఁ జెండులు=పూలగుత్తులవంటి స్తనములు. కొనక=నిలుచుటకు. కోటికిక=కోటిసొమ్ముల కైనను; కొనగోటికిక=నఖక్షతములు చేయుటకు. 4. బొడ్డుమల్లియ=ఈ పేరుగల పుష్పవిశేషము. మాటఁబోలునె=దాఁచఁదగునా ? బొడ్డుమల్లియె=బొడ్డు అనెడు మల్లియ. వరనిధులకుక=గొప్పనిధులుగలవారికి. ఓవర ! నిధులకుక=గుణనిధులకు. one who possessed good qualsties. Apt Dic.

143. ధరములు=పర్వతములు, కుచములు. నీరాంబుధరములు=నీలమేఘములు. నరములు=హోద్రిదములు. సవకోకనదములు=ఎఱ్ఱదామరలు. కంబులు=శంఖములు మానికంబులు=సూణిక్యములు. కరములు=ఏనుఁగుతొండములు. ఊరువులు=తొడలు. శుభ్రాంశురకములు=చంద్రకిరణములు.

146. చక్రము=ఆయుధము, సమూహము. కమలమంజులపాణి కమలంబు చేకొని=లక్ష్మిని పాణిగ్రహణము చేసికొని. వినరనందనుఁడు=గరుత్మంతుఁడు. వినతసంచనవృత్తి సముద్రలయందానంద భావము. విమలరక్షవృత్తి=పుణ్యాత్ముల రక్షించు వ్యాపారము.

147. జాలాంబుదము=కృత్రిమ మేఘము. హీర=వజ్ర వికారమైన. హీరద్వార=సింహద్వారము. నిశాంత=ఇల్లు. ఉడుకాంతకాంత=చంద్రకాంత. రత్నరత్న=శ్రేష్ఠరత్నములు. ధామ=కాంతి, ఇల్లు. ధర్మసౌధము=బంగారుమేడ. కాంచనవేది=బంగారపుటరుగు. ఘాణ=మేఁత. ఖంఖాణము=గుఱ్ఱము. ఖంఖాణము. రూపాంతరము. అని శబ్దరత్నాకరము. మ. తలఁపంజొప్పడి యొప్పెనప్పుడు తదుప్యజ్ఞైత్రియాత్రాసము త్కటలీకా రింఖదసంఖ్యసంఖ్య జయవ ఖ్రంఖాణరింఖావిశ్చం । ఖిలసంఘాత ధరాపరాగ పటలాక్రాంతంబు మున్నే అన । ర్గళ భేరీరవనిర్గళద్గగన రేఖాలేపపంకాకృతిక. రాఘవపాండవీయము. ఆ. 1-9.

148. అహి=వృత్రాసురుఁడు, సర్పము, కాశ్యపి=ఇంద్రుఁడు,గరుడుఁడు

150. మరుదీశ్వరునిక=ఇంద్రుని.

152. అర్థిసురగోరుహవల్లి=యాచకులకుఁగల్పలత.

154. అమృతపాదుఁడు=చంద్రుఁడు. పాదప్రభరు=కిరణకాంతులు.



# శ్రీ ప్రభావతీపరిణయము



## ద్వి తీ యా శ్వా స ము.

## టి ప్ప ణ ము.

4. ౧ పరమహంస=సన్న్యాసిభేదము. దూతాదిగణములోఁ జేరినది; కాన, దుష్ప్లోపము. శ్రేష్ఠమైనహంసలు. కుశాదిగణములోనిది ; కాన, మువర్ణకములోపము.

శ్లో. చతుర్విధాభిక్షవస్స్యుః, ప్రోక్తాస్సామాన్యలింగినః
తేషాంపృథక్పృథగ్ జ్ఞానం, వృత్తిభేదాత్కృతంచతత్
కుటీచకో, బహూదకో, హంసశ్చైవ తృతీయకః
చతుర్థఃపర(మ)హంసశ్చ, సంజ్ఞాభేదైఃప్రకీర్తితాః.

పరాశరమాధవీయము పే. 129.

3 అజవాహనములు=శివవాహనములు=వేదములు. ధర్మకావానుగ కర్మకాండప్రథితంబులు=న్యాయయును, లేక, పుణ్యమునకు కాలానుగతమగు కర్మకాండముచేఁ బ్రసిద్ధమైనవి. యొండె; ధర్మము, కాలము, వీనితోననుగతమగు కర్మకాండములని యొండె. అజవాహనములు=బ్రహ్మవాహనములు, హంసలు. వర్షాశరత్కాలానుగ కర్మకాండప్రథితములనియొండె. అజవాహనములు=విష్ణువాహములు, గరుత్మంతుఁలు. గరుత్మంతుఁడు వేదస్వరూపుఁడు=ధర్మ...కాండప్రథితుండు.

6. మల్లికా=మల్లె. మాలతి=సువాసనపుష్పములు. లతామతల్లికలు=లతాశ్రేష్ఠములు; మాధవీ=బండిగురువిందలతా విశేషము. సుగసాల=మద్దిచెట్లు. వరసాల=సాలవృక్షములు, మోచా=అరఁటిచెట్లు. మధు=ఇప్పచెట్లు, రసాల=తియ్యమామిడిచెట్లు, కృతమాల=రేలచెట్లు; కంకేళి=జీలుగుచెట్లు. బృహత్ఫలా=పనసచెట్లు. కలితంబు=ప్రకాశించుచున్నది.

8. చక్రవాక=చక్రవాకపక్షులు. బకోటచక్రి=కొంగలసమూహము. తిత్తిరిఖేట=తీతువుపిట్టలు. సుందరసారస=హంసలు. శతపత్రములు=పద్మములు. కల్హారములు=కలువలు. కోకనదము=ఎఱ్ఱగలువలు. హల్లక=ఎఱ్ఱపద్మములు; ఆమోదసర్పితంబు=పరిమళముచే వ్యాప్తమైనది. రాజీవరాజి=పద్మసమూహము=చేఁపలగుంపు. శఫర=చేఁపలు. వేల=ఒడ్డు. పుష్పసార=మకరందము.

9. ధనుజాధిప నందిన=రాక్షసరాజ పుత్త్రిక=ప్రభావతి. కాంచి=గంటలయొడ్డాణము. కింకిణి=చిఱుగంటలు. జీగాల్ జిగాల్=ఇదికాంత్యనుకరణము. ఇట్లు తూర్పుదేశపుఁబండితులు ప్రయోగింతురు.

10. మాయ + నాఁ=మాయయనునట్లుగా.

18. బృందారకాపగ=మందాకినీనది. పొందామరలు=బంగారుఁదామరలు.

20. హంస=1 మన్మధుఁడు, 2 నారాయణుఁడు, 3 బ్రహ్మ, 4 సూర్యుఁడు, 5 రాజహంస=సన్యాసిభేదము, 6 ప్రాణము, 7 రాజహంస=రాయంచ. ని. హంసస్స్మరే, ఖగే, విష్ణౌ, నితౌనిర్లేపభూభుజి, జీవే=బ్రె=శ్వే, శ్వేతవృషే, స్యాన్మంత్రపరమాత్మనోః। అని నానార్థము.

21. అరాళకుంతల=కుటిలాలక=స్త్రీ.

24. మానసవాస !=ఓహంసమా ! తాత=బ్రహ్మ, ధాతృశబ్దభవము-తాత=తండ్రితండ్రి, తల్లితండ్రి, కనకాక్షు=హిరణ్యాక్షుఁడు. తపనీయకశిపుడుఁ=హిరణ్యకశిపుఁడు. ఇలువేలుపు=కులదేవత.

27. కచ్ఛపి=సరస్వతివీణ, కెంగేలఁ=చేతియందు—(కెంపు + కేలు) కంజారినవరేఖ=చంద్రునినూతనకళ=చంద్రరేఖ. ముంజేత=హస్తమందు, (ముందు + చేయి) కై=చేయి. ని. క. కయియనఁగై నాఁగేలనఁ। జెయియనజేనాఁగఁజెయ్యిచేవాహస్తా। హ్వాయములగువని యాంధ్రనామసంగ్రహము. చతురాస్యుఁడు=చతురమైన వాక్కులుగలవాఁడు=బ్రహ్మ. సర్వజ్ఞుఁడు=సర్వమును తెలిసినవాఁడు. శివుఁడు. సితాబ్జలోచనుఁడు=తెల్లదామరలవంటి నేత్రములుగలవాఁడు-విష్ణువు. మోహనాంగుఁడు=సకలమగువారువలఁచు శరీరముగలవాఁడు, జగన్మోహనుఁడు.

29. అంజక=సందేహింపక. అజి=సందేహేయని ధాతువు.

30. లౌల్యము=లోలత్వము=చపలత. మానసౌక=మానవసరస్సు నివాసముగాఁ గలదానా! హంసమా!

33. నీవలె=నీవలెనే (ప్రభావతిశబ్దమునందలి ప్రవలెనే) ప్రాంచితుఁడు. ప్ర + అంచితుఁడు. ప్రియనుదానిచే నొప్పువాఁడు; అఖిలలోక వాంఛితము, అఖండము, నిరుపమముఅయిన ఐశ్వర్యముతో గూడినవాఁడు. ద్రవ్య, రూప, పరాక్రమములుగలవాఁడు. ద్యుమ్నాభిరాముఁడు=ద్యుమ్న నామమున నొప్పువాఁడు. ని. ద్యుమ్నం విత్తే పరాక్రమే. యని యమరము.

36. మణిగణకీలసత్ + ద్వార + కవాట. కోరకము=మొగ్గ.

37. గోపాలనము=పసుపాలనము, స్వర్గపాలనము. వంశగానము=వేణుగానము, గోత్రిఖ్యాతి. బృందావనవృత్తి=బృందా+వనవృత్తి. దేవబృంద+అవనవృత్తి. చక్రినాయకరీతి=సేనాధిపతిత్వము; చక్రాయుధధారణము. దరము=శంఖము=భయమువల్ల వీశల్లవుంశు=గోపికాస్త్రీమనోహరుడు.

39. బాలుగన్నులు=సోగకన్నులు. నీల=ఇంద్రనీలములు, నీలాంభోజ=నల్లపద్మము, నీరద=మేఘము. బంభర=తుమ్మెదలు. అళీక=జీవనోపాధి=జీవిక. కటకము=కడియము.

40. చందమామ=చంద్రుడు. మామచందంబును చెప్పెడు=మామయని మొగము చేతఁ జెప్పుచున్నవాఁడు. తనువిలాసము చేఁ దల్లిలక్ష్మియని జెప్పుచున్నవాఁడు.

41. రాజకుమారులు=క్షత్రియకుమారులు. లేక రాజశబ్దము చంద్రునకు నుబర్యాయమే కాన, రాజకుమారులు=జయంతాద్యులును నగుదురు. మాధవ=వసంతుఁడు; రాజ=చంద్రుఁడు, వీనికుమారుఁడు=బుధుఁడు. రాజరాజకుమారులు=నలకూబరమణిగ్రీవులు, ని. రాజాధిపః పతిస్స్వామీ నాథః పరిస్సృఢః ప్రభుః, ఈశ్వరో విభురీశానో భర్తేంద్రఇన ఈశితా, అని ధనంజయుఁడు.

42. వేదాశ్వన్=ఈశ్వరుని. మేనన్+మచ్చలు + డాయంగ=శరీరమున వేయినేత్రరూపములగు మచ్చలు వచ్చినట్లు. ఘనవాజి=ఇంద్రుఁడు, వరమహంస=సూర్యుఁడు. పుష్పిణీన్=పుష్పవతియగు, పద్మినిని=పద్మినీజాతిస్త్రీని=పద్మలతను, " కరమంటుట=పాణిగ్రహణము చేయుట, కిరణములు తగులుట.

43. ఇందిందిరశ్రేణి=తుమ్మెదలబారు. ని. ఇందిందిరశ్చంచరీకో, రోలంబో బంభరేపిచ అని యమరము. శిరోధి=కంఠము. ని. శిరోధిఃకంధరేత్యపి. యని యమరము. సరసోమ...నాస=సంపంగిపూవువంటి సోగసునకు స్థానమైనది. జలావర్తము=శిటిసుడి, సనాభి=సజాతి; నాభి=బొడ్డు. సోమునిజపరాండ్రు=చంద్రునిభార్యలు=నక్షత్రములు. ఫణిపతి=సహస్రవదనుఁడు. సురసైన్యపతి=షణ్ముఖుఁడు. పశుపతి=పంచముఖుఁడు=శివుఁడు. భారతీపతి=చతుర్ముఖుఁడు=బ్రహ్మ.

44. తాత=మాతామహుఁడు=క్షీరాబ్ధి. తల్లిసౌభాగ్యము=లక్ష్మియొక్క సద్గుణైశ్వర్యసంపన్నత. తననేత్రములయందుధరించి; నేత్రములు కమలములవంటివని ధ్వని. మేన=శరీరమున. బలశంభుఁడను రాముని విలాసములు వహించినవాఁడు. దోర్విభవ=భుజబలసాలులలో, చక్రవర్తిశ్రేష్ఠుఁడు.

45. లలి=ఆసక్తిచేత, మేను=మా + ఇన=మేన=మేను=నారాయణ మూర్తి యొక్క; తొలిమేను=ప్రథమావతారమైన; బలుమీను=గొప్పదైన మత్స్యము యొక్క: పోలికగల, వాలుఁగన్నులు=సోగలైన కన్నులుయొక్క; మేలుడాలు=శ్రేష్ఠమైనకాంతిగలవాఁడు. తఱినాఁటి=సముద్రమథనము నాఁటి; తాఁబేటి=తాఁబేటియొక్క;పోలికగలుగు=పోలునట్టి; పాదాగ్రములు=మీఁగాళ్లు; గిరిధీరుఁడు=పర్వతమువంటిధైర్యముగలవాఁడు. పరుడీరు=శత్రువునుజీల్చిన, నరహరు=నరసింహము యొక్క; మధ్యంబు=నడుమగలిగినట్టినెఱికౌను=నడుము; పొలుచువాఁడు=ప్రకాశించువాఁడు. సోమకులసోము=చంద్రవంశమునఁ జంద్రుఁడైన; బలరాముపోలిక=బలరామునివంటి,లాలిత=ప్రకాశించుచున్నదరహాస=చిఱునవ్వుయొక్క; లీలవాఁడు=పోలికగలవాఁడు. ప్రబలధర్మగుణావలంబనఘువాఁడు=ప్రబలమైనధర్మగుణములు=ధనువు, నారి వీని నవలంబించినవాఁడు. బాలగోపాలలీల=శ్రీకృష్ణునిలీలలవంటివిలాసము చేతఁ బ్రకాశించువాఁడు.గో+పాల=స్వర్గపాలనము=దేవేంద్రవిలాసము గలవాఁడు; రాజవిజయాభీరతినలరారువాఁడు=సమస్తరాజులను జయించినవాఁడు=పరశురాముఁడు, కాముఁడు=ప్రద్యుమ్నుఁడు, అభిరూప=సౌందర్యముచేత, కామినీకాముఁడు=స్త్రీలచేతఁగోరఁబడినవాఁడు.

46. కమల=లక్ష్మి; నీరజాక్షుఁడు=విష్ణువు; కాళి=పార్వతి; అభ్రకేశుఁడు=శివుఁడు; వాణి=సరస్వతి; చతురాస్యుఁడు=బ్రహ్మ; పద్మిని=పద్మలత; విభాకరుఁడు=సూర్యుఁడు; తారక=నక్షత్రము; రాజు=చంద్రుఁడు;

47. జైత్రయాత్ర=జయించుప్రయాణము; కార్యఖడ్గవిలాసము=కార్యము రాచకార్యము; ఖడ్గవిలాసము=ఆయుధములులోనగువవి చూచుచున్న సమయము.

49. శతపతి=నూఱడుగులు. శ్లో. భుక్త్వాశతపదంగత్వా, యని వైద్యశాస్త్రము.

54. ఉప్పరవీథి=ఆకాశమార్గము.డట్టుపల్=ఱెక్కలు, కర్ణపర్వ . .నీనఁగ=శివణానందముగావింప. పశ్చిమాశ=పడమటిదెస; అప్పులరాశి=సముద్రము పాశి=వరుఁడు, పాశము=త్రాడు; అదికలవాఁడు పా. శి. ని. ప్రచేతావరుణః పాశీ యాదసాంపతిరప్పతి, యని యమరము.

55. శరధి=సముద్రము; మహాసేనజనకశరధి=కుమారస్వామితండ్రి యంబులపొది=సముద్రము. తతదాశరథి=తత=వ్యాప్తమైన దాశ=పల్లెవాండ్ర యొక్క;రథ=రథములు (ఓడలు) గలది. నిర్భయస్ఫురదాశరధి=నిర్భయ + స్ఫురత్ + ఆశర + ధి=నిర్భయ=భయములేని; ఆశర=రాక్షసులకు; ధి=స్థానమైనది. ని. రాక్షసఃకోణపః క్రవ్యాత్క్రవ్యాదో౽స్రప ఆశర, యనియమరము. భూభాగపరిక్=

భూభాగమునకుఁ బరిఘయైనది. భూభాగమునకు వలయాకారము గాఁ జుట్టుకొనినది; శతపత్రరథిః=పద్మములతో రసనములు గాఁగలవి; శతపత్రగములు=హంసములు=అవి కలది సముద్రము.

58. గోపురంబు=స్వర్గము=గోపురము. చంద్రకాంతోపల=చంద్రకాంతమణులతోఁ గూడిన; చంద్రశాలలు=శిరోగృహములు, మా + ఇట్=మేట్ మేఃట్ + ఆశ్రియ=మేడాశ్రియము ఆకాశమునకు + ఆశ్రయములైన మేడలు. తోరణము=మామిడియాకుల మాలిక=బహిర్ద్వారము. ని. తోరణోఽస్త్రీ బహిర్ద్వారమని యమరము. బుధమహిమాభోగవిభవులు—బుధ + మహిమ + ఆభోగ. బుధులు=దేవతలు, విద్వాంసులు, రాజమానువిలాస రాజమానులు=దేవేంద్రపుత్త్రులు=జయంతార్జునులు; వారివలెఁగల రాజసమూహము. సతి—పతివ్రత, సాధ్వి. చక్రపోషణశూరచక్రము=సైన్యములఁ బోషించుటయందు సమర్థమైన సమూహము. సరసులు=కోలఁకులు, సరసము తెలిసినవారు. కాంచనంబు=సంపంగి చెట్టు.

60. కమలాకరంబుః + కంటెని. కమలాకరమును=లక్ష్మీహస్తమును; విమల=నిర్మలమగు, కమల + ఆకరము=ఉదకములకు స్థానమైనది; కమలారాగము=పద్మరాగము; ఊర్మికలు=తరంగములు=ఉంగరములు, గలది. కమలాలంకృతము=పద్మములచే నలంకరింపఁబడినది. కంకణయుతము=జలకణముగాఁ=కడియములతోఁ గూడినది. ని. కమలం సలిలే తామ్రే, జలజే క్లోమ్ని భేషజే; మృగప్రభేదే కమలః, కమలా శ్రీవరస్త్రియ మని విశ్వము.

61. సారససారసాలి=శ్రేష్ఠమైన పద్మములయొక్క. ఘనసార + ససార + రసంబు=కర్పూరముకంటె + సారముతోఁ గూడిన యుదకమును; సార + సరస్తటంబు=శ్రేష్ఠమైన, సరస్సుయొక్క యొడ్డునకు. సారసబాణుఁడు=మన్మథుఁడు. సారసరాజము=హంసశ్రేష్ఠము. మహాసారసువర్ణవాజము=మిక్కిలి బలీయమైన బంగారుఱెక్కలుగల వాహనము. స్వర్గమరాళముః=స్వర్గమందలి హంసను; కరాళదేజముః=ఒట్టమైన తేజస్సుగలది.

62. గోము=సౌకుమార్యము; పక్షము=ఱెక్కలయొక్క; వలక్షము=తెల్లనైన; చంచువు=ముక్కు; పుచ్ఛంబు=తోఁక; పోష్లాయమానము=మిక్కిలి తేలఁబడినది.

63. కేళాకూళి=క్రీడాసరస్సు; విన్నాణంబు=నేరుపు, నాళీకాంతరసీమ=పద్మములమధ్యభాగము; నాళీకబాణుండు=మన్మథుఁడు.

65. ఉడురాట్=నక్షత్రములకుఁ బ్రభువు=చంద్రుఁడు.

69. యామినీభామిమినీ, ట్కామినీమణులు=చంద్రునియొక్క స్త్రీరత్నములు=నక్షత్రములు, గంభీర=గంభీరవేది=మదపుటేనుఁగు; నామైక దేశనా గ్రహణము.

70. అన్నులతలమిన్న=స్త్రీలలో శ్రేష్ఠురాలు; శ్రీఫలములు=మారేడుబండ్లు; భూతరాజుపద్మపాణి=శివునికాంత=పార్వతి. భాస్కరాంబుదవేణి=సూర్యునికాంత=ఛాయాదేవి; అబుందవేణి=మేఘమువంటి జడగలది.

71. ఆననంబు=మొగము, పద్మాభిశోభ=లక్ష్మీశోభ, పద్మశోభను వహించు. కర్ణములు=వీనులు, శ్రీకళాగరిమ=లక్ష్మీవిలాసము, శ్రీవర్ణసదృశతను జెలఁగు. నాసిక=ముక్కు. కాంచనవవిభూతి=స్వర్ణవైభవము, సంపెగసొంపు. రదనాళి=దంతపంక్తి. కుందసంపద=నిధిసమృద్ధి; మల్లెమొగ్గలతీరుగలది. అధరము=ఓష్ఠము, అంబుజమణి=పద్మరాగవర్ణము మధురము=మనోహరము; కంధరంబు=కంఠము, అబ్జ సంగతి=లక్ష్మీయోగముగలది, శంఖసన్నిభము. ఆరు=నూగారు. హీరారాజి=లక్ష్మీసమృద్ధి, చీమలబారువంటిది. కటి=నితంబము, ధరాచక్రసంఘటనము=భూచక్రసంపదగలది, భూవలయమునుబోలినది. నాభి=బొడ్డు. నవనిధిలక్షణోన్నతి=తొమ్మిదినిధులుగలది. లోతైనది. మధ్యము=నడుము; ఒక్కటిమాత్రమే, ముష్టికిఁబాల్పడియె=పిడికిటిలో నిమిడెననియు=పేదతనమువహించి బిచ్చమెత్తుకొనుచుండెననియు, సర్వావయవములు సకలసంపత్సమృద్ధితోనున్నవి యనియు, నడుముమాత్రము లేమిచేఁ గుందుచుండెననియుఁ దాత్పర్యము. స్థితి=ఉనికి=వసతి.

75. కటి=నితంబము; చక్రము=బండికల్లు; నాభి=బొడ్డు, చక్రము=జలావర్తము, సుడి; చక్రము=చక్రవాకపక్షులు. వేణి=జడ, పుష్పలిట్+చక్రము=తుమ్మెదల+గుంపు. నవచక్రధరాత్మజ=నూతనమన్మథుఁడా.

77. అచలేశసంస్థితి=పర్వతాశ్రయము. రాజాశ్రయము. చక్రాధినాథసంసర్గము=చక్రవాకములతోఁగూడిక=చక్ర+అధినాథుఁడు=భూపతి, సూర్యుఁడు. జలజాత+ముకుళములు=తమ్మిమొగ్గలు, శ్రీకరములు=లక్ష్మీకరములు=మహారాజులు=శ్రీపతి. శోభాయుక్తమైన యేనుఁగులు; (కరి. బహు. కరులు) మూర్ధము=శిరస్సు=కుంభస్థలములు. భూరికుంభములు=సువర్ణఘటములు. తాళసంగతిఁ జెంది + మేళగించుట=సప్తతాళములఁజెంది + వీణామేళములోఁ గలసికొనుట; తాళము=తాటిపండు. అతుక+కిన్నరకాయలు=అతకిన+వీణకాయలు=ఆనబకాయలు. పర్వతములకు, నిమ్మపండ్లకు నునుపులేదు. తమ్మిమొగ్గలకు సారము లేదు; సువర్ణకలశములకు జతలేదు; కిన్నరకాయలకతుకుగలదు.

81. పద్మబాణవైరి=మన్మథునివైరి=సాంబమూర్తి. అతనిపదము కైలాసము. పద్మనాభపదము=నారాయణుని పదము=ఆకాశము; పద్మసూతి=బ్రహ్మ, అతనిపదము-పద్మము; పద్మ=లక్ష్మి, జన్మపదము=పాలకడలి.

82. సుధాసారకాసారమే-అమృతపుసరస్సే, కాక=కానియెడల, కన్నుఁదామరదోయి=కన్నులనెడిపద్మద్వంద్వము, కలుగుటెట్లు=ఎట్లుకలుగును. భద్రిదంతావళము=పట్టపుటేనుఁగు; గురు + కుచ + కుంభములు=ఉరువులైన కుచములనెడి కుంభములు. ఆరు=నూగారు. యువచిత్త=పిన్నవయస్సుగలవారి మనస్సు. అజశబర=మన్మథుడనెడి యెఱుకువాఁడు. మాయాకురంగి=మాయలేడి.

83. స్థలజలజములు-మెట్టతామరలు; వితానము-సముదాయము; విద్రుమము=పగడము; ప్రవాళము-పల్లవము. కందళములు=మొలకలు; లోహితోత్పలము=ఎఱ్ఱగలువ. నూత్న...కళలు=నూతనవర్షాకాలమందుఁబ్రకాశించుచున్న సంధ్యారాగలక్ష్మిప్రకాశములు.

84. వైశద్యము=నిర్మలమైన; కైవారంబు-స్తోత్రము; పరహీరాత్మజా లక్ష్మీపుత్త్రిఁడా.

85. అబ్జము=పద్మము, చంద్రుఁడు, శంఖము-పదము, వదనము, కంఠము. సారంగము-లేఁడి, తుమ్మెద, ఏనుఁగు-నేత్రము, వేణి, నడక. చక్రంబు-చక్రవాకము, బండిచక్రము, జలావర్తము-స్తనము, కటి, నాభి. పుష్కరము-ఆకాశము, ఏనుఁగు. నక్షత్రము=నడుము, బాహువులు, గోళ్లు, కన్నులు-శ్రుతిపారగంబులు-చెవులుదనుక వ్యాపించినవి వేదాంతమును బొందినవి; ఆరు-నూగారు, శాస్త్రధార-ఆయుధములయొక్క యంచు, జ్యోతిర్విలాసంబు=నక్షత్రముపంటికాంతిగలది; జ్యోతిశ్శాస్త్రము చదువుకొన్నది; తనువు=శరీరము, విద్యలమయము విద్యలతోఁగూడుకొన్నది. నడుము=మధ్యము, అవిద్య=మాయ=శూన్యము.

92. బాలేందుసమఫాల=బాలచంద్రునివంటి ఫాలముగలది. విద్యుత్=మెఱుపు. ఆలాపము-భాషణము. పరభృతము=కోకిల. లోల=చలించెడి. లోలంబకములు-తుమ్మెదలు. ఆలోకనములు=చూపులు. రేలు(=రేయి, బహు. రేలు)=రాత్రులు; నలుజాలు=నాలుగుజాములు. చంద్రాతపము=వెన్నెల; అఖిల భయంకరమగు నలుదెసలుగనుచు మొదలగునవి సాత్త్విక సంచారీభావములు కాను భావములు.

101. మార్గశుభవత్కున్=మృగసంబంధము మార్గము=కస్తూరి. కస్తూరిచే నలంకరింపఁబడినది; చంద్రశాల=శిరోగృహము, చందన + అభిఖ్యుఁడు=చందనము

వంటి యశస్సుగలవాఁడు; భోగశంబరారి= భోగమున దేవేంద్రుఁడు. ని. మృగదానవ బాద్ధేషు శంబరశ్శంబరీవృషా. అని నానార్థము.

103. మహి=భూమియనెడి, మహిళాశిరోమణి=స్త్రీశ్రేష్ఠము; నూపురంబు=అందె; గదాగ్రజుఁడు=విష్ణువు. తప్తచామీకరము=పుటము వేసిన బంగారము. సప్తసాలాశ్లిష్ట=ఏడుకోటలచే నావరింపఁబడినది. ని. సాలాద్రుమేమత్స్యభేదే ప్రాకారేసర్జకద్రుమె. యని నానార్థము. సాలా=శాలా. శసలకభేదము. పద్మాదినవనిధి=పద్మము మొదలుగాఁగల తొమ్మిదినిధులుగల; సద్మాళి=గృహపంక్తి; విజితాలకాపురంబు=జయింపఁబడిన కుబేరపట్టణముగలది; భూతధాత్రీసముద్భవ=నరకాసురునిచేత; ఆనీత=తీసికొనిరాఁబడిన; షోడశసహస్రశత ముఖసుందరులు=16100 స్త్రీలు గల; భూతధాత్రి=భూమి. భూదేవి యాదివరాహమూర్తిని వరించుటచేత నరకాసురుఁడుద్భవించెను. ఇతనిని సత్యభామ సంహరించెను. అని పద్మపురాణము.

104. రింఖల్=గంతులు వేయుచున్న, ఏణాంక రత్నములు=చంద్రకాంత శిలలు, సముట్టంకితంబు=కూర్పఁబడినది; వేగండములు=ఏనుఁగులు; రథములు=తేరులు, కాండములు=గుఱ్ఱములు; కోదండధరులు=భటులు; ఇందిందిరములు=తుమ్మెదలు. పారిజాతలతాంతములు=కల్పవృక్షపుష్పములు; రామ, హేమ మొదలగువారు స్వర్గలోకమున నుండెడి స్త్రీలు. సురధామము=స్వర్గలోకము.

108. రాజిరాజికిన్=వీధివీధికి; రత్నరాజిత స్తంభాగ్రములన్=ప్రకాశించుచున్న స్తంభముల తుదలయందు. జేజేమ్రాను=కల్పవృక్షము. క్రొవ్విరి గుత్తులు=క్రొత్తపూలగుత్తులు. నెత్తావి=పరిమళము. మణిదీప=మాణిక్యదీపములు. తగటు,..చిత్తరువులన్=బంగారు నీటిచేఁ బూయఁబడిన చిత్రప్రతిమలచేత. మణికుడ్యములు=రత్నఖచితములైన గోడలు. తల్పచయములు=పరుపులసముదాయములు; ఆందోళికాజాలము=ఉయ్యాలల సముదాయము; శారిక=గోరవంకలు. శుక=చిలుకలు.

109. తామరలన్ + కనుఁగొనుచు=తామరసములఁ జూచుచు.

110. కలకంఠకంఠి=ప్రభావతి.

112. మాధ్వీధార=మకరంద ప్రవాహము.

113. సోమరిగాము=మందుఁడైన గ్రహము.

114. ఏలోకమునుజూఁడక=ఏజనునిజూచినను; నీలోకము=నీజనుఁడు;

సాలోక్యము=ముక్తిభేదము; ఏమాటలాలించినను-సామీప్యము=చేరువ=సామీప్య ముక్తి. ఏరూపుఁగనుఁగొన్నన్=దేనినిజూచినను. నీరూపమేయని; సారూప్యము= సమానరూపము=సారూప్యముక్తి, ఏయోగము=కూటము. సాయుజ్యము=కూడి కొనుట. సాయుజ్యముక్తి; సర్వమును నీవెయని తలంచుట.

## తృతీయాశ్వాసము.

5. శుభవ్యాహారములు=మంచిమాటలు; ఉద్వేలాంభోధి=హద్దులేని సముద్రము; వ్యాలీఢ+అంఘ్రి+పంకేజ=నెమ్మదిగా నీడ్చుచున్న పాదపద్మములు గలది.

16. మాతంగ=ఏనుఁగులు, మాలవాండ్రు. సంగతి=సాంగత్యము, మధుపాళులు=తుమ్మెదలు=కల్లుదాగువాండ్రు; ఝుంకారము=తుమ్మెదలధ్వని=కోపధ్వని; చౌకళించు=విజృంభించు; పంచమధ్వని=కోకిలధ్వని=చండాలధ్వని; పరపుష్టతతులు=కోకిలలు=ముష్టిరొత్తుకొనువారు; కన్నులెఱ్ఱఁజేయు=కోకిలలకుఁ గన్నులెఱుపు; కోపదృష్టితోఁజూచుట; పలాశ=రాక్షసులు; ఆకులయందుండెడు; ఉరుశుకముఖులు=శుకుఁడు మొదలుగాఁగల రాక్షసులు, చిలుకలు మొదలైనవి. పరమహత్తరులు=గొప్పవృక్షములు పెద్దమనుష్యులు; వనశిఖిగణము=వనమయూరములు, దావాగ్ని. పాంథులు=బాటసార్లు, భార్యఁగలుగలేనివాండ్రు. విరహాతాపాంధులు=విరహతాపముచే నంధులుగాఁజేయబడినవారు అశరీరభూతంబు=వాయువు; మన్మథుఁడు, మధుమదావనము+పనము=తుమ్మెదలుచేతను, కల్లుత్రాగువాండ్రచేత నావరింపఁబడిన+వనము. సుదృగ్వ్రాతము=విద్వాంసులు, విరహిణీస్త్రీలు.

18. బ్రహ్మవాక్యజ్ఞానము=బ్రహ్మచెప్పెడుమాట, బ్రహ్మసూత్రజ్ఞానము=వేదాంతము; పరమహంసలు=మరాళములు=యతివిశేషములు. యుక్తసరసులు=బ్రహ్మజ్ఞానముతోఁగూడినవారు. రామస్మరణము=రామనామస్మరణము. శుకతతి=చిలుకలగుమి=శుకాదిమునిసంఘము. శాఖి+శాఖాంతసంచారము=వేదములు, ఉపనిషత్తులు; కొమ్మలతు దలఁదిరుగుట; పరభృత=కోకిలలు, ఇతరులచేతఁబోషింపఁబడువారు. ద్విజతతుల్=పక్షుల సమూహము, బ్రాహ్మణసంతతి. పర్ణకృతులు=పర్ణములుతినుటచేతఁగృతార్థులైనవారు. కవిచక్రములు=విద్వాంసులు, జలపక్షిసమూహము; ఉభయత్రసమము. ఖగవరములు=దేవతలలోశ్రేష్ఠులు=పక్షులలోశ్రేష్ఠములు, సన్మార్గగతులు=ఆకాశమునందు సంచరించువారు=సన్మార్గమునందు సంచరించువారు.

22. వనమాల-వనపంక్తులు, వృక్షములవరుస; సారిణులు=బోదెలు. చికుర=కుంతలములు; భంగురము=వంకరలు= అలలు; మెట్లవరుసను గలిగియుండుట.

23. మరుత్సుతుఁడు-పిల్లవాయుపు, భీముఁడు; మాధవ=వశంత; శోభి=ప్రకాశించువాఁడు. కర్ణభీష్మ=చెవులకు భయంకరమైన వేసవికాలము. కర్ణభీష్మ లువగై రాలతో; అనుగత=కూడుకొన్నవాఁడు; సమాప్తి-ముగియుట; ధార్తరాష్ట్రసంతానము=హంసలసముదాయము=దుర్యోధనాదులు పత్రములు, అనలు=గుఱ్ఱములు భీష్మగ్రీష్మ యిచట రేఫమూఁదమి దోషముకాదు.

24. సారంగ=గజము, నారంగములు=దబ్బచెట్లు; ఆరంగా=ఒప్పునట్లు, పల్లికా=లతలు, అవకరి=వంకరకాసి, కేశానుళులు=కీరిడాసరస్సులు. వేలా=ఒడ్డు. నారి కేలము=కొబ్బరిచెట్టు; పుష్ప + అంచల + శాఖా + శిఖ + అంచితంబు=పూవుం గొనలుగల కొమ్మల చివరలచేత నొప్పుచున్న.

29. కంచెలలు=రవికెలు; వలువలు=బట్టలు, గొట్టములు=చిమ్మినగోవులు పావడలు=పరికిణీలు.

30. పుష్కరము=ఉదకము; కవులు=జలపక్షులు రంభలు=అరఁటిచెట్లు; మహత్తరులు=పెద్దవృక్షములు జీవనము=ఉదకము; ద్విజులు=పక్షులు; పుణ్యజనులు=పుణ్యస్త్రీలు=రాక్షసులు; కాండమండలి=నీటివాని.

31. కీలాలము=జలము.

32. జలముక్=మేఘము;

36. వెలందిగందము=తేటగంగము.

38. లాక్షాగారము=లక్కయిల్లు; కిసాలయము=కిసలయరూపాంతరము; స్థలజలజాతము=మెట్టతామర;

39. పిపాస=దాహము; సన్నంతము.

42. బాడబానలము=బడబానలము రూపాంతరము.

44. కరదీపికలు=ఇలాయులు. గీర్వాణాంగనలు=దేవతాస్త్రీలు. శశధరుఁడు=చంద్రుఁడు. కాచఘటము=గాజుకుండ (గ్లోబు=Globe.)

46. ప్రాచీదిక్ + అంగనా=తూర్పుదిక్కనెడిస్త్రీ: కాల + విభు=కాలమనెడు పెండ్లికొడుకు; శిరస్థిత=శిరస్సునందుంచిన, శిరోవేష్టి=తలపాగ. ని-ఉష్ణీషణశ్శిరోవేష్టి, యనియమరము. ఐరావణము=ఐరావతమనెడి యేనుఁగు; సౌరాధిరాట్=దేవేంద్రుఁడు, శిరశ్చలిత=శిరమునవెలయు; యామినీ=రాత్రియనెడు, యువ

నిక = తెరను; గామి = పొందిన; నటన్నటీ = నటించుచున్న స్త్రీ యొక్క; హీరవర = వజ్రవికారమైన, లలాటిక = పాపటబిందె. మార = మన్మథుని యొక్క; జైత్రయాత్రా = జయించు యాత్రయందు; పూర్వాద్రి = ఉదయాద్రియందు ఘటితధ్వజ స్వర్ణకలశము = కూర్చఁబడిన ధ్వజస్తంభమందుండు బంగారుకలశము; గోపమానినీ = గొల్లభామయొక్క మస్తక = శిరస్సున; న్యస్త = ఉంచఁబడిన; సౌధకుంభము = పాలకడవ; ప్రాగ్ధరాధరశృంగము = ఉదయాద్రిశిఖరము; నవనవద్యుతి = అత్యంతమైన నూతనకాంతి.

47. కైరవశ్రేణులు = కలువపంక్తులు; ఉడుకాంతకాంతంబు = చంద్రకాంతమాణిక్యములు; జీవంజీవములు = చకోరములు, ఆమెతలు = సంతర్పణలు; మండిత = ఒప్పుచున్న; రాజీవమండములు = పద్మసమూహములు; సాలయుగకలు = ప్రియకలహములు, విరహాణీసములు; ఘతకా = దగ్గరలేనివారు. చెంగలించె = వృద్ధిపొందె; హిమంబు = మంచు; బయలు = ఆకాశము; తొరుట = జారుట.

48. పూర్వోర్వీధరము = ఉదయాద్రి; తూర్పుదిక్కునెడిపర్వతము; రాజితాచలము = వెండికొండ = కైలాసము; పూర్ణాంబుజా ...ద్వ్యందు = పూర్ణమైనపద్మవిరోధి యనెడు; లక్ష్మింము = సొంబమూరికా; అంక = చిహ్నమనెను; గళద్యుతులు = కంఠకాంతులు; మెఱయకా = ప్రకాశింప; లాస్యవ్యాప్తి = నృత్యముయొక్కవ్యాప్తి; శోభిల్లకా = ప్రకాశింప, సర్వ + ఆశావలి = సకలదిక్కుల సముదాయమందు; ఛద్మ = మిష; ఉత్తమాంగస్థలీ = శిరస్థలమందు; నిర్విష్ట = ఉన్న. అమరవాహినీ = ఆకాశగంగయందు; జనిత = పుట్టిన; డిండీర = నురగలయొక్క; అచ్ఛ = స్వచ్ఛమైన; గుచ్ఛచ్ఛవులు = సముదాయములైన కాంతులు.

49. కోలలు = బాణములు; వినువీథి = ఆకాశవీథి; పృథుపుర సౌధాగ్రభిన్న = పెద్దవియైన పట్టణమందలి మేడలచివరలు తాఁకుటచే భిన్నమైన. అబ్జమండలము = చంద్రమండలము; కాళ = తెల్లపూలు, నగేశ = హిమవంతుఁడు; రేవతీశ = బలరాముఁడు, లోకేశ + వనిత = బ్రహ్మభార్య = సరస్వతి; అమరేశ = దేవేంద్రుని; సింధు = గజము (ఐరావతము), సైంధవము = గుఱ్ఱము (ఉచ్చైశ్రవము) అంధకరిపు = అంధకాసురుని కొట్టినవాఁడు శివుఁడు. విభాబాంధవంబు = కాంతులతో సంబంధముకలిగినది; ధౌత = తెల్లనైన చంద్రాతపములు = వెన్నెలలు.

50. శరధులు = సముద్రములు; దుగ్ధశరధి = పాలసముద్రము; తటినులు = నదులు వియత్తటినులు = ఆకాశగంగలు; వలక్ష = తెలుపు; ని-వలక్షోదవళోర్జన యనియుమర్థము. దేవగోవులు = కామధేనువులు; విరించిరాములు = సరస్వతులు, సౌరగజములు = ఐరావతములు; నిగ్భరాభాంశ = నిరంపశక్యముగాని బ్రహ్మాండము గలది.

52. కజ్జలము=కాటుక; చేడెచాలు-వనితావళి.

53. స్వైరిణులు=జారస్త్రీలు; పల్లవులు=విటపురుషులు;

54. పాటుటాకు=పాటుడు చెట్టయాకు, ఇది యనఁటియాకువలె నడుమ లోతుగనుండుటయు తొడిమయానెయు నిరుపార్శ్వములకు వ్యాపించెడి యీనెలునుండు టంజేసి వెన్నుతోడివీఁపునకుఁబోల్పంబడియె. పాటు + ఆకు=పాటుటాకు. టుగాగమము. జడ=తుమ్మెదలబారువలెనున్నది. పదాంగదములు=అందెలు, ఫుల్లజలజాతము=వికసించినపద్మము, వారనీరదవేణి=వేశ్యాకాంత

57. వేది=అరుగు చకోరాళి=వెన్నెల, కైరవి=వెన్నెల, పైఁబోవ=పైని బడుచుండఁగా: కైరవసెజ్జ=కలువఁపానుజోకై=జోడుకూడి, రహఃక్రీడ=మన్మథక్రీడ; వన్నెలు=సొగసులు, వంతపడు=బాధపడు; శంబరహంత=మన్మథుఁడు, లతాంతము=పుష్పము=చిగురు.

58. కేళిమందిరము=విలాసగృహము; జాలజాలము=కిటికీలవరుస, వివరాకీర్ణంబులు=రంధ్రములయందు దట్టములైనవి; ద్విజరాజు=చంద్రుఁడు; అధిపప్రభలు=విశేషకాంతులు; పద్మినీపాళిద్వేషి=పద్మినీస్త్రీలకు విరోధి చంద్రుఁడు; మహోగ్రశేఖరుని కోపవార్ధి=సాంబమూర్తి యొక్క శిరస్సునందుండు చంద్రుని కోపాతిశయము.

59. హిరణ్య + హరుఁడు=బంగారము దొంగిలించినవాఁడు; హిరణ్యాక్ష హిరణ్యకశిపులసంహరించినవాఁడు, నారాయణుఁడు. విరించి + మస్తకచ్ఛేది=బ్రహ్మహత్యచేసినవాఁడు, శివుఁడు. సురాధిప + పోషణము=సురాపానము చేయువారి సంరక్షణ. గురుముద్రిత=గురుభార్యాగమనము. పంచమరీతి=వీరితో స్నేహము, చండాలత్వము అయిదవపాతకము.

60. నడుమంతరపుఁగల్మి=పూర్ణిమ నాటి నిండుఁదనము=నడుమ వచ్చిన యైశ్వర్యము.

ఈపద్యము చంద్రునిపరముగను, రావణాసురుని పరముగను నర్థమగుచున్నది.

61. ప్రహస్తాది=ప్రహస్తాదులగు రాక్షసులుగల వాఁడు=రావణుఁడు, ప్ర + హస్తా=ప్రకృష్టమైన హస్తాదినక్షత్రములు గలవాఁడు-చంద్రుఁడు. కాలనేమిఖ్యాతి=కాలనేమియను కపటమునిగలవాఁడు రావణుఁడు, కాలమును బొందినవాఁడు చంద్రుఁడు. తామస విరూపాక్ష=తామసులైన విరూపాక్షాది మంత్రులుగలవాఁడు, రావణుఁడు, తామసుఁడైన శివునియొక్క శిరస్సునందున్నవాఁడు చంద్రుఁడు.

దైవతగురుద్రోహి=దేవతులకు గొప్పద్రోహమును జేసినవాఁడు రావణుఁడు=దేవతులకుగురుప్తైన బృహస్పతికి ద్రోహము చేసినవాఁడు చంద్రుఁడు. బహుకరవిస్ఫూర్తిః=మిక్కిలి చేతులు, అనేకకిరణములు. కర్బురసారంగగతుఁడు=బురుదయులేడియుఁగలవాఁడుచంద్రుఁడు, బంగారపులేడి వెంటఁబోయినవాఁడు రావణుఁడు. సత్సంతతి ప్రతిభగాసిఁజేయుట=సత్పురుషసమూహమును బాధపెట్టుట. నక్షత్రములు ప్రకాశముతగ్గుట. విరహరామార్తికృద్విభవుఁడు=విరహుఁడైన శ్రీరామునికి బాధచేయువాఁడు రావణుఁడు. విరహిణీస్త్రీలకు బాధచేయువాఁడు చంద్రుడు. జైవాతృకుండు=చిరంజీవి=చంద్రుఁడు.

62. అజహత్కళంకపఙ్క్తి=ఎప్పుడును విడనికళంకముతోఁగూడుకొనినవాఁడు పాపముతోఁగూడుకొన్నవాఁడు. కుబ్జ...పటిలాత్ముఁడు=దుర్మార్గులను పోషించుచటువంటి కుటిలమైన ఆత్మగలవాఁడు. వంకశరీరరూపముగలవాఁడు. కళలుతగ్గగానె వంకరరూపు వచ్చినది. రజనీచరవరుఁడు=రాక్షసులలో మొదటివాఁడు. రాత్రిసంచరించువాఁడు; ద్విజరాజు=బ్రాహ్మణరాజు.

ఈపద్యము మన్మథపరముగను శివపరముగను నర్థమగుచున్నది,

66. సుపర్వాపియము=ఇక్షువు=మేరువు. ఈచాపముతోఁ గూడికొనినవాఁడు=మన్మథుఁడు, శివుఁడు; విషమాంబకుఁడు=పంచబాణుఁడు, త్రినేత్రుఁడు శంబరహరణోగ్రుఁడు=మన్మథుఁడు-వేడిహరించుటచే నుగ్రుఁడగువాఁడు=శివుఁడు. అజ=మన్మథుఁడు, శివుఁడు-ని-అజావిఘ్నహరచ్ఛాగయని, నాగాభోగి చూడామణి భూషితాంఘ్రుఁడు=సర్పములశిరస్సులనుండు మణులచే నలంకరింపఁబడినపాదములుగలవాఁడు=మన్మథుఁడు. సర్పశ్రేష్ఠులచే నలంకరింపబడిన పాదములుగలవాఁడు శివుఁడు. మాధవప్రియుఁడు=వసంతుని చెలికాఁడు. మన్మథుఁడు విష్ణునిహితుఁడు శివుఁడు. అనిరుద్ధకుమారాంచితుఁడు=అనిరుద్ధుఁడను కుమారుఁడుగలవాఁడు=మన్మథుఁడు, నిరోధింపఁబడని కుమారస్వామియను పుత్రుఁడుగలవాఁడు శివుఁడు. ఖగముఖ్యగణుఁడు=శుకపికాదిసేనాగణముగలవాఁడు=మన్మథుఁడు, దేవతలు ప్రమథగణముగాఁగలవాఁడు శివుఁడు. ఖగము=పక్షి, దేవతలు.

68. మధుప్రియుఁడు=మన్మథుఁడు, మద్యప్రియుఁడు; మధుపాళి=తుమ్మెదలబారు, త్రాగుబోఁతులవరుస; సుమనోమహోత్కరులు=పూలచెట్లు, దేవతలలో శ్రేష్ఠులు, వనప్రియులు=కోయిలలు, కిరాతులు, పలాశసంతతి=ఆకులగుమి, రాక్షససమూహము, శుకబలము=చిలుకలగుంపు, ఋషిగణము, సరసులు=కొలఁకులు, రసజ్ఞులు, శితపత్రబలము=హంసగణము, తెల్లగుఱ్ఱములగుంపు, దోషాచరుఁడు=చంద్రుఁడు, నిశాచరుఁడు, సర్వజ్ఞుఁడు=సర్వము తెలిసినవాఁడు, శివుఁడు.

70. కువలయము=కలువ, భూవలయము, భువననిధులు=సముద్రములు, భువనములు, నిధులు, సుమనోనివహంబులు=పుష్పసమూహములు, దేవతాగణములు,

71. మారుతి=హనుమంతుఁడు, కన్నతండ్రికిన్=కన్నుగన్న తండ్రియైన వాయువునకు.

72. అనంతమూర్తిఁ=లెక్కలేనితలలుగలవాఁడు, శేషుఁడు.

73. ద్విజశ్రేణి=పక్షిపంక్తి, బ్రాహ్మణసమూహము, సుమనస్స్థలి=మేరుపర్వతము, పలాశప్రవృత్తి=రాక్షసవృత్తి, సర్వభక్షకుఁడు=అన్నియుఁదినువాఁడు, అగ్ని వెలినమార్గుఁడు=చెడునడవడిగలవాఁడు, కృష్ణవర్త్మ, యామ్యకింకరులు=యమభటులు దక్షిణదిక్సంబంధులు, పాంసులాకారుఁడు=ధూళిరూపుఁడు,

74. మే + లాగు=శరీరసౌందర్యము.

75. రాకా...సఖము=పూర్ణిమనాఁటి చంద్రునితోఁదుల్యము, శ్యామా=యౌవనమధ్యస్త్రీ, శేఖరము=రత్నము, దేవతిలనాసా=దేవతాస్త్రీ, హాయకి=రాగవిశేషము; వల్లకీ=వీణ.

76. అక్కు=వక్షస్స్థలము, చెమట=చెమట,

77. కోరిక. రూపాం. కోర్కె+ఏలా=కోర్కేలా-ఇది యిత్వ సంధి కాదు.

78. లకోరీలు=బాణములు; ఉమ్మలమ్ము=దుఃఖము.

80. కన్ను+దోయి=కందోయి. అరవిందము=పద్మము; గండమండలి=చెక్కులు, శ్రీఖండము=చందనము, కోకము=చక్రవాకము, హల్లకము=గర్తోత్పలము, కోశము=మొగ్గ. రంభ+ఊరు+వారంబు=అరఁటి బోదెలు, కుందశయ్య=మల్లెపూవులసెజ్జ, శిరీషములు=దిరిసెనపుష్పములు.

82. గొజ్జంగిమంచుతోఁ=గొజ్జంగినీటితోఁ=పన్నీటితో-ఉ. గొజ్జఁగి మంచు వన్నఁపికూర్చున పుష్పాడిదిన్నెమీఁదఁ. అని వసుచరిత్రము, ఆ 3-195. గొజ్జఁగియనునది శబ్దరత్నాకరమునఁ గానంబడదు. గొజ్జఁగ, గొజ్జెఁగ యనునవిరెండును 'కుబ్జికా' శబ్దభవములనియు, కుబ్జికయన—శ్లో. శిబ్జిగాభద్రతరణిర్వృహత్పత్రికేసరా। మహాసహా॥ యనిధన్వంతరి? ఘంటువునఁగలదయని, శబ్దరత్నాకరము-కుబ్జికాప్రభృతులు కోశముల మృగ్యములు-తత్పర్యాయమగు మహాసహా యన. ని. అమ్లానస్తు మహాసహా యని యమరము. అనఁగాఁ దెద్దగోరంట. అమ్లానమనగాఁ బెద్దరేకుల చేమంతియని కొందఱును, పెద్దగోరంటయని కొందరు నను చున్నారు.

కుబ్జిక - క్షుద్రవనము - గొజ్జంగియనికొందఱు. కుబ్జకమున, నొకపుష్పము. "శ్లో అశోకాత్పుష్పసాహస్రాత్సేవతీపుష్పముత్తమ - సేవతీపుష్ప సాహస్రాత్కుబ్జకం పుష్పముత్తమ" మ్మని నారసింహము, అని వాచస్పత్యము - గొజ్జంగియన, గేదంగి మొగలియనికొందఱును, పెద్దరేకుల చేమంతియని, శబ్దకల్పకమున, బ. సీతారామాచార్యులనుటచే నేదైననొక్క సుగంధపుష్పమయియుండును. గొజ్జంగిమందు - పైఁజెప్పినయొకజాతి పూవులబట్టినుండి తీసినసిరు. మాలతీరికాయ - మాలతీలతల సముదాయము, కాయమానము = పందిలి, గేయమాన - కీర్తింపబడు, పూసెజ్జ - పూపానుపు. అరవిందపుసుందరకరణిక - పద్మములయందుండు సుందరమైనబోద్దు; నీరజాక్షతనయుఁడు = మన్మథుఁడు, వలపటు - ఎడమ ప్రక్క, ఱేడురాజు - చంద్రుఁడు, వసంతుఁడు = మాధవుఁడు.

83. లతాంతధన్వుఁడు - పూవులే ధనుస్సుగాఁగలవాఁడు, సమ్మోహనుఁడు - లోకమునంటటిని మోహింపఁజేయువాఁడు,

85. నిండు...విభునకుజ - పౌరుషహీనుఁడు - అధక్ నారీశ్వరుఁడు, పుష్పిణీపద్మిని - రజస్వలయగు పద్మినీజాతిస్త్రీ; - వికసించిన పద్మలత; - బృందావిహారి - బృందతో విహరించిన కృష్ణుఁడు - బృందావనమందు సంచరించినవాఁడు, నాళీకసంగ్రస్తుఁడు - పద్మబాణమున; దగుల్కొనినవాఁడు - పద్మమునమున్నవాఁడు, చంద్రముఖి, పద్మాక్షి, అళిచికుర, మల్లికాహాస మొదలగువానియందలి చంద్ర, ప, ద్మాళీ, మల్లికలు, మేనమామ, బాణము, భటుఁడు, బాణమునగుటచే మన్మథునికి ప్రీతిపాత్రములు, కావున నట్టి విశేషణము లీయఁబడినవి.

88. మలిమ్లుచవర్గము - దొంగలగుంపు.

89. కల్యాగ్నిప్రాగ్రహరగ్ని, శతక్రతురాణి - శచీదేవి, తపన...కర్ణకుండలము - సూర్యునిముందర నడుచుచున్నవాలఖిల్యులయొక్క చెవికుండలము. నాసీకము - సేనాముఖము. పృతనానాయకుండు - సేనానాయకుఁడు. ప్రత్యూషపవనజుఁడు - ప్రాతఃకాలమనెడి యాంజనేయుఁడు.

90. వితత - విస్తారమైన. అభ్రస్థల - ఆకాశమనెడి, కాయమాన - పందిలియొక్క, వివర - రంధ్రములనుండి. ఆవిర్భూత - పుట్టిన. చాంద్రీలతా - వెన్నెలయను తీఁగసంబంధమైన, ఆతత - విస్తారమైన, తారావళి - నక్షత్రసముదాయమనెడి, కుందబృందములు = మల్లెమొగ్గలు. ప్రాతర్మౌని - ప్రాతఃకాలమనెడి ఋషి, భాఃపతి - సూర్యుని, ఆభ - కాంతి, బహిష్కృత - త్రోసివేయఁబడిన, నిర్మాల్యము - దేవతాదులుధరించితీసివేసినపుష్పాదులు; రాజు = చంద్రుఁడు, నిస్తేజుఁడు - కాంతిరహితుఁడు,

91. చరమదశ=అంత్యదశ; వసుజాలము=కిరణముల సమూహము=ధనము, మిత్రుఁడు=సూర్యుఁడు; స్నేహము=మైత్రి=చమురు

92. అరవిందాలయ=పద్మాలయ=లక్ష్మి; సాంధ్యవేళ=సంధ్యాకాలమందు హిమధామ=చంద్రునియొక్క, అంశు + ఉరు + దాసావళి=కిరణములనెడి భటుల చేతను; సమ్ముద్రిత=మూయఁబడిన; పద్మసద్మములు=పద్మగృహములు; దళసంవాన + ఆగవంబులు=షట్పదసముదాయముయొక్క ధ్వనులు; విభాకర=సూర్యుని. గోవర్గము =కిరణసముదాయము; భుజిష్యసంతతులు=సవుకలుఁ; కల్యాది=ప్రాతఃకాలము; తా మగలంజొచ్చె=తానుదిరిగివచ్చి ప్రవేశించెను=తామరలోఁబ్రవేశించెను; నలముల్ =పద్మములు; మాసన్నిధానములు=లక్ష్మిసన్నిధానములు.

93. తారకా...తీర్థము=తారకాగణమనెడి ఋష్యాదులు స్నానముచేసె డునోటు; రాగవిభాంశుకులు=ఎఱ్ఱని కాంతి కిరణములు గలవారు=కాషాయ వస్త్రములుగలవారు; భానుఁడు=సూర్యుఁడు; కంజవిరోధి=చంద్రుఁడు.

94. ధ్వాంతనక్రము=చీఁకటియనెడి మొసలి; సమయ=కాలము; కంధి-సముద్రము; సోమపుటము=బంగారుకుండ; కల్యకారుఁడు=ప్రాతఃకాలమనెడి విశ్వకర్మ; ప్రాగ్వనిత=పూర్వదిక్కనెడి స్త్రీ; ఉత్క్షిప్త-ఎగరవేయఁబడిన, కందు కంబు=చెండు, భావి=రాఁబోయెడి, రాత్రినిశాకర=రాత్రికిని, చంద్రునకును, పరిణయంబు=వివాహము, సాక్షతపాత్రము=అక్షతలతోడిపాత్రము.

95. పాకచయము=పిల్లలసమూహము, హరిక్షవ=పద్మము, భానుభానీకము=భాను + భా + అనీకము=సూర్యునికిరణములనెడుసేన, భటాళి=సవుకలుఁ, ఆళిప్రకరంబు=తుమ్మెదలసమూహము.

96. బాష్పముల + కన్నులఁ=బాష్పములతోడి కన్నులను తృ. త. స. బాష్పములుగలకన్నులు— క ధా. స. తావిమొల్లమొదలగునవి, మతుబంతముతోఁ గర్మధారయసమానములు గలవని యధర్వణమతము, కాన, "బాష్పముల్గన్ను" లను ప్రయోగము నిర్వివాదము. బాష్పములకన్నులనుచో లట్టుమీఁది యత్వలోపమును బ్రయోగసిద్ధము.

97. భర్మహర్మ్యాంతరము=బంగారుమేడయొక్క లోపలిభాగము, నగరీలలామంబు=నగరములలో శ్రేష్ఠమైనది, పరంగటఁ=సమీపమున; తరంగలోచనలు=స్త్రీలు; ఆలాపిత=ఆలాపనచేయబడిన; యువపుంగవులు=పిన్నవయిస్సుగల పురుషశ్రేష్ఠులు, నిశాంతము=గృహము, ప్రియోపవిష్ట=ప్రియురాండ్రచే నుంచఁబడిన. అష్టాపదాంగి=కనకాంగుల చేత, నినాదిత=మ్రోఁగింపఁబడిన, పల్లకీ—వీణ, నీలపట్టాం

ఒరము=నల్లనైనపట్టువస్త్రము, వితానము=ఉల్లాఘము, విరాజిత=ప్రకాశింపఁబడిన శాతకుంభ=బంగారము, పాలయాలికలు=ప్రణయకలహములు, చాటువాక్యము=ప్రియవాక్యము, అన్యవరవర్ణినీ=పరస్త్రీ. మకరికా=పాలిండ్లమీఁద వ్రాయు మకరికా పత్రములు, భుజంగులు=విటులు=కుటిలమార్గముగలవారు, తప్తకాంచన ప్రత్యుప్త జలజాప్తమణి=పుటము వేసి బంగారు చేత మాటఁబడిన సూర్యకాంతమణి.

98. రత్న నికర = రత్నసముదాయము; మందారము = పారిజాతము; కనక=సంపెఁగ, అరవింద=పద్మములు; కుందాళి=మల్లెమొగ్గలుసమూహము; జగడంబు=విస్తారకాంతిగల; జాళువ=మేలిమిబంగారము; శృంఖలములు=గొలుసులు. దాంత=దంతిసంబంధము; యంత్రిపాంచాలిక=యంత్రములచేఁజేయబడినబొమ్మలు.

99. కురువులు-తొడలు; వాగ్నజిత-అయోధ్యారాజకొమార్తె; (మిత్రవిందలోత్తఇదితప్పు). మిత్రవిందయొత్తయని యేకవచనముండనగును.

## చతుర్థాశ్వాసము.

12. బాణాసురుఁడు=వేయి చేతులుగలవాఁడు: సమారా=సమారగస్వామి=పండ్రెండు చేతులుగలవాఁడు; మారగురు=నారాయణుఁడు=నాలుగు చేతులు గలవాఁడు; పంక్తిముఖుఁడు=రావణుఁడు, యిరువది చేతులుగలవాఁడు

13. ఇన్నగవరసతులు= ఈనరవరు భామినులు; కిన్నగవగసతులు= కిన్నరులు. దేవయోనివిశేషములు. పన్నగవరసతులు=నాగలోకభామినులు=భోగినులు.

15. శ్రీ + రామ + సుతునసుత=బ్రహ్మపుత్రుఁడు=నారదుఁడు; శ్రీరామునిసుతులు=కుశలవులు; శ్రీరామసుతులు=శివపుత్రులు-విఘ్నేశ్వరుఁడు, కుమారస్వామి; రాము=మనోజ్ఞము; సుగీతి=గానము.

19. మారకుమారుఁడు=మారుఁడనెడి కుమారుఁడు; విక్రమకుమార=విక్రమమునకు గుమారస్వామి; మద+అసుర+మారగ=మదించిన రాక్షసులను గొట్టువాఁడు; వారిజనేత్ర=ప్రభావతి; నేత్రియనరాదు. అంగగాత్రములకే జేప్పవచ్చుక్: తదన్యములకు సంయోగోపధంబులకు టాప్పవచ్చును. "అంగగాత్రకంఠేభ్యోవక్తవ్య"మని వార్తికము.

27. మైజారు చేఁగు=కొంగియంచుచెంగు; సరిబారు=దండలు; నెఱి డాలు=అందమైనకాంతులు; మారుగరిడీలు=మన్మథక్రీడలు.

21. కార్యోపండో=ఇదిజాతీయము. కార్యము వెఱవేఱినదా! లేదా! యనుటకు

25. కౌత్యము=మాతకృత్యము, తద్ధి.

28. శ్రుతిమంజులత=కర్ణాంతవిశ్రాంతి; మహోజ=మన్మథా. ని. అజశ్శంభో శిష్ణుర్ధాతో ర్రికామేచ్ఛాగేరఘూస్స్మృతే, అని, నానా. మాసదనము-మాయిల్లు, మా + సదనము=లక్ష్మీగృహము;

31. కుథా=చిత్రకంబళము.

32. దనుజజాతివినీవు: నేను మనుజజాతిని. ఇదియసవర్ణవివాహము. ఇట్టివివాహములు పూర్వమునుండియు జరుగుచుండుట లోకశాస్త్రసామాన్యము. ప్రభావతి బ్రాహ్మణస్త్రీ, ప్రద్యుమ్నుఁడు క్షత్రియపురుషుఁడు. శర్మిష్ఠయయాతి; హిడింబ భీముఁడు.

44. రవివనితా-తప్పు-రతివనితా యని యుండఁదగు. సీమంతము=పాపట; పావజత=పాదుకాయుగ్మము: పాప, ఇది నిత్యబహువచనాంతముగా నుండవలయు. ఏకవచనముకూడదు. సూ- స్తనాదౌద్విత్వవిశిష్టాజాతిః- అని వామనసూత్రమున్నను, ఏకత్వప్రయోగములు విరళములు. ఇచట సమాసమగుటచేఁ పావఁజత, పావజతయనియు నుండఁదగు.

45. కేలుమోడ్చి-అంజలిపట్టి; దీనికి బహువచనములేదు. ఇదియే నిత్యబహువచనాంతము. మజ్జా-ఇది యవ్యయము. ప్రశంసనార్థకము.

46. శాతమన్యవమణి=శతమన్యుఁడు, ఇంద్రుఁడు. అతనిమణి యింద్రనీలమణి. తద్ధి.

47. కార్ష్ణి=కృష్ణునిపుత్రుఁడు, తద్ధి. ప్రద్యుమ్నుఁడు.

48. అలకలు=కుంతలములు=అలుకలు. అలకలు గ్రామ్యము. స్నేహము=చనువు=మైత్రి, నిశాసంపర్కము=పసపుకూడిక-రాత్రికూడిక, కరతల+అమలకంబు=అరచేతిలోని యుసిరికాయ. (సుస్వాధీనము) నలుఁగుఁబిండి. నర్మోక్తులు=భావగర్భితవాక్యములు. వేమరుశరములు—వే+మరుశరములు=మన్మథబాణములు. వేమఱు+శరములు. శ్లేషయందు రేఫఱకారములకు మైత్రి. ప్రాక్క-విసమ్మతము-వేమరు అని రూపాంతరమునుగలదు.

56. మఱి + ఒక్కటి + ఓటచేఁ.

58. వార్చెఁ=(క్షాళనముచేసెను) శుద్ధిచేసెను.

63. ముష్టితనము=పిడికిటఁబట్టఁజాలిన సూక్ష్మత. దారిద్ర్యము.

86. [illegible] వ్యాసు—

చ. పన్నగ[illegible] ంబరుఁ డేయు సాయకములన్ ♦ వారింపఁగారాదు నూ
తన[illegible]బా[illegible]ధికయౌవనంబుమదికిన్ ♦ ధైర్యంబురానీయ ది
[illegible]రక్తిన్ మిముఁబోంట్లకున్ దెలుప నా ♦ నా సిగ్గుమైకోదు పా
[illegible]నకంళాంబు స్వతంత్రమీయదుచెలీ ! ♦ వాంఛల్ తుదల్ముట్టునే.

అనుపద్యమును బోలియున్నది.

71. కృతకాద్రి=కల్పతగిరి.

89. ఘోరవప్రద్యుమ్నఘనబాణకోటులలరె— ఇచటఁబ్రద్యుమ్నశబ్దము నందలిరేఫమూఁదదయ్యె. కం. వేంకటపదదుఁడు నెలయ ని । రంకుశ విస్ఫురణమూఢ ప్రజ్ఞానురణని । శ్శంకితపాప్రసవమునక । లంకితకీర్తిప్రభావలక్ష్ములవోలెన్. రాఘవ పాండవీయము ఆ 1.

91. రోపము=బాణము.

93. బాహ్మమస్త్రము=బ్రహ్మాస్త్రము.

95. భిదురము=వజ్రాయుధము.

102. రమ్డోలు=Drum డ్రమ్ము అనెడు డోలు, ఇవి రెండునుగలిసి "రమ్డోలు" అనుపదమయ్యె.

104. గీ. పంచపాదె-ఇట్టిపద్యములు మధ్యకవులును బ్రయోగించిరి.

106. శ్రీరాజీవమహోదయుధాయ- భవతే- శ్రీకామినీసూనవే - నీరా య- ప్రకటప్రతాయ- నశసే- విష్ణుస్వరూపాయ- తే- మామ గానుజసుతాం- అనువానియందలి సంస్కృతచతుర్థీ ద్వితీయావిభక్తులప్రయోగములును, దాక్షాయణి యను సంస్కృతశబ్దంతమును, గడపటియనుకరణముతోఁ గూడియుండుటంజేసి సాధువులు.

110. సాంధ్య...విహార=సాయంకాలమున నాఁడ్యింపఁబడిన జంపతా ళముతో నటించుచున్న శివునియందు నివసించియొప్పుచున్న జటాజూటమందైన కొలనిలోపలినుండి తీవ్రవేగము చేతఁ బొర్లుచున్న యాకాశగంగయందుఁ బుట్టినసురు గువంటి కీర్తిచేవిహరించువాఁడా రిపు...ప్రభా=శత్రుశౌర్యముయొక్క పోఁగొ ట్టఁబడిన ప్రనగలవాఁడా.

111. సమాశ్రిక్రియ=దేవతాపూజ; క్షమాదైవతా=భూదేవులు. కల్ప భూజము-కల్పవృక్షము.

